మంగళము మారుతికిని గూర్పంగఁ గోరి
నియమమును బూని సీత యగ్నిని భజించె
అగ్నిదేవ! హనుమంతు శైత్యంబుగూర్పు
మనుచు సీత ప్రార్థనచేయ నగ్ని వినియె.

హితం మహార్థం మృదు హేతుసంహితం
వ్యతీత కాలాయతి సంప్రతిక్షమం
నిశమ్య తద్వాక్య ముపస్థితజ్వరః
ప్రసంగ వానుత్తర మేతదబ్రవీత్.

హిత నిర్ధారణచేసి యుక్తముగ గావింపంగ నౌనంచుఁ బల్
స్తుతనహా కితెగ యుక్తి యుక్తముగ నెంతో గొప్ప యర్థంబు నీ
మతి కెంతో తగియున్న దిప్పటికి సొంపై ముందుగా నీ మతి
ట్లితఁడింనాని క్షమంబయైన గతినిట్లే మంత్రులందట్టులన్.

ధర్మాత్మా రక్షసాం శ్రేష్ఠ స్సంప్రాప్తోఽయం విభీషణః
లంకైశ్వర్యం ధ్రువంశ్రీమా, నయంప్రాప్తో హ్యకంటకం
యుద్ధ, 41-67

విను ధర్మాత్ముఁడు గుణకం
ధినుతుండు విభీషణుఁడు గనెను నాశరణున్
కని శ్రీమంతుఁడు ముఖ్యుం
డని లంకైశ్వర్యము ధ్రువమందెను జుమ్మీ.

మహావజ్రపాతా శనిపాతాన్న చుక్షుభే నచాపిచచాలరాజా
సరామ బాణాభిహతో భృశార్త శ్చచాలచాపంచమమో చవీరః
యుద్ధ, 59-139

యోధముఖ్యుఁ డేరావణు డుగ్రవజ్ర
పాతమున, నశనిహతిని స్వల్పమైన
క్షోభపడఁడొ చలింపఁడొ యాబలుండు
రామశర విద్ధుఁడగుచు విల్వదలె వణఁకె.

యస్య విక్రమ మాసాద్య రాక్షసా నిధనంగతాః
తం మన్యే రాఘవం వీరం నారాయణ మనామయం.
యుద్ధ, 72-10

యోద్ధ యగు రాముఁడెంత మహాబలుండొ
అతని యస్త్రాలు నెంత మహాత్తుగలవొ
ఎవని విక్రమమున దైత్యు లెల్లఁజచ్చి
రాయభయు రాముఁదలఁతు నారాయణునిగ.

నతే దదృశిరే రామం దహంత మరి వాహినీం
మోహితాః పరమా స్త్రేణ గాంధర్వేణ మహాత్మనా.

యుద్ధ

సమ్మోహనా స్త్రాన సమ్మూఢులై రి రిపుమ
నఃఖరు శూరుని రాముని గ్గనరు పోర
వేల రాముల నరసి మరల నొక్క
రామునె గాంతురు రాక్షసాళి.

ప్రణమ్య దేవతాభ్యశ్చ బ్రాహ్మణేభ్యశ్చ మైథిలీ
బద్ధాంజలిపుటాచేద మువాచాగ్ని సమీపతః.

యుద్ధ

ప్రథిత దేవ విప్రుల సీత ప్రణుతి చేసి
అగ్ని దరిఁ గేలు జోడించి యనియె నిటులు
నా మనసు రాముని విడి పరుం దలఁపదేని
లోకసాక్షియౌ నగ్ని నన్ బ్రోచుఁగాక.

చలనా త్పర్వత స్యైవ గణా దేవస్య కంపితాః
చచాల పార్వతీచాపి తదాఽఽశ్లిష్టా మహేశ్వరం.

చోటుఁ గని రావణుండు నా క్షోణిధరము
నిటులు నటులును వేగఁ గంపింపఁజేయ
దేవగణముల్ వడంకిరి దేవదేవు
గౌఁగలించుకొని యుమయుఁ గూడ వడఁకె.

దారాః పుత్రాః పురం రాష్ట్రం భోగాచ్ఛాద భోజనం
సర్వమేఽ వావిభక్తం నో భవిష్యతి హరీశ్వర.

ఉత్తర,

దయిత లాత్మజుల్ సర్వప త్తనము రాష్ట్ర
మఖిల భోగ మాచ్ఛాదనాహారములును
ఓయి కపిరాజ ! నీకును నుర్వి నాకు
నెల్లను నవిభాజ్యములుగ నెసఁగుఁ గాక.

యామేవ రాత్రిం శత్రుఘ్నః పర్ణశాలా ముపావిశత్
తామేవ రాత్రిం సీతాపి ప్రసూతా దారక ద్వయం.

ఉ త్తర

ప్రీతిని శత్రుఘ్నుండు ద
యాతత హృదుఁ డేనిశితటి నా పర్ణకుటిన్
(త్) ఏతెంచెనో యా రాత్రియె
సీత యిరువురు కొమరులను చెచ్చెఱఁ గనియెన్.
ఇదం రామాయణం కృత్స్నం గాయత్రీ బీజ సంయుతమ్
త్రిఃసంధ్యం యఃపఠేన్నిత్యం, సర్వ పాపైః ప్రముచ్యతే.

ఈ యది రామాయణ మిటు
గాయత్రీ బీజ వర్ణ కలితము, సతమున్
ఏయెడఁ ద్రిసంధ్యలను శ్ర
ద్ధాయుతుఁడై చదువఁ బాప తమము నశించున్.

గోవిందరాజీయ వ్యాఖ్య ప్రకారము గాయత్రీ
బీజాక్షరయుత రామాయణము

* ఈ గుర్తుగలవి బీజాక్షరములు.

1. సవితుర్వరేణ్యం భర్గొదేవస్య ధీమహి
ధియో యోనః ప్రచోదయాత్, అని గాయత్రీ మంత్రము.

*

1. సతేన పరమాస్త్రేణ మానవేన సమాహతః
సంపూర్ణం యోజనశతం క్షిప్తస్సాగర సంప్లవే.
బాల. 30-19

*

2. విశ్వామిత్రో మహాతేజా భూయస్తేపే మహాతపః
తతః కాలేన మహతా మేనకా పరమాప్సరాః

బాల. 63-3

*

3. చతురశ్వో రథశ్శ్రీమాన్ నిస్త్రింశో ధనురుత్తమమ్.
వాహనం నరసంయుక్తం ఛత్రంచ శశిసన్నిభం

అయోధ్యా. 14-36

*

4. వర్తతే చోత్తమాం వృత్తిం లక్ష్మణోఽస్మిన్ సదానఘః
దయావాన్ సర్వభూతేషు లాభస్తస్య మహాత్మనః

అయోధ్యా. 44-5

*

5. ద్వారేణ వైజయంతేన ప్రావిశ చ్ఛ్రాంత వాహనః
ద్వాస్థైస్సరుత్థాయ 'విజయం' పృష్టస్సైస్సహితోయయౌ.

అయోధ్యా. 71-33

*

6. ఉటజే రామమాసీనం జటామండలధారిణం
తంతు కృష్ణాజినధరం చీలవల్కలవాససం.

అయోధ్యా. 99-22

*

7. తేవయం వనమత్యుగ్రం ప్రవిష్టాః పితృశాసనాత్
ద్రష్టుమిచ్ఛామహే సర్వేభగవంతం నివేద్యతాం.

అరణ్య. 12-14

*

8. మమభర్తా మహాతేజా వయసా పంచవింశకః
అష్టాదశ హివర్షాణి మమజన్మనిగణ్యతే.

అరణ్య. 47-10

*

9. తతః పరమ సంహృష్టో హనుమాన్ ప్లవగర్షభః
ప్రత్యువాచ తతోవాక్యం రామం వాక్యవిశారదః

కిష్కింధ. 4-3

10. సకామినం దీన మదీనస త్త్వం శోకాభిపన్నం సముదీర్ణకోపం
నరేంద్ర సూనుర్న ర దేవ* పుత్రం రామానుజం పూర్వజమిత్యువాచ
కిష్కింధ. 4-3

*

11. తతో రావణ నీతాయా సీతాయా శ్శత్రుకర్శనః
ఇయేష పదమన్వేష్టుం చికీర్షన్ కర్మ వానరః

సుందర. 1-1

*

12. తత స్తస్య నగస్యాగ్రే హ్యారూఢస్య దంతినః
భర్త్రా పరిగృహీతస్య జానకీ స్కంధమాశ్రితా.

సుందర. 27-16

*

13. నావమాన్యో భవద్భిశ్చ హరిః ధీర పరాక్రమః
దృష్టాహి హరయః పూర్వంమయా విపులవిక్రమాః

సుందర. 46-9

*

14. శ్రుత్వా హనుమతో వాక్యం యథావ దభిభాషితం
రామః ప్రీతి సమాయుక్తో వాక్యముత్తరమబ్రవీత్.

యుద్ధ. 1-1

15. యస్తు సత్యమసౌ పక్షంరామ స్యాశ్రిత తిష్ఠతి
రక్షోగణ పరిక్షిప్తో రాజా హ్యేష విభీషణః

యుద్ధ. 28-27

16. తేజో వీర్యం బలం చౌజ ఉత్సాహశ్చ మహాగుణః
ప్రదర్శసంచ బుద్ధి*శ్చ స్మృతిశ్చ ద్విగుణంతయోః

యుద్ధ. 50-40

17. కుంభకర్ణం హతంధృష్ట్వా రాఘవేణ మహాత్మనా
రాక్షసా రాఘవేంద్రాయ రావణాయ* న్యవేదయన్.

యుద్ధ. 68-1

*

18. విజ్ఞాయతు మన స్తస్య రాఘవస్య మహాత్మనః
సన్నివృత్యా హతా త్తస్మాత్సం వివేశపురంతతః

యుద్ధ. 81-1

*

19. మరణాంతానివై రాణి వి_స్తృతంనః ప్రయోజనం
క్రియతామస్య సంస్కారో మమాప్యేష యథాతవ.
యుద్ధ. 112-26

20. ఏవమే తత్పురావృ_త్తమాఖ్యానం భద్రమస్తునః
ప్ర*వ్యాహరత విస్రబ్ధం బలం విష్ణోః ప్రవ_ర్తతాం.
యుద్ధ. 31-124

*

21. తతఃప్రచోదయన్సూత స్తానశ్వాన్ రుధిరప్రభాన్
ప్రయయౌ భీమసన్నాదో యత్రరక్షః పతిః స్థితః
ఉ_త్తర. 41-1

22. విసృజ్య మహాబాహుః ఋక్షవానర రాక్షసాన్
భ్రాతృభిస్సహితో రామః ప్రముమోద*సుఖంసుఖీ.
ఉ_త్తర. 41-1

23. సురాహికథయంతి త్వామాగతం శూద్రమాగతః
బ్రాహ్మణస్య తుధర్మేణ త్వయా*జీ వాపితస్సుతః
ఉ_త్తర. 76-27

*

24. ఏవమేతత్ పురావృ_త్త మాఖ్యానం భద్రమస్తునః
ప్రవ్యాహరత విస్రబ్ధం బలం విష్ణోః ప్రవ_ర్తతాం.
ఉ_త్తర. 111-28

## —: రాముని వనవాసకాలము :—

(గోవింద రాజీయమునను సరించి)

1వ రోజున చైత్రశుద్ధ దశమినాడు వనవాస ప్రయాణము- రాత్రి తమసాతీర వాసము.

2వ రోజున జాహ్నవీ తీరవాసము-గుహునిరాక.

3వ రోజున గంగాదక్షిణ తీరతరువు క్రిందనుండుట.

4వ రోజున ప్రయాగలోనుండుట—భరద్వాజ దర్శనము.

5వ రోజున యమునాతీర వాసము—చిత్రకూటప్రవేశము.

6వ రోజున సుమంత్రుడు అయోధ్యకు వచ్చుట—రాత్రి దశరథమృత్యువు

7వ రోజున కౌసల్యాదుల విలాపము—భరతునికై దూతలఁ బంపుట.

8వ రోజునుండి 12వ రోజువరకు భరతుని అయోధ్య ప్రయాణము.

13వ రోజువరకు పౌరలౌకికకర్మ.

17 నాలుగు దినములు వనమార్గము బాగుచేయుట.

20వ రోజువరకు భరతుని వనప్రయాణము.

21వ రోజునుండి రామునిదగ్గఱ భరతుడు మూడురోజులుండుట.

27వ రోజున తిరిగి అయోధ్య పాదుకలతో వచ్చుట. ఇంకను మధ్యమధ్య రోజులు లెక్కింపగా మరల పాదుకలకు పట్టాభిషేకమువరకు 45 రోజులయ్యెను.

శ్రీరాముడు చిత్రకూటమున పదిన్నర మాసములుండెను. మొదటి సంవత్సరము ఇట్లు గడచెను. పిదప చిత్రకూటమును విడచి దండకారణ్యమును ప్రవేశించి ఋషుల ఆశ్రమములను చూచుచు గడపినవి పదిసంవత్సరములు. పిదప పంచవటిలో ఒకటిన్నర సంవత్సరములు గడపెను. ఈ విధముగ ఒకటి, పది, ఒకటిన్నర కలిసి పన్నెండున్నర సంవత్సరములు.

పన్నెండున్నర సంవత్సరము లయ్యెను. తరువాత పదుమూడవ యేడు కొంచెము మిగిలియున్న దనఁగా మాఘశుక్ల అష్టమినాఁడు "విందము" అను

త్రయోదశివరకు ఇంద్రజిత్తుతో లక్ష్మణుని యుద్ధము- ఇంద్రజిత్తు వధ.

చతుర్దశి- యుద్ధ విరామము.

ఫాల్గుణ అమావాస్య- రావణుని యుద్ధయాత్ర.

చైత్రశుద్ధ పాడ్యమి నుండి రామరావణ యుద్ధము.

షష్ఠి. అష్టమి- మహాపార్శ్వాది వధ.

నవమి- లక్ష్మణుని మూర్ఛ, రావణ పలాయనము, ద్రోణ పర్వతమును దెచ్చుట.

దశమి- యుద్ధ విరామము.

ఏకాదశి- ఇంద్రుడు రామునికి రథము పంపుట.

ద్వాదశి నుండి బహుళ చతుర్దశి వరకు 18 రోజులు రామ రావణ యుద్ధము.

చతుర్దశి- రావణ వధ.

(మొత్తము 18 రోజులు యుద్ధ విరామము)

మొత్తము 72 రోజులు యుద్ధము.

అమావాస్య- రావణునికి సంస్కారము.

వైశాఖ శుద్ధ పాడ్యమి- విభీషణుని పట్టాభిషేకము.

తదియ- సీత అగ్నిప్రవేశము.

చవితి- పుష్పక మెక్కి భరద్వాజాశ్రమమునకు వచ్చుట.

షష్ఠి- నందిగ్రామములో భరతునితో కలియుట.

వైశాఖ శుద్ధ సప్తమి- శ్రీరామ పట్టాభిషేకము.

శ్రీ కోమర్రాజు లక్ష్మణరావుగారి హిందూదేశ చరిత్రననుసరించి

## —: అయోధ్యనుండి లంకకు రాముని ప్రయాణము :—

1. అయోధ్యనుండి ప్రయాగ–భరద్వాజాశ్రమము.

2. భరద్వాజాశ్రమములో ఒకరాత్రి రాముడుండెను.

3. భరద్వాజాశ్రమము నుండి చిత్రకూటము పది క్రోశములదూరము. క్రోశము అనగా పదిన్నర మైళ్లు.

4. చిత్రకూటము దగర మందాకిని నది యున్నది. అదినేడును గలదు. అక్కడనుండి యాగ్నేయముగా వెళ్ళెను.

5. అత్రి యాశ్రమము. ప్రస్తుత రీవా ప్రాంతమునుండి దక్షిణసీమ వరకు. ఇక్కడ అనసూయతో సీత మాటాడెను.

6. అత్రి యాశ్రమమునుండి దండకారణ్యము. దీనికుత్తరమున గంగ దక్షిణమున వింధ్య, పడమట ఉత్తరవింధ్య అత్ర్యాశ్రమము. దక్షిణవింధ్య దక్షిణ కోసలము, విదర్భ, దక్షిణాపథిలో మలయాద్రి, దక్షిణమున ద్రవిడ, పాండ్యములు గలవు. తూర్పున ఉత్కళ కళింగములు, ఆంధ్ర చోళములు గలవు. (సిరగుజా ప్రాంతము)

7. కొంత దూరములో విరాధుడు కన్పడెను, బిలాసపూర్‌కు ఈశాన్యముగా నున్నది. 15 మైళ్లు.

8. ఇట శరభంగాశ్రమము కలదు. ఇచ్చట శరభంగుఁడగ్నిలోఁ జొచ్చెను. ఇచ్చటనే చంపఁబడిన మునుల యెముకల గుట్టలున్నవి. ఇచ్చటనే రాక్షసులఁ జంపెదనని రాముఁడు ప్రతిజ్ఞ చేసెను.

9. సుతీక్ష్ణాశ్రమములో రాత్రియుండెను. ఇక్కడే కొండలు, నదులు, అరణ్యములున్నవి. కొంతదూరములో పంచాప్సరస్సరస్సు గలదు. ధర్మభృతుఁడు దీనినిగూర్చిన కథలు చెప్పెను. ఇచట మాండకర్ణి తపస్సు చేసెను, విలాసపూరు, రాయపూరు జిల్లాలకు మధ్యగానున్నది. ఇటనే రామగిర్యాశ్రమము గలదు.

10. సైయ్యాశ్రమము నుండి దక్షిణముగా నాలుగు యోజనములలో (120) మైళ్ళలో అగస్త్యాశ్రమము గలదు. యోజనమనగా 30 మైళ్లు. ఇది రాయపూరునకు దక్షిణముగా బస్తరు సంస్థానమునకు ఉత్తరమున గలదు.

11. అగస్త్యభ్రాతయాశ్రమమునకు అగస్త్యునియాశ్రమముయోజనము.

12. అగస్త్యుని యాశ్రమమునకు రెండుయోజనములలో పంచవటి గలదు

13. గోదావరి యిక్కడనే గలదు. ఇక్కడనే పర్ణశాల నిర్మించుకొనిరి, భద్రాచల ప్రదేశము పర్ణశాలా ప్రదేశము. మహారాష్ట్రములో నాశిక పర్ణశాల ప్రాంతము గాదు.

14- పంచవటికే శూర్పణఖ వచ్చినది. ఇక్కడనే ఖరాదులు చంపబడిరి. ఈ ప్రాంతమే జనస్థానము. వాల్మీకి వర్ణించిన శంబరపురము సంబలపూరు.

15. సీతను రావణు డెత్తికొనిబోయిన తర్వాత రెండామడలలో నున్న భద్రాచలము దగ్గర గోదావరి దాటిరి. ఇక్కడనే జటాయు వుండెను. అక్కడ నుండి పడమరగా నైఋతి దిశగా కొంత దూరమువెళ్లిన మరల జనస్థానము పిదప మూడు క్రోశములలో నున్నది.

16. క్రౌంచారణ్యము నైజాము రాజ్యమునకు నైఋతిగా నున్నది. ఇట నుండి మూడు క్రోసులు వెళ్ళగా కబంధుడు కనిపించి చెప్పగా పడమరగా పంపా సరస్సు చేరిరి. పంప బళ్ళారి జిల్లాలో గలదు.

17. హంపి- ఋశ్యమూకము, మాల్యవంతము. కిష్కింధ ఇవి యన్ని యును హంపీ విరూపాక్షాలయము దగ్గరనున్నవి ఆనెగొంది దగ్గర కొన్ని కొండలుగలవు.

18. ఆ కిష్కింధ నుండి పర్వతాలు దాటిన రామేశ్వరము గలదు. అక్కడే వంతెన గట్టిరి. అక్కడ సముద్రముదాటి లంకకు వెళ్ళిరి.

—: × :—

## -: అయోధ్యనుండి లంకకు మార్గము :-





రచయిత:

చర్ల గణపతిశాస్త్రి

# రామాయణకథ

## అరణ్యకాండ

| వరుస నెం. | విషయసూచిక | పుట |
|---|---|---|
| 1 | రాముడు తాపసాశ్రమములకు పోవుట | 1 |
| 2 | రాముడు విరాధుని చూచుట | 4 |
| 3 | లక్ష్మణుఁడు విరాధుని జంపెద ననుట | 6 |
| 4 | విరాధుఁడు రామలక్ష్మణులఁ దాకుట | 8 |
| 5 | విరాధుని పూర్వజన్మ – గోతిలో పూడ్చుట | 10 |
| 6 | రాముని శరభంగ దర్శనము | 12 |
| 7 | రాముడు శరభంగుని గలియుట | 14 |
| 8 | ఋషులు రాముని దర్శించుట | 16 |
| 9 | రాముఁడు సుతీక్ష్ణుని జూచుట | 18 |
| 10 | సుతీక్ష్ణుఁడు రామాదుల సత్కరించుట | 20 |
| 11 | రాక్షసులతో పగ వలదని సీత చెప్పుట | 22 |
| 12 | రాముడు ఆర్తులగు మునుల రక్షింతు ననుట | 26 |
| 13 | మాండకర్ణి ఆశ్రమ దర్శనము | 30 |
| 14 | రాముఁడు అగస్త్యుని ఆశ్రమమున కేగుట | 32 |
| 15 | అగస్త్య భ్రాత ఆశ్రమమున కేగుట | 34 |
| 16 | రాముఁడు అగస్త్యుని చూచుట | 38 |
| 17 | రామునికి అగస్త్యుఁడాయుధముల నిచ్చుట | 40 |
| 18 | దండకారణ్య కథ | 42 |
| 19 | జటాయువు వంశ వర్ణన | 46 |
| 20 | రాముడు చిత్రకూటము నుండగోరుట | 48 |
| 21 | హేమంతఋతు వర్ణన | 50 |
| 22 | రాముడు భరతుని మెచ్చుకొనుట | 54 |
| 23 | రాముని శూర్పణఖ చూచుట | 56 |
| 24 | శూర్పణఖ తన కథ చెప్పుట | 58 |
| 25 | శూర్పణఖతో రామలక్ష్మణుల పరిహాసము– | 60 |

వనములను నియతాత్ములై వరలుచుండి
వీర వరులైన క్షత్రియుల్ వింటి చేత
చేయఁ దగునట్టి కార్యమె యేయదనఁగ
ఆర్తులగు వారి రక్షణ మన్న దొకటె. 124

శస్త్ర మెక్కడ, నెక్కడ శాంతవనము
క్షాత్ర మెక్కడ తపము లెక్కడ గ్రహింపు
ఇవి పరస్పరము విరుద్ధవృత్తి గలవి
శాంత వనదేశ ధర్మమె సలుపు మయ్య. 125

ఆయుధమ్ముల సేవించి నందువల్ల
కృపణులకుఁ బోలె బుద్ధి జనించుఁ జుమ్మి
వనమునుండి యయోధ్యకుఁ జనియు మరల
క్షాత్ర ధర్మము చరియింపఁ గలవు లెమ్ము. 126

సకల సామ్రాజ్య భోగముల్ సరగ విడచి
నీవు మునుల వ్రతంబు వహింతు వేని
అపుడు నా యుత్తమామ లత్యంత మైన
పరమమానంద మొంది యుందురు ధ్రువంబు. 127

ధర్మకార్యమువల్ల నర్థంబుగలుగు
ధర్మ మాచరించుటవల్లఁ దనరు సుఖము
ధర్మమున సమస్తమును సిద్ధంబె యగును
ధర్మసారమె యీసమస్తము జగంబు. 128

మన శరీర మాయా నియమములచేత
ఎంతొ యత్నించి కడుఁ గృశియింపఁ జేయ
పరమ ధర్మము మనకు సంప్రాప్త మగును
సుఖమువల్లను దొరకవు సుఖము లెపుడు. 129

సౌమ్య ! శుద్ధమతి వయి యత్యంత మీవు
అరసి యాతపోవన ధర్మ మాచరింపు
ఈ త్రిలోక వృత్తాంతము లెల్ల సరిగ
నీకు తెలియనియవి కావు నిపుణమతివి. 130

స్త్రీ స్వభావ చాపల్యాన జెప్పి తిటులు
నీకు ధర్మము చెప్పంగా నేర్చు నెవఁడు
భ్రాతతోడఁ గూడ మతి విచారణ యొనర్చి
త్వన్మతికి నచ్చునటు చేయు తడవు వలదు. 1 1

—: రాముఁడు ఆర్తులగు మునుల రక్షింతు ననుట :—

స్నేహమున నాకులముఁ దెల్పి నీవు దేవి!
జానకీ! ధర్మవిదురాల! సరిగ హితము
చెప్పితివి సరె మంచిది, తిన్నగాను
నేను చెప్పెడి సంగతిన్ వినుము కూడ. 132

ఆర్త శబ్దమె యుండరా దనుచు నెపుడు
క్షత్రియులు విల్లు ధరియింత్రు గాదె యంటి
సీత! దండకాటవి వ్రతశీలమునులు
నార్తులై వచ్చి నను శర ణందినారు. 1:3

ఎల్ల కాలము దుంపలు పళ్ళు తినుచు
నసురులకు భీతిలియు సుఖ మంద రెపుడు
వనుల నెప్పుడు నియమాలఁ దనరు మునుల
మనుజ మాంస జీవు లసురుల్ తినుచు నుంద్రు. 1.4

దండ కారణ్యవాసులౌ తపసు లెల్ల
రాక్షసులచేతఁ దినఁబడి రక్షలేక
నను శరణుఁ జొచ్చి రక్షింప మనిరి వారి
మాట విని వారి ముందిటు మాట యంటి. 135

"మీరనుగ్రహింపుడి యిటు మీరు నన్ను
చేరి కోర నాకెంతయున్ సిగ్గుచేటు
నన్ను నేమి సలుపమందు రన్న, వార
లందఱును నన్నుఁ జేరి యిట్లనిరి యపుడు. 136

"దండ కారణ్య వాసులౌ తాపసులము
కామ రూపులౌ పెక్కు రాక్షసులచేత
చంపఁబడు చుంటి మయ్య నిష్కారణముగ
నీవిపుడు మమ్ము కరుణ రక్షింప వోయి. 137

మాంసమును తిను రాక్షసుల్ మమ్మెదిర్చి
హోమముల వేళ పర్వాల నుతికి పడుదు
రట్టి వారి నుండియుఁ బ్రోచు నట్టి వార
లెవరో యని వెదకఁగ గతి వీవె యయితి. 138

స్వయముగా మేము తపః ప్రభావ గరిమ
రాక్షసుల నులువుగ నిటుల్ చంపఁగలము
అయినను చిరకాలమునుండి యార్జిత మగు
ఈతపము కర్చుపెట్టుట కిష్టపడము, 139

తపము బహువిఘ్న మౌచు నిత్యంబు చేయఁ
జాల నిది కాన రామః రాక్షసులచేతఁ
జంపి తినఁబడుచుండియు శాపములను
వారిపై విడువక సైచ పలసి వచ్చె. 140

దండ కాటవిఁ గలుగు దైత్యాళిచేత
నెంతొ బాధపడుదుము రక్షింపు మయ్య
వనిని మీసోదరులె మాకుఁ బరము గతియు
అనుచు వారు ప్రార్థింపఁగ నట్లె యంటి. 141

తీర కావఁగఁ బూర్ణప్రతిజ్ఞ చేసి
జీవముల నుండి మునులకుఁ జేసినట్టి
యిష్ట మైనయట్టి ప్రతిజ్ఞ యెట్లు నేను
చేయకుండ నుండుదుఁ జెప్పుసీత! నీవె. 142

ప్రాణముల నైన నిన్నైన ననుజ నైన
విడతుఁ గాని విశేషించి ద్విజుల కిట్లు
చేసిన ప్రతిజ్ఞ నెట్లు త్యజింపఁగలను
కాన తప్పక ఋషుల రక్షణము చేతు. 143

చేరి యసలిది వారలు కోరకుండ
చేయువలసిన పనియు; విశేషించి వారు
కోరఁగఁ బ్రతిజ్ఞ చేసియు నూరకుండు
టెట్లు జానకి! యిదియు వచింపవలెనె. 144

నీవు సౌహార్దమునను నాస్నేహమునను
నిట్లు చెప్పితివి యనఘ! యిందు నేను
మిగులఁ బరితుష్టిఁ బొందితి మేదిని నిట
నెవరు చెప్పరు గాదె యనిష్టులకును. 145

నీదు గొప్పకులమునకు నీకుఁ గూడ
నిదియె యనురూపమై తగినదియు సుమ్ము
నీవు నాప్రాణములకంటె నెంతొ గొప్ప
దానవును నింక నాసహధర్మ చరివి" 146

అని యిటు మహాత్ముడౌ రాముఁ డమఁగు ప్రియకు
మిథిల రాజపుత్త్రి కని సౌమిత్రితోడ
ధనుసు ధరియించి రమ్యమౌ స్థలము లొప్పు
నాతపోవనముల నెల్ల నరయునరిగె.

మొదటన్ రాముం డేగెను
పిదపన్ జానకియు నేగెఁ బిదప ధనుస్సున్
పదిలముగఁ బూని లక్ష్మణుఁ
డదనున నటు నిటులఁ గనుచు నరిగెను వనిలో

నానా ప్రదేశాల నగముల నలుప్రక్క
రమ్య మైనట్టి యరణ్యభువుల
చఱియల జలజల జాల్వాఱి పాఱెడి
సెలయేళ్ళు శుద్ధమై యలరు నదుల
ఇసుక తిన్నెల విహరించెడి బెగ్గురు
పక్షులఁ జక్కవ పక్షిగముల
కిలకిలలాడెడి జలవిహంగములను
విలసిల్లు పద్మాల కొలను సౌరు

మసలు లేళ్ళ గుంపు మదించు మహిషములను
అడవి పందుల చెట్టుల నడఁచు కరులఁ
గనుచు దవ్వేగి వారలర్కాస్తమయము
తఱిని యోజన దీర్ఘమౌ సరసు గనిరి,

కలహంసంబులు సారసంబులును నిక్వాణంబు గావింపఁగన్
జలజంతుల్ విహరింప పద్మములు భాసల్ చిమ్మగా శుద్ధమౌ
జలముల్ గల్గిన యాసరోవరమునన్ శ్రావ్యంపు వాదిత్ర గీ
త లసద్ఘోష మొకండు వీనులకు విందై వింత చేకూరిచెన్.

వ. అపుడు రామలక్ష్మణులు తమతో వచ్చిన ధర్మభృతుండను మునిని జూచి యిట్లడిగిరి. ఓ మహామునీ! ఈ యద్భుత మైన గీతవాదిత్ర ఘోషము వినఁగా మా కాశ్చర్యము కలిగినది. ఇది యేమి చెప్పఁగాఁ దెల్పఁ దని యడుగ ఆముని ఆసరస్సు పుట్టుకను గూర్చి యిట్లు చెప్పెను. 151

ఇది పంచాప్సర మనుసర
సిది తపసున మాందకర్ణి ఋషి నిర్మించెన్
పది వేలేం డ్లతఁడు గా
లిఁదిని జలమున నిలిచి యొనరించెను తపస్సున్. 152

అప్పు డగ్నిలో నగుదేవు లార్తిఁ జెంది
ఒకరి వొకరు కల్సికొని చెప్పుకొని రిట్లు
ఈ మునీంద్రుఁడు మన పదంబెదియొ కోరి
తపసు చేయుచు నున్నాఁడు తడయరాదు, 153

అనుచు దేవత లందఱు వ్యథను చెంది
మెఱుపు లటు మిలమిల లాడి మెఱయుచున్న
ప్రథితలౌ నైదుగురు నప్సరసలఁ బంప
వీరు మునినిగా మవశుఁ గావించినారు. 154

సురలపనికి నయిదుగు రప్సరస లపుడు
మునికి భార్యలు కాఁగ, నామునియు వారి
కీసరస్సున నొక్క యదృశ్య గృహముఁ
దీర్ప వార లిటు సుఖాలఁ దేలుచుంద్రు. 155

ముని తపః ప్రభావాన యౌవనము పొంద
వాని సంతోషపెట్టి రప్సరస లపుడు
తేలి క్రీడించు వారి వాద్యిత్ర నాద
మెంతొ భూషల ధ్వనిఁ గల్సి యింపు నింపు". 156

పూజ్యుఁ డగు నీయనుగ్రహమునను నేను
దారతో భ్రాతతో నగస్త్యాశ్రమంబు
చనియు నామునికిని మ్రొక్కి స్వయముగానె
సేవ చేయు నదృష్టము చెంద నెందు: 160

ఈ మహావాంఛ నాకుండె నో మహాత్మ!
ఇదియుఁ దీర్పవె యని రాము డిట్లు పలుక
నా మహర్షియు ధర్మాత్ముఁ డైన రాము
నరసి ప్రీతితో నపు డిట్లని వచించె. 161

నేనును నీకు నీవిషయ మిప్పుడు చెప్ప దలంచినాఁడ నీ
జానకి లక్ష్మణుం డిపుడు చక్కగ రాఁగ నగస్త్యుఁ జూడుమీ
ఏనును జెప్పకుండనె యదృష్టవశంబున నీవ యిట్టులన్
దీనిని ప్రచ్ఛ చేసితివి తెల్పెద విన్మి యగస్త్య సంగతిన్‌. 162

ఇప్పు డీయాశ్రమము నుండి యీవె యైదు
యోజనము లేగి, దక్షిణ మోలి చనఁగ
నలరు నాయగస్త్య భ్రాత యాశ్రమంబు
అది మహంతమై శ్రీమంత మగుచు నొప్పు. 163

సమతల మైన యావనిని చక్కని పిప్పలి చెట్లతో తోట ర
మ్యమగుచుఁ గానిపించు, నది యందము లైతగు పూలు పండ్లతో
నమరి. విహంగ కూజితము లంతట మీరఁ బవిత్రతీర్థమై
యమల జలంబులౌ నదుల హంసలఁ జక్కవలన్ మనోజమౌ. 164

అట మీరొక్కటి రాత్రి యుండి యుదయం బైనంత నో రామ! యే
గుట యుక్తం బగు, మీఁద దక్షిణముగాఁ గొండొక్క పక్కేగి యా
యట వీప్రాంతపుఁ బక్క యోజన మె దూరాధ్వాన మేగంగ న
చ్చట వీక్షింతు వగస్త్యు నాశ్రమము దృశ్యంబౌ ప్రదేశంబులన్. 165

.పలుచెట్లన్ రమణీయమైన వనిలో వైదేహి హర్షించి క్రీ
డలఁ దేలంగల, దీవు లక్ష్మణుఁడుగూడన్ హర్షముం గాంత్రు పు
ష్కల వృక్షంబుల నావనం బలరు, నీకాలమందే కనన్
దలంతేన్ వెళ్ళుమి యాయుగస్త్యముని పూత స్వచ్ఛ రమ్యోర్వికిన్.
166

అని మౌనీంద్రుఁడు పల్క రాముఁ డనఘుండా మౌనికిన్ మ్రొక్కి మౌ
ని నగస్త్యున్ గని సీతతో ననుజుతో నీరంధ్ర వృక్షంబులౌ
వనులన్ మబ్బుల వంటిశైలముల నాబాటన్ దటాకాలఁ జ
క్కని యేఱుల్ రమణీయమౌ సరసులన్ గన్గొంచు నేగెన్ వెసన్. 167

వ. అపుడు సుతీక్ష్ణ మహాముని చెప్పిన మార్గమును బట్టి పోవుచు రాముఁడు లక్ష్మణునితో నిట్లనెను. "చూడు లక్ష్మణా ! యిదిగో ఆమహాత్ముఁడైన యగస్త్య మహాముని సోదరుని యాశ్రమ మిదియే కావచ్చును. ఈ వనమునకుఁ దీసికొని పోవు మార్గమున వేలకొలది చెట్లు ఫలపుష్ప భారమున వంగి కనుపట్టు చున్నవి. పండిన పిప్పలి చెట్ల గంధము గాలికి వచ్చుచు కటువై కనిపించుచున్నది. ఇదిగో అక్కడక్కడ కట్టెల గుట్టలు కనిపించుచున్నవి. 168

ఇవె వైడూర్యపుఁ గాంతి చిమ్ము కుశ లిందే పెక్కులై కొయ్యఁబ
డ్డవి కన్పించెడి, నీలి మబ్బువలె శైలాగ్రస్థ శృంగం బటుల్
దివిపైకిన్ జనుదెంచి కాననపు మధ్యేదేశమం దాశ్రమా
గ్ని విధూతం బయినట్టి ధూమశిఖ కన్పించెన్ నిరీక్షింపుమీ. 169

స్వచ్ఛమైన తీర్థంబుల స్నాన మాడి
స్వయముగాఁ దెచ్చిన పువు లర్చనము చేతు
రిందుచే సుతీక్ష్ణుడు వచియించినట్లు
అది నిజమగస్త్యుతమ్ముని యాశ్రమంబె. 170

జగములకు హితమును జేయు సాధు వాంఛ
మున్ను మృత్యువును జయించి పుణ్యకర్మ
యయిన యెవ్వని భ్రాతచే నాలయముగ
ఈ దిశ యొనర్చ బడె వాని దివనంబె. 171

మునుపు వాతాపి యిల్వలు లనెడి యిర్వు
రనుజు లైన రాక్షసు లిట దనరుచుండ్రు
వార లెప్పుడు మిక్కిలి క్రూరు లగుచు
బ్రాహ్మణుల హత్య చేయుచు వరలు చుండ్రు. 172

ఇల్వలుఁడు బ్రాహ్మణుని రూప మెనసి సంస్కృ
తమె పలుకుచు దయవిడి శ్రాద్ధంబు కొఱకు
విప్రుల పిలిచి వేషరూపిగను భ్రాతఁ జేసి
వండి శ్రాద్ధమున భుజింపఁ జేయు. 173

పిదప బ్రాహ్మణులు భుజియింప వేగఁ జూచి
ఇల్వలుఁడు పల్కు "వాతాపి ! యింక ధ్వనులఁ
జేయుచు నిటువెల్వడు మన జీవ మొంది
ద్విజుల మెయిఁ జీల్చుకొని వాఁడు వెడలు చుండు. 474

అట్టు లాకామ రూపులౌ నసురు లెపుడు
వేల బ్రాహ్మణులను జంపి వేయు చుండ్రు
అపుడు దేవులు ప్రార్థింప, నాయగస్త్యు
డేగి శ్రాద్ధాన రాక్షసు నిటు భుజించె. 175

అటు లగస్త్యుఁడు రాక్షసు నిటు భుజింప
నిల్వలుఁడు పూర్తిగా నయ్యొ నింక నీవు
వెలికి రమ్మని సోదరుఁ బిలువ మౌని
పరిహసించుచు వానితోఁ బలికె నిట్లు. 176

నాదు మేన జీర్ణమై యైన నీదు తమ్ము
డెట్లు వెల్వడు మేకమై యెనసె యముని
అనఁగ విని యిల్వలుఁడు భ్రాత యంత మెరిగి
క్రోధమున మౌని నెదిరింప ఖీఁదఁ బడియె.　177

అన్వా డాయగస్త్య మహర్షి యధిక తేజు
కలిగి యగ్ని బోలెను ముందు కంటితోడ
వానిఁ దగులఁ బెట్టెను నట్టి పరమ మౌని
యాశ్రమం బిది సరసీ వనాంచితంబు.　178

వ. అని యిట్లు రామలక్ష్మణులకుఁ జెప్పుచుండ సూర్యుఁ డస్తమించుటయు సంధ్యాకాల మయ్యెను. అంత వారు సంధ్యను యధావిధి నుపాసించి యాయగస్త్య భ్రాత యాశ్రమము చొచ్చి మునికి నమస్కరించి యా మునిచే బ్రతిగ్రహింపఁ బడి యట దుంపలు పండ్లు తిని యొక రాత్రి యుండి రాత్రి గడిపి సూర్యమండలము స్వచ్ఛముగఁ బైకి రాఁగ ఆయగస్త్యుని భ్రాతకు నమస్కరించి "ఓ మహాత్మా ! రాత్రి యిట సుఖ ముంటిమి. మీ యన్నను దర్శింపనేగెదము. సెలవిండు" అని పలికి యామని సరే యట్లే వెళ్ళుఁ డని సెలవిచ్చి పంప ఆతండు చెప్పిన మార్గమునుబట్టి ఆవనమును జూచుచు బయలు దేఱిరి. అచ్చట నివ్వరి ధాన్యములను పనసలను తాటిచెట్లను పొగడలను తిమిశవృక్షములను ధవములను చిరిబిల్వముల మధూకముల బిల్వములను తిందుశములను చివర పుష్పించి తీవెలచేఁ జుట్టు కొనఁబడిన వేలకొలఁది పుష్పిత వనతరువులను ఏనుఁగు తొండములచే విఱఁగ గొట్టఁబడి కోతులతో నిండి మత్త పక్షి సంఘముల కూతలచే బ్రతిధ్వనించు వృక్షములను జూచుచు దగ్గ ఱనే యనుసరించి వచ్చుచున్న లక్ష్మీవర్ధనుఁ డైన లక్ష్మణుని జూచి రాజీవ లోచనుఁ డగు రాముఁ డిట్లనియెను.　179

నునుపౌ నాకుల నొప్పి శాంత మగు జంతుల్ పక్షులున్ గల్గు చె
ట్లను శోభిల్లుట భావితాత్మ మునిదౌ రమ్యాశ్రమం బిందె యుం
డు నటంచున్ దలఁతున్, స్వకర్మ వలనన్ బూర్వం * బగస్త్యాఖ్య నొం
దిన మౌనీంద్రుని యాశ్రమం బిదియు శ్రాంతిం బొంద విశ్రాం తిడున్.
180

హోమ ధూమాల నీయెల్ల భూమి నుండి
నారచీరలు మాలలు సౌరు నింపు
జంతువుల యూథ మొప్పు ప్రశాంతముగనె
వివిధ పక్షులు కూతలు విందు గూర్చు. 181

జగములకు హితంబును జేయు సాధు వాంఛ
మున్ను మృత్యువును జయించి పుణ్యకర్మ
యయిన యెవ్వని భ్రాతచే నాలయముగ
ఈదిశ యొనర్చఁబడె వాని దీ వనంబె. 162

ఇది యగస్త్యుని యాశ్రమ మితని భయము
వల్ల నితని ప్రభావము వల్ల నసురు
లిటకె రా,రీదిశ ననుభవింప లేరు
తొరగ శాంతులై రా యగస్త్యుండు రాగ. 138

అనఘ భగవంతు పేర దక్షిణపు దిశయు
దనుజ ధిక్కృతి గనక ప్రదక్షిణ యగు
విమల రవి పథి నడ్డిన వింధ్యగిరియు
ఇతని యాజ్ఞ పాలించి ప్రవృద్ధిగనదు. 184

* అగము = వింధ్యపర్వతమును స్తంభింపఁజేసినాఁడు గాన అగ×స్త్య = అగస్త్యుఁ డని పేరు కలిగెను. పృషోదరాది గణముచే స్తంభస్త్య అయ్యెను.

ప్రథిత కర్మలు గల్గి చిరాయువైన
యా యగస్త్యు శ్రీమంతమౌ నాశ్రమ మిది
ఇది వినీత జనార్చిత మీయగస్త్యు
డఖిల జనపూజ్యుఁడు మన శ్రేయస్సు గూర్చు. 185

ఇట నగస్త్యు నారాధింత మింకఁ గడమ
యడవి వాస మాతని కడఁ గడపుద, మిక
ఇటు సురలును గంధర్వులు ఋషులు సిద్ధు
లనయు మీ నియతాహారుమునిని గొల్తు. 186

ఇట ననృతవాదిగాని దుర్వృత్తుఁడేని
శఠుఁడు గాని కాముకుఁడేన్ నృశంసుఁ డేని
బ్రదికి యుండఁగఁ జాలఁ డీవర మునీశుఁ
డవనినె మహానుభావుండు నట్టి వాఁడు. 187

వ. మఱియు నిచ్చట సిద్ధులు దేహము విడచి సూర్య తుల్యములైన విమానము లెక్కి నవీన దేహములు దాల్చి స్వర్గము పొందిరి. ఇట దేవులు శుభము లైన భూతములచే నారా ధింపఁబడి యమరత్వమును వివిధ రాజ్యముల నిచ్చెదరు. అట్టి గొప్ప యాశ్రమ పదవికి వచ్చితిమి. సౌమిత్రీ! నీవు ముందేగి యాఋషికి సీతతోఁ గూడ నిచ్చటకు నేను వచ్చినట్లు తెలుపుము. 188

అపుడు లక్ష్మణు డాశ్రమ మరుగు దెంచి
అట నగస్త్యుని శిష్యుని కనియె నిట్లు
రాజు దశరథపుత్త్రుండు రాము డిపుడు
భార్య సీతతోడ తపోవనికి వచ్చె. 189

రాము చిన్న తమ్ముండను లక్ష్మణుండ
అన్న భక్తుఁడ నిది మీరు వినియె యుందు
పితరు నాజ్ఞను మేమెల్ల విపినమునకు
వచ్చితిమి తెల్పు మునిఁ జూడ వాంఛగలదు. 190

అపుడు లక్ష్మణు వాక్యంబు నాలకించి
ఆట్టె ముని శిష్యుఁడును జొచ్చె నగ్నిగృహము
అట్లు చొచ్చి సౌని పరుని కంజలించి
చెప్పె రాముని రాకను శీఘ్రముగనె. 191

రామలక్ష్మణుల్ దశరథు ప్రథితసుతులు
సీతతోఁ గూడ నాశ్రమ క్షితికి నసఘు
నిన్నుఁ గొలువ వచ్చిరి యిది విన్న పిదప
నానతింపుఁడి యేమి చేయంగ వలెనొ. 192

అన విని ముని యనె నదృష్టమునను నిపుడు
ఇంత కాలంబునకు రాముఁ డేగుదెంచె
ఇదిగొ నితని రాకను నిరీక్షించుచుంటి
వడిఁ బ్రవేశ పెట్టుమి యింకఁ దడయు దేల. 193

అనుచు మహాత్ముఁడైన ముని యాదృతి జెప్పఁగ వేగ శిష్యుఁడున్
ప్రణతి యొనర్చిఁ యట్లె యుని లక్ష్మణుతోడుత సంభ్రమంబుతో
ననియెను "రాముఁ డేడి ముని నారయు వేగ స్వయంబ యాశ్రమం
బును నిఁకఁ జొచ్చుఁ గాక" యన ముందుగ లక్ష్మణుఁ డేగి శిష్యుతో
194

రాముని సీతఁ జూడఁ గని ప్రశ్రితుఁడై ముని శిష్యుఁ డంతటన్
రామునితో నగస్త్య ముని రాజు వచించిన మాట చెప్పి యా
రాముని గౌర వార్హుని దవ్వ రా న్వితుఁడై బహుగౌరవంబుతో
నాముని యాశ్రమాంగణము నందు ప్రవిష్టునిఁ జేసె నాదృతిన్. 195

అంత రాముఁడు సీతతో ననుజుతోడ
అప్రశాంత హరిణముల నావరింప
బడిన యాశ్రమంబు గనుచు భక్తితోడ
చనుచు మునిఁ జొచ్చె నాశిష్యు ననుసరించి. 196

రాముఁడటఁ బ్రతిష్ఠించిన బ్రహ్మను నగ్ని విష్ణు
నామహేంద్రు సూర్యుని చంద్రు నాభగు నాకుబేరు
ధాతను విధాత వాయువు తన్నాగరాజు స్కందు
వరుణు గాయత్రిని ననంతు వసులఁ గనియె.

అపు డగస్త్య మౌనియు శిష్యు లావరింప
యెదురుగా రాఁగ దీప్తి జ్వలించు మునుల
యెదుట రాముఁ డామునిఁ జూపి యిట్టు లనియె
లక్ష్మివర్ధనుఁడైనట్టి లక్ష్మణునికి

అరయు లక్ష్మణ! భగవంతుఁడౌ నగస్త్యుఁ
డిదిగో వచ్చుచుండెను తపోనిధి యతండు
అని మహాబాహువౌ రాముఁ డర్కతేజుఁ
డౌ నగస్త్యపాదముల నపుడె పట్టె. 1

వ. అట్లు రాముఁ డాయగస్త్యుని పాదములను బట్టుకొని యుండ
మహానుభావుఁ డగు నగస్త్యుఁడు రాముని ప్రతిగ్రహించి పాద్య మిచ్చియాస
మిడి కుశల ప్రశ్నలడిగి అగ్నిని వేల్చి అర్ఘ్య మిడి ఆయతిథుల నందఱ
గౌరవించి వానప్రస్థ విధితో వారికి భోజన మిడి తాను ముందు గూర్చుం
యాసనమునఁ బ్రాంజలియై కూర్చున్న యాయతి యగు రాము 2(
నిట్లనియె.

అనయు మగ్నిని వేల్చి యర్ఘ్యంబు నిచ్చి
అతిథిఁ బూజింప వలయును నట్లు గాక
అతిథి పూజ తపస్వి చేయకయె యున్న
అనృత సాక్షివలె స్వమాంస మతఁడె తినును. 20.

అఖిల లోకంబునకు రాజ వైతి వీవు
ధరణిని మహారథుండవు ధార్మికుఁడవు
పూజనీయుండవును మాన్య పూరుషుఁడవు
ఇటు ప్రియాతిథివై వచ్చి తిచట కిపుడు. 202

అనుచు నిటు చెప్పి పూలు పండ్లను నొసంగి
క్రమత పూజించి యిట్లు వాక్యంబు పలికె
ఇదిగొ హేమ వజ్రాఢ్యమై యొసఁగు ధనువు
విష్ణు దేవతాకముఁ గూర్చె విశ్వకర్మ! 203

ఇది యమోఘము సూర్యుతో నిదియు సమము
ఈశరము బ్రహ్మ యిచ్చెను నివిగొ నింద్రు
డక్షయశరాలతో నిచ్చె నంబుపొదులు
మండు నగ్నులు వలె నివ్వి నిండి యుండె. 204

ఇదిగొ బంగరు టొరగల పదనుకత్తి
దీనితోడ ధనుస్సుతో దితిజతతుల
యుద్ధరంగంబునన్ విక్ర మోజ్జ్వలుఁ డయి
చంపి విష్ణువు సురల కొసంగె లక్ష్మి. 205

ఇదె ధనుస్సును నంబుల పొదులు శరము
ఖడ్గము గ్రహించి మాన రక్షకుఁడ వీవు
వజ్రమును దాల్చి నిత్యము వజ్రివోలె
జయము పొందుము దీనరక్షణము చేయు. 206

వ. అని మహాతేజుడైన యగస్త్యు డిట్లు సమస్తమైన యాస్త్రశస్త్రా యుధము నిచ్చి మరల నిట్లు పలికెను. 207

"రామ! ప్రీతిఁ బొందితి భద్రమంబ యవుత
లక్ష్మణా! తుష్టిఁ గాంచితిఁ బ్రణతి చేయు
సీతతో వచ్చితిరి గాన క్షేమ మొప్ప
మీరు భద్రంబు పొందెడి వారె యవుత. 208

దారి యాయాసమును శ్రమ తాప మొందు
జనక పుత్త్రియు విశ్రాంతి గొనఁగఁ గోరు
భర్తపై ప్రేమ బహుదోష వనముఁ జేరి
ఇట్టి సుకుమారి కూడ దుఃఖింప కుండె. 209

రామ! యీసీత సుఖ మొందు లాగు చేయు
నిన్ను వెంటాడి దుష్కర నియమ మొందె
నమునిఁ బ్రేమింత్రు విషము విసర్జనంబు
చేతు రిదియ స్త్రీల ప్రకృతి సృష్టి మొదలు. 210

మెఱపుల లోలత్వంబును
వరశస్త్రంబుల సుతీక్ష్ణభావము నటులే
గరుడానిలముల వేగము
గరిత లనుసరించుచుంద్రు గద లోకములో. 211

ఈనీదు భార్యయొ
ఈ నిఖిల దోషముల త్యజించెను జుమ్మీ
ఈనారి శాఘ్య సజ్జన
మానితయె యరుంధతివలె మన్నింప నగున్. 212

సౌమిత్రిచేత నీవే
భూమిని వాసంబు చేసి మోదింతువొ యీ
భూమి యలంకృతమై యీ
భూమి వెలయుచుండుఁ జుమ్మి భూపతిపుత్త్రా! 213

వ. ఓ మహాబాహూ! నీవు సీతతోను లక్ష్మణునితోను ఇట సుఖముగా
ండుము. సూర్యుఁ డస్తమించెను. సంధ్య సమీపించినది. ఇదిగో రాత్రి
క ప్రాణులు మృగములు పక్షులు పర్వతాగ్రములందు అణఁగి యున్నవి.
మంతయు రాత్రి చీకటిచే వ్యాప్తమై వెలుగులేక యున్నది. అని

మహాత్ముఁడైన యగస్త్యుఁడు పలుక రాముఁడు సీతతోను లక్ష్మణునితోను మహర్షికి నమస్కరించి రాత్రి యట వసించి ప్రొద్దుటనే లేచి సంధ్య నుపాసించి సూర్యవర్చసు గల యగస్త్యమహామునిని సమీపించగా ఆమునియు తగిన రీతిగా నిట్లు "ఓరామా : రాత్రి సుఖముగా నిద్రించితిరా"అని యడుగ రాముఁడనెను. "మహానుభావా ! మేము యథావిధిగా సత్కరింపఁబడితిమి. శయాసవాదులచేత మేము రాజు దశరథుని యంతఃపురమందు వలె సుఖముగానుంటిమి" అనఁగా మరల ముని యిట్లనియె. కాకుత్స్థా ? దశరథ నరేంద్రుఁడు పీర్పఱచిన సమయము చాలవఱకు గడచినది. నీవు యయాతివలె తండ్రిని తరింపఁ జేసితివి, నీవు ధన్యుఁడ వైతివి" అనుటయుఁ దిరిగి రాముఁ డ్లిని యెను. "ఓ మహానుభావా ! మీ యనుగ్రహమున ధన్యుఁడ నైతిని. రాజు నాచేఁ గాక తన గుణములచేతనే తరించెను. తన పుణ్యకర్మలచేతనే స్వర్గము పొందెను. కాని యీ ప్రదేశము అంతయు శరణు లేని దయ్యును శరణు గల దట్లయ్యె. దీనిని తత్త్వముగఁ జెప్పి యనుగ్రహింపుడు. ఇది తెలిసికొన వేడుక జనించెను". అనుటయు ఆముని యిట్లనెను. "రామ ! సరిగా వినుము, ఈ దేశము సంగతి చెప్పెదను. ఈప్రదేశ మంతయు మహాత్ముఁడైన దండకునిచే త్యజింపఁ బడెను. భార్గవుని శాపముచే నీదేశ మంతయు నిర్మానుష్య మైనది. వృక్షములు గుల్మములు లేనిదై తాపసులచేఁ గూడ వర్జిత మైనది. ఇది ఘోర మైన యడవి యైపోయినది. వేయిన్నూర యోజనములు ఈ దక్షిణదిశయందలి వింధ్యపాదము ఇట మేఘము కురియు లేదు. గాలి సుఖముగా వీచదు. ఇక్కడ మహాదారుణమైన రాక్షస భయము మర్పడెను. ఇది యిట్లు చాల వేల సంవత్సరములు మనుష్యులు లేక యుండెను. గంధర్వులు ఋషులు దేవులు అందఱును విడిచి పైచిరి. కొంతకాలమునకు దైవవశమున నేనిటకు వచ్చితిని. నాతోపాటు ఇక్కడకు మేఘములు వచ్చెను. కొంతకాలము స్వేచ్ఛగా వర్షములుకురిసెను. చాల వత్సరములు ఇటకు యమదూతలు వ్యాధులు రాకైరి. నేను మనసులో చింతింప వృక్షములు నదులు రమ్యతటాకములు తామరకొలనులు సుఖశీతల మైన వాయువులు ఏర్పడినవి. ఇంక సస్య శ్యామలమై దేశ మయ్యెను. ఋషులును వచ్చిరి. ఇదంతయు అతని శాపముచే నయ్యెను. ఉగ్ర కర్ములగు రాక్షసులచే ఉపద్రవము గల దయ్యెను. నీ వెప్పుడైతే చిత్రకూటమునకు వచ్చి

తివో అది మొదలుకొని రాక్షసులు మునులను బాధింపఁ జొచ్చిరి. మానద! నీవు ఋషుల కథను వినుము. దండకారణ్య నివాసు లైన ఋషుల రక్షణ కై నీవు వచ్చితివి. వారిని రక్షింపుము. కాకుత్స్థా! నీవు త్రిలోకములను గూడ రక్షింపఁగలవు. నీవు కోపించినచో రాక్షసులు హతులయి పోదురు. శాప దోష ముచే ఇక్ష్వాకు పుత్రుఁ డైన దండకునిచే నీదేశము నిరాకృత మైనది. ఈ దండకారణ్యమునకు శాపాంతము గలిగించుటకై యిక్కడకు వచ్చితివి. నీ పురావృత్తు లైన తండ్రులచే నీదేశము నిరాకరింపబడినది. ఇందుచే దీనిని దండకారణ్య మందురు. ఇది యీ దేశమును గురించిన వృత్తాంతము. 214

ఇటుల నాముని చెప్ప నాలించి మ్రొక్కి
అగ్నివలె వెల్గు మునితోడ నతఁడు పలికె
ధన్యుఁడ నయితి ననుగృహీతాత్ముఁ డైతి
ఋషి వరమిడి గుణముల హర్షించెఁ గాన, 215

కాని యిది చెప్పు మెచ్చట నేను నిలిచి
సుఖము యుందు నీరము లెందు సులభమగునొ
అనఁగ విని యొక నిముషంబు ధ్యానముండి
ధీరుడా ముని పల్కెను ధీర మొప్ప. 216

ఇచట నుండి ద్వియోజనా లేగ నచట
చాల పండ్లు దుంపలు నీళ్లు చాల మృగము
లున్న దేశము శ్రీలతో నొప్పు చుండు
పంచవటి యని యద్యది ప్రథిత మయ్యె. 217

అచట కేగి యాశ్రమమును నమరఁ గూర్చి
పితరు నాజ్ఞ చేయుచు మీరు ప్రీతిఁ గాంత్రు
నీ సమస్త వృత్తము గంటి నేను నాత
పః ప్రభావాన దశరథువయిని ప్రేమ. 218

నీవు హృదిలోని భావమున్ నేను నాడు
తపమునఁ దెల్సికొంటి, నీధరణి నీవు
ఉండు ననినను నీభావ మొగి నెఱింగి
పంచవటి కేగు మని నేను పలికినాను. 219

ఆవన ప్రదేశము చాల యంద మైన
దచట జానకి యానంద మంది యలరు
ఆ ప్రదేశము శ్లాఘ్యమౌ యటు నెదరిగ
కలదు గోదావరి నది; యం దలరు సీత. 220

పండ్లు దుంపలు నున్నవి పలు రకాల
పక్షి తతులుండె శాంతమై పావన మయి
రమ్యమై యుండె నీవా భద్రంపు నడత
గలుగు వాఁడవు మునుల రక్షణ మొనర్తు. 221

ఇదిగొ నిటు చూడు మీయిప్ప వృక్షవనము
కన్పడును నుత్తర దిశ కేగంగ మట్టి
కెదురుగా సమతలి దిగి యిట్టి పోవ
గిరికి దరి పంచవటి పుష్పభరిత మొప్పు. 222

ఇటు లగస్త్యుఁడు చెప్ప నాలించి రాముఁ
డాతపసి సత్యవాక్యునియనుమతి గొని
లక్ష్మణునితోడ సీతతో ప్రాంజలించి
యచటి నుండి పంచవటికి నరిగినారు. 223

పంచవటికిని బోవుచు బాటమధ్య
భీమబలు జటాయువు వటవృక్షమందు
గొప్పదేహముతో నుండ నప్పు డరసి
పమజుఁగఁ దలంచి ప్రెవన్నఁ దనుచు నడిగె. 224

ఆ జటాయువు మధురవాక్యంబుతోడ
సౌమ్యముగఁ జెప్పి కడు సంతసంబు గూర్చి
నటుల నసె వత్స! నీతండ్రి కనఁగు సఖుఁడ
ననఁగ పితృసఖున్ రాముఁడు నపుడు కొలిచి. 225

అతని కులమును పేరును న్యాయరీతి
నడుగ రాముని వచనము నాలకించి
ప్రాణి సృష్టియున్ వంశమునాత్మ నా
మాజటాయుపక్షి వచించె నప్పు డిటుల. 226

వ. ఓ మహాబాహూ! పూర్వకాలమువ ఏ ప్రజాపతు లుండిరో వారిని గూర్చి మొదటినుండియుఁ జెప్పెద వినుము ఆ ప్రజాపతులలో మొదటివాఁడు కర్దముఁడు పిదప విక్రీతుఁడు శేషుఁడు సంశ్రయుఁడు బహుపుత్త్రుఁడు పులస్త్యుఁడు మరీచి అత్రి క్రతువు పులస్త్యుడు అంగిరుడు ప్రచేతుఁడు పులహుడు దక్షుఁడు వివస్వంతుఁడు అరిష్టనేమి కశ్యపుఁడు అనువారు కలిగిరి. అందు దక్ష ప్రజాపతికి అరువదిమంది కూఁతులు కల రని వింటిమి. వారిలో ఎనమండుగురను కశ్యపుడు గ్రహించెను. వారు అదితి, దితి, దనువు' కాలికతామ్ర, క్రోధవశ, మనువు అనల అనువారు.

ఆ కన్యలను జూచి కాశ్యపుఁడు ప్రీతి పొంది మీరు నాతో సమమైన త్రైలోక్యభర్తలైన కుమారులను కనుఁడు అని పల్కెను. దితి యూ కాశ్యపుని మాటలందు ప్రీతి కల దయ్యెను. దితియును, కాలికయు అతనిమాటలులను ప్రీతితో ననుసరించెను. మిగిలినవారు అనుసరింపలేదు. అదితియందు ఆదిత్యులు వసువులు రుద్రులు అశ్వినులు మొత్తం ముప్పది ముగ్గురు పుట్టిరి. దితి దైత్యులను కనెను. వనసముద్రములతోఁ గూడిన యీవసుమతి వారిది. దనువు అశ్వగ్రీవుని కనెను కాలిక నరకుఁడు కాలకుఁడు అనువారిని కనెను. తామ్ర అను నామె క్రౌంచి భాసి, శ్యేని ధృతరాష్ట్రి శుకి అనుకన్యలను ఆరుగురిని కనెను. అందు క్రౌంచి ఉలూకములను, భాసిభాసములను, శ్యేని డేగలను గద్దలను ధృతరాష్ట్రి హంసలను చక్రవాకములను, శుకి నతను, నత వినతను

కనెను. క్రోధ వశ మృగిని, మృగమందను హరినిభద్రమదను మాంతంగిని, శార్దూలిని శ్వేతను సురభిని సురసను కద్రుకను కనెను మృగి సర్వ మృగములను కనెను. మృగమంద ఋక్షములను సృమరములను చమరములనుకనెను. భద్రమద ఐరావతిని కనెను. అది ఐరావత నును మహాగజమును కనెను. మతంగి ఏనుగులను, శార్దూలి గోలాంగూలములను పెద్దపులులును శ్వేత దిగ్గజములను కనెను సురభి రోహిణిని గంధర్విని కనెను. రోహిణి గోవులను, గంధర్వి గుఱ్ఱములను సురస నాగములను కద్రువ పన్నగములను మనువు బ్రాహ్మణులు క్షత్రియులు వైశ్యులు శూద్రులు అను మనుష్యులను కనెను. ముఖమునుండి బ్రాహ్మణులు, వక్షఃస్థలమునుండి క్షత్రియులు తొడలనుండి వైశ్యులు పాదముల నుండి శూద్రులు పుట్టిరని శ్రుతి అవల సర్వపుణ్య ఫలములు గల చెట్లను వినతయు శుకియు సౌత్రియు కద్రువయు సురస చెల్లెండ్రు కద్రువవేయి ముఖములు గలిగి భూమి ధరించు నాగుని కనెను వినత గరుడుడు అరుణుఁడు అను వారిని కనెను. అరుణునికి నేను పుత్రుఁడను సంపాతి నాయన్న నన్ను జటాయు వందురు. నేను శ్యేని కొడుకను నీవు కోరినచో నీనివాసమున నేను సాయముగ నుందును. ఈ అడవి దుర్గమమైనది. మృగ రాక్షసులచే నిది సేవింపఁ బడినది. నీవు గాని లక్ష్మణుఁగాని ఎక్కడ కైనను వెడలినచో నేను సీతను కాపాడుదును "అని జటాయువు చెప్పఁగా విని యతనిని పూజించి సంతోషముతో అతనిని గౌగిలించుకొని యాత్మ యుతుఁడై జటాయువు చెప్పిన తనతండ్రితో జటాయువునకు గల నఖ్యమును గూర్చి మాటిమాటికి తలచుకొనెను. అక్కడ అతఁడు సీతను జటాయువు దగ్గర న్యాసముగా నుంచి అతిబలముగల యాపక్షితోఁ గూడనే లక్ష్మణుఁడు కూడరాఁగా మిడతలను అగ్నివలె రిపులను దహింపగోరువాఁడై పంచవటికి వెళ్ళెను. 227

అట్లు వివిధ నర్వ మృగాల కాలయమగు
పంచవటిఁ జేరి తేజ మొప్పారు ననుజుఁ
గనుచు రాముఁ డిట్లనె "మౌని మనకుఁ దెల్పి
నట్టి పంచవటి యిది పుల్లాగ్రవాటి. 228

వనమున సంచరించి యెట వాసము చేయుట కర్హమౌనో సై
పుణీ కలవాఁడ వీజనకపుత్రికకున్ విహరింప నెచ్చటన్
అనువుగ నుండునో మనకు నందఱ కెచ్చట వీలెయౌనో యే
వనిని జలాశయంబు దరిబాగుగ నుండునొ చూడు మియ్యెడన్. 229

ఏచట వనము రమ్యంబగు
నెచట స్థలము రమ్యమౌచు వీక్షింపఁబడున్
ఏచట సమిధలు కుశపు
ష్పచయము జలము దరినుండు సరిగాఁ గనుమీ. 230

అని రాముండు వచింపఁగ
విని యంజలి పట్టి సీత వినుచుండఁగ ల
క్ష్మణు డిటు వచియించెను రా
మునితోడ నపుడు వినయము మునుకొన ప్రీతిన్. 231

నీదరి సూరేం డ్లున్నను
నాది స్వతంత్రంపు జీవనము కా దెటులేన్
"ఈదేశము రమ్యం బిదె
నాదుమతికి ప్రియ మనుచును నాకుం జెవుమీ. 232

అటు నుహాత్ముఁడౌ లక్ష్మణుఁ డాడినట్టి
పలుకుల విని సర్వగుణ సంపన్నమైన
దేశమును విమర్శను జేసి దేశ మదియె
ఎల్లకును మంచి దని రాముఁ డిష్టపడియె. 233

ఆతఁ డాదేశ మెంతయు నాశ్రమమున
కష్ట మని తెల్సికొని యపు డెంతో యలరి
చేనితో చెయి గ్రహియించి ప్రీతితోడ
ననుజుఁ డగు లక్ష్మణునితోడ ననియె నిట్లు. 234

"సౌమ్య ! ఈదేశ మెంతయు సరిగ పిడిన
పూలచెట్లతో శ్రీలు నందాలు నిను
ఇటనె యాశ్రమ పదము శ్లాఘింపఁదగిన
వగిది చక్క నిర్మింపఁగా దగును జుమ్ము. 235

రవిబింబంబును బోలు తామరపువుల్ బాగై సుగంధంబులన్
కలియం జిమ్మఁగ శ్రీల నొప్పి తటవృక్షశ్రేణిఁ బుష్పించు క్రొం
బువు లందాలొలికించుచుండఁగ మనోమోదంబు గల్గించె నీ
భువి, గోదావరి, యాయగస్త్యుఁడు మహాత్ముండన్న యట్టుల్ కడున్.
236

కారండవములు చక్కవలు రాయంచలు
మృగపంక్తు లటనట మెసలు చుండె
నెమిలికేకల మ్రోసి నెఱి నొక్కచో పుల్ల
తరుల నెత్తగు గుహల్ గిరులఁ దనరు
రాగి బంగరు వెండి రంగు ధాతులు పూయు
కిటికీలవలె నేన్గు లటఁ దనర్చు
తాలతమాల సాలాలు ఖర్జూరముల్
పనస లామ్రకములు పర్వియుండు

చంపక శమీ లికుచములు స్పందనములు
చూత పున్నాగ తిమిశముల్ కేతకములు
తిలక చంద నాశోక పాటల ధవాశ్వ
ఖదిర కింశుక నీప వృక్షములు వెలయు. 237

ఇది పుణ్యంబును మేధ్యము
నిరి బహుమృగ పక్షి రాజి వృతమై యుండున్
ఇది రమ్యంబగు. నిచట సు
హృదుఁడు జటాయు వెసగుఁ గద నిట నుందమయా. 238

అన పరవీరహుఁడగు ల
క్ష్మణుండు విని శీఘ్రముగనె మహితాశ్రమవా
టిని నన్న యయిన రాముని
కిని నిర్మించె సకల విధ గృహభాగములన్. 239

మట్టి ముద్దల గోడలు పెట్టి యచట
స్తంభములు నిల్పి పొడుగు వంశములు నుంచి
వానిపై మరల వెదుళ్ళు పఱచి జమ్మి
శాఖలను వైచి యొక పర్ణశాలఁ దీర్చె. 240

దానిపై దర్భ తెల్లాకులు తగిన రీతి
కట్టి యామీద నేలను కరము సరిగ
సలిపి లఘు విక్రముఁ డగు లక్ష్మణుఁడు నన్న
కొఱకు సందమౌ గొప్పమందిరము గూర్చె. 241

అట గోదావరి కేగి నిర్మలజలంబందున్ వడిన్ మున్గి పి
మ్మట బద్మంబులు కోసి పండ్లు గొని యమ్మై క్రమ్మఱన్ వచ్చి యం
తట పుష్పంబుల వాస్తుపూజ క్రమతన్ గావించి శాంతిన్ హుటా
హుటిగాఁ జల్పియు నన్న రామునికి నింపొప్పారజూపెన్ గుటిన్. 242

పని తన మొప్పఁ దీర్చిన శుభాశ్రమ సౌమ్యత సీతతోఁ గనుం
గొని మది మెచ్చి రాముఁడును గూరిమి తమ్ముని బిగ్గ సంతసం
బున వడిఁ గౌఁగిలించుకొని "మోదముతో నిటు చేసినందుకున్
గానుమిదె కౌఁగి లిచ్చితిని గూరిమి తమ్ముఁడ యంచు నిట్లనెన్. 243

నిరతము భావ మెఱిఁగి కృత
మెఱిఁగి పరమ మైన ధర్మ మెఱిఁగిన నీచే
వరధర్మాత్ముఁడు నాపిత
మరణింపండు మృతజీవి మహితుం డతఁడౌ. 244

అని యాలక్ష్మణు లక్ష్మీవర్ధనుఁడై యా నారాముఁడున్ ఖల్కి ఫూ
లును పండ్లున్ గల యాప్రదేశమున హర్షోత్సాహ సౌఖ్యాలతో
సనుజున్ ప్రేయసిఁ గూడి, హారిరువు రత్యంతంబు సేవింప నుం
డెను స్వర్లోకమునందు నిర్జరుఁడు వోలెన్ గొంత కాలం బటన్. 245

## హేమంత ఋతువర్ణనము

వ. ఇట్లు మహాత్ముం డైన రాముఁడు సుఖముగా వసించుచుండ శర
త్కాలము గడచి యిష్టమైన హేమంత ఋతువు వచ్చెను. అపుడు ఒకనాటి
యుదయమున రాముఁడు సీతతోఁ గూడ స్నానమునకై గోదావరికి కలశ
హస్తుఁడై వెళ్ళ వారిని అనుసరించి వెళ్ళుచు సౌమిత్రి యిట్లనెను. 246

ఇదిగో నీకు నభీష్ట మైన సమయం బేతెంచెఁగా, యోప్రియం
వద! హేమంతముచే నలంకృత మటుల్ భాసించె నీవత్సరం;
బిదె యీమంచున లోక మెంతొ బిరుసయ్యెన్, నేల సస్యాల నిం
పొదవెన్, నీళ్ళు శరీరమున్ గఱచు, నిప్పొ హాయి చేకూరుచున్. 247

విజ్ఞు లాగ్రయణార్చఁ బితృదేవతలఁ గొల్చి
యాగ్రయణములచే నఘ మడంత్రు
అతికాము లయి జను లావుపాలను గాంత్రు
నృపులు యాత్రల విజయేచ్ఛ నుంద్రు
దక్షిణముగ రవి తరల బొట్టును లేని
సతియ ట్లుదగ్దిశ సౌరు నిడదు
ప్రకృతి హిమాఢ్యమై రవి దవ్వుకాఁగ హి
మాద్రి సార్థక నామ మగును నేఁడు

పవలు మధ్యాహ్న మది సోక ప్రమద మొసఁగు
రవియు సుఖమిచ్చు, నీడ నీళ్ళార్తి గూర్చు
రవి మృదు వగు, మంచొప్పు, చల్ల నగుగాలి
ఆకు లూడ హిమము మాడ్చ నలర దటవి. 248

ఇటు పుష్యమాస రాత్రులు
తటుకున రా బయటఁ బండ తగ్గించిరి మ
చిటఁ గురియ ధూసరమ్మగు
పటువై జాములు చలి మెయి బాగుగఁ బెరిగెన్ 249

రవియందు సంక్రమించు వి
భవము గలిగి మంచు గప్ప భాసిలఁడు నిశా
ధవుఁ డిపయిని నిట్టూరుపు
లవి యులమఁగ గ్రుడ్డిదైన యుద్దమువోలెన్. 250

నున్నని మంచున ముఱికయి
పన్నుగ నెండఁ బడివాడు వదెనయ పోలెన్.
వెన్నెల పున్నమి దినమున
చెన్నఱి యందాల నిడదు శీతములోనన్ 251

ప్రకృతిచేతనె శీతల స్పర్శ కలిగి
నేఁడు హిమముచేతను గడు నిండిపోయి
యెల్ల నుదయాన రెట్టింపె చల్లనగుచు
వెడలి పడమటి గాలియు వీచుచుండెఁ 252

ఊడుకుచేత మిక్కిలి కప్పఁబడుచు నుండి
యవలు గోధుమలును నిండి యులరు చుండ
ధ్వనులు చేయు సారస క్రౌంచ పక్షి తతుల
సూర్యుఁ డుదయింప నడవులు శోభ చెందు. 253

కడుగింజలను నిండి ఖర్జూర సుమములఁ
బోలు తలలు వంచి శాలు లొప్పె
మంచుసోనలు కప్ప మసలు రశ్మిల దూర
ముదయించు రవి చంద్రు ద్యుతినిబోలె
తొలిప్రొద్దు వెచ్చనై మలిప్రొద్దు హాయియై
యెఱుపుఁ దెల్పుగ నెండ ధరను దనరె
గ్రుచ్చి మంచు పడుటఁ బచ్చిక నుంత త
డియు వనభువి నొప్పె లేత యెండ

మిగుల దప్పి గొన్ వనకరి మెల్లఁ జల్లఁ
బడిన నీరుతాకి కరమున్ ముడుచు కొనెను
జలములఁ జరించు పక్షులున్ సరస నిలిచి
జలముఁ జొరవు యుద్ధమున నిర్బలులువోలె. 254

మంచు నీటిలోఁ జీకటిన్ మించి యుండి
గడ్డ మంచుచీఁకటులను గప్పి యుండి
పువ్వు లన్నవె లేకుండఁ బూర్ణముగను
వనులు నిద్రించి నట్టులు పరగు చుండె. 255

కరము బాష్పము నీళ్ళను గప్పివైవ
కూత లివి సారసమ్ముల గుర్తు తెలుప
మంచుచే నిసుక తడిసి మించు గట్లు
నదులు నేఁడు భాసిల్లుచు పొదలె మిగుల. 256

మంచుసోనలు నిత్యముం బడుటవలన
సూర్యుఁడును మెత్త నగుచును జూడఁ బడుట
శైత్యమునఁ గొండ తుదిగూడ సరిగ నుండు
జలమును తఱచుగ విషంబువలెను నుండు. 257

కాల మది రాఁగ సడలిన కాంతి కలిగి
కేసరమ్ములు కర్ణముల్ వాసి చెడుట
హిమము పద్మాల నడఁచ నాశముతె మిగులు
నబ్జములచే వెలుగవు పద్మాకరములు 258

భరతుం డిప్పుడు దుఃఖముల్ పడుచు నీభక్తిన్ తపస్సుల్ కడున్
పురి ధర్మాత్ముఁడయై చరించు, బహుశా భోగంబులన్ రాజ్యమున్
ధరణిన్ మానము వీడి నేలపయి వన్యాహారుఁడై పండుచున్
సరయూనీరములన్ మునుంగ నిపుడున్ పౌరాళితోఁ బోవుఁ బో 259

అతి సౌఖ్యంబుల వృద్ధిపొంది సుకుమారాంగుండ యయ్యున్ సుఖో
చితుఁడై యుండియు నెట్టు లాసరయులో శీతంబులో స్నానముల్
యతియై వేకువ జాము చేయునో గదా, యత్యంతమున్ పొట్టయే
గతిలే కున్నటు ప్రుక్కి వల్లఁబడి సిగ్గాపొందఁ డావంతయున్. 260

హితుఁడై ధార్మికుఁడై జితేంద్రియుడునై యెప్డున్ ప్రియం బాడుచున్
మతి నానావిధ భోగముల్ విడి యరణ్యంబేగునన్నన్ నినున్
సతతం బెల్ల విధాలఁ బోలి చనుచున్ సత్యాత్ముఁడై సత్తపో
వ్రతుఁడౌ నీదగు భ్రాత యాభరతుఁడున్ స్వర్గంబె గెల్చెన్ గదా. 261

మనుజులు జనని స్వభావం
బునెగాని జనకు స్వభావమును నెల్లపుడున్
అనువర్తింప రనెడి వా
దును భరతుండు తలక్రిందు తూర్ణముచేసెన్. 262

ఏసతిపతి దశరథుఁడో
ఏసతి తనయుఁడు మహాత్ముఁ డీభరతుండో
ఆసతి ఎటులైకజనని
యాసరణిన్ క్రూరమైన దృష్టిని దనరెన్. 263

ఇటు ధార్మికుఁ డగు లక్ష్మణుఁ
డటు భరతుని మీఁది ప్రేమ నటు వాకొనుచున్
8 త్రుటి జననీ పరివాదం
బటు పలుక సయిపక రాముఁడనియెను నిటులన్. 264

నోయన్న! మధ్యమజననిని
నేయనువునఁగాని దూఱ నీకున్ దగ-దా
మాయిక్ష్వాకు పేరు భరతు
న్యాయం బగు కథనె చెప్పు నయముం జేపుడున్. 265

వనవాసమందు దృఢ మయి
సునిశ్చితపు బుద్ధికూడఁ జూడుమి యిటులన్.
మనభరతుని స్నేహము వ
ల్లనది మరల సడలిపోవు లాగునఁ దోఁచున్. 266

ఎన్నఁడు మహాత్ము భరతుని
కన్నులఁ గని కలిసియుందుఁ గని శత్రుఘ్నున్
మన్నన గావించెదనో
యిన్నను తలపోయువాఁడ నింతట మదిలో. 267

అని విలపించుచు రాముఁడు
చని గోదావరినదికిని జానకితోడన్
అనుజునితో, స్నానముచే
సెను స్నేహంబునను పొంగి చెలగెడు మదితో. 268

అటు వారలు చని కరములు
నిటులమునను మోడ్చి నియతి దలిర్పన్
పటుభక్తిని పితృదేవుల
కటునీళ్లిడి సూర్యసురల నర్చించిరెడన్. 269

జలముల నభిషేకంబును
సలిపియు రాముం డనుజుఁడు జనకాత్మజయున్
* వెలిగిరి, యభిషేకంబును
సలిపిన శంకరుఁడు నంది శాంకరివోలెన్. 270

అటు లభిషేక మొనర్చి ఆ
కుటిలులు ముువ్వురునుగూడ గోదావరి యా
తట మునఁ నుండియు నాశ్రమ
తటమునకును జేరినారు తత్సమయమునన్ 271

అచటన్ రాముఁడు భ్రాతతోఁ గలిసి సంధ్యన్ చక్క సేవించి మౌ
ని చయం బర్చన చేయఁ బర్ణకుటియం దింపారఁ గూర్చుండి చె
ప్పుచు నాయాకథ: లింతితోఁ గలిసి సొంపుల్ నింపె నభ్రానఁ బొ
ల్పుచు చంద్రుండును చిత్రతోఁ గలిసి వెల్గుల్ చిమ్ము చున్నట్లుగన్ 272

—: శూర్పణ రాక :—

అటు కూర్చుండియు రాముఁడున్ వివిధ వృత్తాసక్త చేతస్కుఁడై
యట నున్నంతట రావణాసురుని యాప్యాయంపుఁ దోఁబుట్టు, వు
త్కటయా రాక్షసి యైన శూర్పణఖ యంతన్ వే హఠాత్తేటి కో
యటకున్ వచ్చి సురాభ రాముని గనె న్నాశ్చర్య మేపారఁగన్. 273

* ఇంతకు పూర్వము 10 ఏండ్లు గడచెను. పిదప ఇంతవఱకు మూడేండ్లు గడచెను. అని వ్యాఖ్య. మిగిలిన యేడ్వాదిలో చైత్రమున భావిరాక్షస వధకు నాందిగా శూర్పణఖాగమనము వర్ణన చేయబడును.

పంచాస్యమున కటుల్ వక్షమున్ వృథుబాహు
　　లబ్జపత్రాక్షులు నలరువాని
ఆజానుబాహువు లతిసుందరాస్యము
　　కడు ప్రియదర్శన మడరువాని
గజవిక్రమమువంటి గమనంబు గలిగియు
　　జడలగుంపును దాల్చి జరగువాని
సౌకుమార్యంబును సత్త్వాధికతయును
　　రాజలక్షణగతుల్ గలుగు వాని

రాము నిందీవరశ్యాముఁ బ్రథితగుణుని
మన్మథ సురూపు ద్యుతిధృతుల్ మసలువాని
ఇంద్రుతో సాటియౌ వాని నెలమి గాంచి
అసురకాంత శూర్పణఖ కామాంధ యయ్యె. 274

అతఁడు సముఖుఁ డామె యపముఖి వృత్తమ
　　* ధ్యుఁడతండు, బొజ్జతో నొప్పె నామె
అతఁడు విశాలాక్షుఁ డామె విరూపాక్షి
　　యతఁడు సుకేశుఁడ యది వికేశ *
అతఁడు ప్రియాకారుఁ డది యప్రియాకార
　　యతఁడు సుస్వరుఁ డామె యతి భయరవ
అతఁడు యువకుండ యామె దారుణవృద్ధ
　　యతఁడు దక్షిణుఁ డామె యధమవాక్య

అతఁడు న్యాయమౌ శీలాన నలరు వాఁడు
ఆమె దుష్టమౌ శీలంబున నమరియుండు
అతఁడు ప్రియుఁ డదియప్రియురాల యట్టి
యనఘు నట్టి రాక్షసి చూచి యనియె నిట్లు. 275

---

* వృత్తమధ్యుఁడు=గుండ్రని నడుముగలవాఁడు
* వికేశ=వికృతకేశములు గలది.

జడలన్ దాలిచి తాపసాకృతివియై చాపంబు బాణంబు లి
ట్లడరన్ భార్యను గూడి రాక్షసుల కిల్లై యుండు నీభూమిలో
నడయాడం బనియేమి సత్యము తగన్ వాక్రుచ్చు మంచున్ పదం
పడి * శూర్పాభ నఖాల శూర్పణఖయున్ బ్రశ్నింప రాముం డనెన్. 276

అడిగిన వార లెట్టిజను లైన సరే ఋజు బుద్ధి యౌటచే
నడిగిన దానికిన్ సరిగ నప్పుడు రాముఁడు చెప్పసాగె నె
ప్పుడును నసత్యమాడఁ బ్రియ ముండదు రాముని, కిందు పైగ నీ
పడఁతి జనంబుదగ్గఱన పల్కు నసత్యము లాశ్రమస్థుఁడై. 277

వ. "దశరథుఁ డను నొకరాజు గలఁడు. అతడు దేవతలతో సాటి యగు పరాక్రమము కలవాఁడు, అతనికి నేను పెద్దకుమారుఁడను రాముఁ డని నన్ను జను లందురు. ఈ లక్ష్మణుఁడు నాచిన్న తమ్ముడు. నన్ను వ్రతము పూని యనుసరించెను. ఈమె విదేహరాజు కూతురు. నాభార్య. ఈమెను సీత యందురు. నరాధిపతియైన నాతండ్రియును తల్లియును ఆజ్ఞాపింప ధర్మము కొఱకుఁ గట్టు బడి ధర్మాభిలాషినై ఈ వనములో వసింప వచ్చితిని. మఱి నీవెవరో తెలికొనఁ గోరుచున్నాను. చెప్పు ఎవరవు ఎవనిదానవు. నీవుమనస్సు హరించు నందము గలదానవు. నిన్నుఁ జూడఁగా రాక్షసిగా నీవు తోఁచుచున్నావు. ఇక్కడకు ఎందుకు వచ్చితివి. సరిగాఁజెప్పుము" అని రాముఁ డనఁగా నారాక్షసి కామపీడితయై యిట్లు చెప్పెను. 278

వినుమోరామ! వచింతు సత్యమునె యీ విశ్వంబులో గామ రూ
పిణియౌ రాక్షసి నేను, శూర్పణఖ నాపే రీయరణ్యాల నొం
టిని నై సర్వభయంకరంబ యగుచున్ నే సంచరింతున్ బలి
ష్ఠుని నారావణు నన్నగా నెఱుఁగు రక్షో నాథుఁ డాతండు సూ. 279

---

* శూర్పాభ—చేటలతోసమ మైన నఖాల=గోళ్ళుగల

అతఁడో వీరుఁడు నీవు వాని బహుశో యాలించి యే యందు విం
దతఁడున్ విశ్వ వసు ప్రియాత్మజుఁడు నిద్రన్ గుంభకర్ణుండు సం
తతమున్ బొందు, విభీషణుండొ యెపుడున్ ధర్మాత్ముఁడై యుండు స
న్మతితో రాక్షసచేష్ట లెప్పుడు తలంపం బోడు భద్రుండెయై. 280

ఖరుఁడున్ దూషణుఁ డట్టి వాని యనుజుల్ ఖ్యాతుల్ రణంబందు ని
త్తఱి నేనందఱికంటెఁ గాలఘనమౌ దానన్ నినుం గన్న యీ
తఱి నుండిన్ పురుషోత్తముండ వగు నీతాత్పర్యముం బొందితిన్
మఱియున్ నేనొ ప్రభావ యుక్తను కడున్ స్వచ్ఛంద వీర్యోజ్జ్వలన్. 281

చిర కాలంబుగ నాకు నీవు పతివై జీవించు, మీసీతతో
మఱి నీవేమి యొనర్తు,వీమె వికృతం బౌచున్ విరూపాత్మయై
పఱలెన్, నీకిది యెంతయున్ తగనిదై ప్రాప్తించె! నేనే యిటన్
సరియౌ దానను రూపుచేత సతియౌ నన్ జూడుమీ చక్కఁగా. 282

వికృతాకారను నీఛయుంకరిని పాపిన్ బక్కయై చిక్కి పొ
ట్ట కనన్ లేనిది యెమనుష్య సతి పెట్టన్ నీప్రియున్ దమ్ము నీ
వు కనన్ చట్టున మ్రింగి నంజుకొనెదన్ ముమ్మందె. యామీఁద న
డ్డిఁక లేకుండ వనుల్ గిరుల్ చరచరా స్వేచ్ఛన్ తిర్గు నాతోడుతన్. 283

తగ నటు శూర్పణఖ వచిం
పఁగ విని ప్రహసించి *యంత మదిరేక్షణతో
తగునటు వాక్య విశారదుఁ
డగు రాముఁడు చెప్పఁబూనె నాసముయమునన్. 284

---

* మదిర=కల్లువలె మత్తు కలిగించునవి. ఈక్షణములు=కళ్ళేకాని మాటలు కాని రూపముగాని మత్తుకలిగింపవని సాభిప్రాయోక్తి.

అటు కామాంధత నేమి యాడవలెనో యాలోచనే లేని చె
న్నటియై పల్కుచు నున్న శూర్పణఖకున్ *శ్లక్ష్ణంపు స్వచ్ఛోక్తితో
నిటులన్ జిర్నవు నవ్వి రాము డపుడే యింపార హాస్యంబుగా
కటుతన్ వీడి వచించె నామెయును జాగ్రద్బుద్ధి నాలింపగన్. 285

భార్య యున్నవాడను నార్యురాల!
ఈమె నాకుఁ బ్రియంబయి యెసఁగు భార్య
నిన్నుబోఁటి స్త్రీలకు చెప్ప డన్నివిధుల
సవతియుండుట యెంతొ కష్టంబు గూర్చు. 286

అతఁడొ నాతోఁడ బుట్టువౌ ననుఁగు భ్రాత
తగిన శీలవంతుఁడు ప్రియదర్శనుండు
శ్రీయుతుండు చెంతను భార్య లేనివాఁడు
వీర్యయుతుఁడు లక్ష్మణుఁ డని పిలవఁ బడును. 287

భార్య మునుపుండె లేదిప్డు భార్య వలయు
యువకుఁడె ప్రియదర్శనుఁ డయి యొప్పుచుండె
ఇట్టి నీరూపమునకును నిట్టి నీకు
తగిన యనురూప భర్త కాఁదగిన వాఁడు. 288

* ఓ విశాలాక్షి! యిప్పుడు నీవు నాదు
భ్రాత నిఁక భర్తగా వేగ పడయు సుమ్మి
అరుణ కాంతియు నామేరుగిరిని బోలె
** ఓ వరారోహ! సవతియా యుండబోఁదు. 289

వ. అని రాముఁడు చెప్పఁగా విని ఆ రాక్షసి కామ మోహితురాలయి రాముని విడిచిపెట్టి లక్ష్మణుని పట్టుకొని యిట్లనెను.

---

* శ్లక్ష్ణము=సన్నని అందమైన.

* శూర్పణఖనుగూర్చి హాస్యమునకై విశాలాక్షి అని వరారోహ అని సంబోధన చేయఁబడెను.

వరవర్ణిని నగు నేను న
నురూప సతినౌదు నీకు నూతనముగనే
నిరతము నాతోఁ గూడ వి
హరింపుమీ దండకవనములను నానందముతో. 291

తగనటు శూర్పణఖ వచిం
పఁగ విని ప్రహసించి యంత మదవతితోడన్
తగు నటుల వాక్యకోవిదుఁ
డగు లక్ష్మణుఁడును వచించె హాసమయముగన్. 292

దాసుఁడ నగు నా కీవో
దాసి వయిన భార్యకాఁగఁ దలచెద వేలా
వాసిన్ పూజ్యుఁడు నన్నకు
దాసుండను నెప్పు డస్వతంత్రుఁడఁ గాంతా. 293

ఎన్న సమృద్ధార్థుడగు
నన్నకు సిద్ధార్థవును ప్రహర్షాన్వితవున్
తిన్నని విమలపు వర్ణవు
క్రన్ననిఁక చిన్నభార్య కమ్మీ భామా! 294

వికృతాకారను ఈ భయంకరిని పాపిన్ బక్కయై చిక్కు పొ
ట్ట కనన్ లేనిసు వృద్ధ నీమె పెను పెంటన్ వీడి నిన్నే యితం
డిఁకఁ గైకోఁగలఁ డిట్టి శ్రేష్ఠమగు సొంపే ప్రాజ్ఞుడేన్ వీడి యీ
వికృతన్ మానుషి నట్టిపెట్టుకొను నోవిశ్వైకరమ్యాంగిరో. 295

అనుచు నామె భీకరి చిక్కినట్టి పొట్ట
గలది యని లక్ష్మణుం డిట్లు తెలిపి నపుడు
ఏది పరిహాస మెది నిజ మెఱుఁగలేని
యామె లక్ష్మణునుడి సత్య మనుకొనియెను. 296

జనకపుత్త్రితోడను పర్ణశాలయందు
కూరుచున్న దుర్ధర్షుని వైరిదమను
రాముఁ గాంచి శూర్పణఖయుఁ గామవశత
నంధురాలయి యీరీతి ననియె నపుడు. 297

వికృతాకారను ఈ భయంకరిని పాపిన్ బక్కయై చిక్కి పొ
ట్ట కనన్ లేనిది వృద్ధ నీమెఁ గాని తోడన్ నన్నె మన్నింపవే
లకు, వీక్షింపుమి యిప్పు డీవె కనులారన్ జూడ నీమానుషిన్
వికృతన్ మ్రింగియు నిస్సపత్నినగుచున్ నీతోఁ జరింతున్ దమిన్. 298

అనుచు నిప్పు కొఱవివంటి కనులు గల్గు
శూర్పణఖ లేడిపిల్లదౌ చూపు గలుగు
సీతఁ బట్టగఁ బరువెత్తె శీఘ్ర మలిగి
యెంతొ మండు మహోల్క రోహిణిని బోలె. 299

అట్లు మృత్యుపాశమువోలె నరుగుదెంచు
రాక్షసిఁ గని ఘనబలుఁడౌ రాముఁ డల్గి
హుంకరించి క్రుద్ధుఁ డయి శంకవీడి
లక్ష్మణునితోడ నపు డిటులన్ వచించె. 300

క్రూరులు ననార్యులైనట్టి వారితోడ
నెటులును పరిహాసములు గావింప రాదు
సీతఁ గను; మహోదరి రాక్షసిఁ బ్రమత్త
వికృతను విరూపఁ జేయు జీవించి యుండ. 301

వ. అని రాముఁడు చెప్పఁగ విని లక్ష్మణుఁడు క్రుద్ధుఁ డయి రాముని పార్శ్వమునందె యున్న కత్తి తీసికొని యాశూర్పణఖ ముక్కు చెవులు కోసె. అట్లు ముక్కు చెవులు కోయఁగా వికృత స్వరము గలుగునట్లు అర్చుచు ఘోరురాలు శూర్పణఖ వచ్చినట్లు పరువెత్తె. ఆరాక్షసి విరూపయై నెత్తుటఁ దడిసి వర్షా

కాళమున మబ్బువలె అనేక నాదములు చేయుచు నెత్తురు చిమ్ముచు బాహువులు చాపి మహావనమును ప్రవేశించి రాక్షస సంఘముళతో గూడి జనస్థానములో నున్న క్రూరదర్శనుఁ డైన భ్రాత దుని సమీపించి ఆకాశము నుండి పిడుగువలె భూమియందు పడి, భయమోహములచే మూర్ఛితురా లయి రాముఁడు భార్యతోడను లక్ష్మణునితోడను దండకాటవికి వచ్చినట్లు సర్వవృత్తాంతము చెప్పె. 302

## —: ఖరుఁడు కోపించి యడుగుట :—

వ. అట్లు పడి విరూపయయి నెత్తుటఁదడిసి యున్న చెల్లెలుశూర్పణఖను జూచి క్రోధముచే నొడలు తెలియని వాఁడై రాక్షసుఁడు ఖరుఁ డిట్లనె. 307

కోరల విషముండ నూరక పడియున్న
యెదురైన పామును కదిపె నెవఁడు

కాలపాశ మవని కనకయె నిను నొంచి
గొప్ప విషంబును గ్రోలె నెవఁడు

బలయుత కామరూపయుఁ గామగయు నంత
కాభ యే నిన్నిట్లు కలఁచె నెవఁడు

ఆమహాత్ము లగు దేవర్షి గంధర్వుల
లోనిన్నుఁ జేసె విరూప నెవఁడు

ఇంద్రు విడిచి నా కప్రియమెవఁడుచేయు
పాలు హంసటుల్ వాని ప్రాణాలు తీతు
ఏను చంప నెవ్వని నెత్తు రిలయు త్రాగు
వేని మాంసము పక్షులు ప్రీల్చి తినునొ. 304

అమర గంధర్వులును పిశాచము లసురులు
నేను పట్టిన వాని రక్షింపలేరు
దుర్వినీతుఁ డెవ్వండు నిన్ను దూఱి గెల్చె
సరిగ స్మృతి పొంది వానినిన్ గుఱిచి చెప్పు. 205

వ. అని క్రోధంబున మండి పడి యడుగు తన సోదరుని వాక్యములు
విని శూర్పణఖ కన్నీరు విడుచుచు నిట్లనె. 206

తరుణాంశుల్ సుకుమారు లందమును సత్యంబున్న పద్మాక్షులున్
వరకృష్ణాజిన చీర ధారులును గంధర్వేశ తుల్యుల్ మునీ
శ్వరులున్ మూల ఫలాశులున్ దశరథక్ష్మాధీశ సత్పుత్రు లుం
డిరి తన్నామము రామలక్ష్మణులు క్షోణీనాథ చిహ్నాంకితుల్. 207

వారు దేవులొ మనుజులొ వేఱె యూహ
చేసి చెప్పుట కిష్టంబు చెందఁగాని
వారిమధ్య జవ్వనియు రూపంబు గలిగి
సకల భూషల నొక సుమధ్య కనఁబడియె. 208

వారిరువురచేత ప్రమద కారణమున
అసతియటు లనాథ యటు చేయంగ బడితి;
కుటిల యగు నామెదియు వారి చటుల మైన
నురుగుతోడి నెత్తురు త్రాగ నుత్సహింతు. 309

వ. "ఇది నామొదటి కోరిక. నీవు యుద్ధములో చంపఁగానే నామె
నెత్తురు త్రాగుదునని ఆమె చెప్పుచుండఁగా ఖరుఁడు కోపించి యంతకులవంటి
పదునాల్గురు మహాబలులైన రాక్షసులతో నిట్లు చెప్పె. మనుష్యులును శస్త్రము
లతోఁ గూడిన వారును చీర కృష్ణాజినములు ధరించినవారునగు నిరువురు
స్త్రీతోగూడ ఈ దండ కారణ్యమును ప్రవేశించిరి. మీరు వెళ్ళి వారిని జంపి
వారిని తీసికొని రండు ఈనాచెల్లెలు వారి రక్తము త్రాగును. ఇది నా చెల్లెలి

కోరిక. మీరు మీతేజస్సుతో వారిని జంపి ఈకోరిక తీర్పుఁడు" అని ఖరుఁడు
ఆదేశింప వారు గాలిచే ప్రేరేంపఁబడిన మేఘములవలె బయలు వెడలిరి. 310

—: ఖరుని భటులు రాము నెదుర్కొనుట :—

పిదపన్ ఘోర విరూప శూర్పణఖయున్ వేగంబ రామాశ్రమం
బదనందే చని పర్ణశాలదరి సౌఖ్యాసీనులై యున్న యా
సుదతిన్ భ్రాతలతోడ రాక్షసులకున్ జూపంగ నారాముఁడుం
బిదపన్ లక్ష్మణుఁ బల్కె సీతఁ గనుమీ యేన్ వీరులన్ జంపెదన్. 311

అని రాముండు వచింప లక్ష్మణుఁడు తానట్లేయనన్ రాముండున్
ధనువున్ బంగరు దాని నెక్కిడిచుఁ బెన్ బాణంబు సంధించి యి
ట్లనె ఓరాక్షసులార! యాదశరథజ్యా భర్త మాతండ్రి ల
క్ష్మణుఁడీతం డనుజుండు రాముఁడని యాఖ్యన్ గన్నవాఁడన్జుఁడీ
312

ఏము సీతతోఁ గూడఁ జరింపరాని
దండకారణ్యమున నున్న ధార్మికులము
పండ్లు దుంపలు తినెడి తాపసుల మెపుడు
దాంతులమ యేల మమ్ము హింసింతురిట్లు 313

పాపులయి యపకారులై పఱచివచ్చు
మిమ్మునాజిబుషుల నియోగమ్మువలన
చంపవచ్చి బాణముల్ శస్త్రమూని
యుంటి నిల్వుండు ప్రాణేచ్ఛయున్నఁ జనుఁడు. 314

రాముఁ డిటుపల్క నలిగి బ్రహ్మఘ్నులైన
పదినలువు రసురులు శూలపాణులగుచుఁ
బలికిరిటు మాప్రభు ఖరుఁ గోపంబు గూర్చు
నీవె మాచేత నాజి వధింపఁబడెదు. 315

అనిని పెక్కు రెదుట నొక్క మనిషి వీవు
ఎట్లు నిల్వఁ గలవు నీకునేది శక్తి
రమ్ము మాచేతి పరిఘ శూలాలచేత
నీవు ధనువుసురులు విసర్జింతు విపుడె. 316

అని పలికివారు క్రుద్ధుత్తై యాజిగెలువ
రాని రాముపై శూలముల్ వైవరాముఁ
డప్పు డా శూలముల నెల్లనన్ని పసిఁడి
శరములను వేసి భేదించె త్వరగనిట్టి. 317

ఆ మహాతేజుఁ డపుడు సూర్యాభ మైన
పదియు నాల్గు వాడివి యౌచుఁ బసిఁడి పిడులు
వఱలు శరముల గుండెలన్ వైవవారు
పిడుగు లటు లార్చి నెత్తుటం దడిసి పడిరి. 318

మొదలు నఱికిన తరు లట్లు భువిని పడిన
వారలను జూచి రాక్షసి భైరవముగ
నార్చి పఱచి నెత్తురు తెండ సడలి ఖరుని
దరిఁబడె జిగురు నందుగు తరువు వోలె. 319

అట్లు పడి యనర్థముకొఱ కరుగుదెంచి
నట్టి శూర్పణఖను జూచి వ్యక్త మైన
వాక్కుతోఁ బల్కె నీకయి పదియు నల్వు
రసురులను పంపితి గద యిం కార్చెదేల 320

భక్తు లసురులు నా కనురక్తు లెపుడు
చంపెదరు చంపఁదగ, రాజి సరి యొనర్తు?
ఏమి యిది యయ్యో నాథ! యంచేడ్చు చుంటి
చెప్పు పామటుల్ దొర్లెద విప్పుడేల. 321

నాథుఁ డగు నేనె యుండ సనాథవోలె
ఏల యేడ్తువు లేలెమ్ము బేల కాకు
పిఱికితనము వీడుమ యంచు ఖరుఁడు పలుక
నామె కండ్లు తుడిచికొంచు ననియె నిట్లు. 322

చెవులు ముక్కు కోయంబడి చేరినాను
నేను నెత్తుటఁ దడిసి రక్షింపఁబడితి
మన్ని మిత్త మలరామలక్ష్మణులఁ జంప
పదియు నల్వు రసురలును పంపఁబడిరి. 323

వారలో శూల పట్టిస ధారు లగుచు
మండి రాఁజూచి రాముండు మర్మఁ జీల్చి
బాణములు వేసి చంపఁగ వారిఁ జూడ
రాము ఘోరకర్మకు మహాత్రాస మొదలె. 324

హడలి పోయితి రా ! యార్తిఁ బడితి
సర్వ దిశల నుల్కి మఱి నీశరణు గంటి
వ్యథల మొసలులు భయతరంగాళి మించు
కష్ట జలధి మున్గిన నన్నుఁ గావవేల 325

ఇదిగొ వీరి వాడి శరాల నిట్టె త్వరగ
రాముఁడో చంపె బలమున్న రాక్షసాళి
పైని నాపైని దయయున్న వని వసించి
రాక్షసులకుఁ గంటక మగు రాముఁ జంపు. 326

నాకు శత్రువౌ రామునిన్ జంపకున్న
నీయెదుట సిగ్గు వీడి మేన్ విడుతు నిపుడె
ఆత్మఁ బరికింప నీవు మహాత్ముఁడైన
రాము దరి సబలుఁడవై నిలంగ లేవు. 327

శూరుఁడ వనుకొందువు కావు శూరుఁడవును
మిథ్యగ సు్రవికముఁడ వని మెలగుచుందు
వామనుష్యులౌ లక్ష్మణు రాము నెపుడు
చంపఁగా లేవు పరికించి సరిగఁ జూడ. 328

రాముతో సాటియౌ తేజోబలంబు లున్నఁ
బ్రథితు దండకాటవి నున్న రాముఁ జంపు
ఓకులాంగార! యబలుఁడ వుండ కిచట
ఈ జనస్థానము విడి పో హితులతోడ. 329

వ. నీవు రాముని తేజస్సుచేఁ దిరస్కరింపఁ బడినవాడవు నీవు త్వరగా నశించెదవు. దశరథాత్మజుఁ డైన యా రాముఁడు మహాతేజస్సు గలవాఁడు సన్ను విరూపనుగాఁ జేసిన యాలక్ష్మణుఁడును మహావీరుఁడె అని యనేక విధములుగా విలపించి మహోదరి యగురాక్షసి యెక్కువగా దుఃఖించుచు చేతులతోఁ గడుపు బాదుకొనుచు నేడ్చెను. 330

ఇటులు చేటల వంటి గోళ్ళైసఁగి యున్న
శూర్పణఖ యవమానింపఁ జూపి ఖరుఁడు
ఖరతముగ రాక్షసుల యు్రగమున నపుడు
పలికె క్రోధంబుచే నొడల్ తెలియకుండ. 331

నీవిటు లవమానించుటన్ బెరిగి పోయి
క్రోధ మిది సాటిలేనిదై మీది కుటికి
యాపు కొన శక్య మదిగాక యార్తిఁ గూర్చె
గాట మగు పుండుపై నుప్పు నీటిఁ-బోలి. 332

నరునిన్ రాముని క్షీణజీవితు రవంతం గూడ లెక్కింప, నా
వరవీర్యం బటువంటి. దాత్మ కుటిల వ్రాతంబుచే రాముఁడీ
తఱి ప్రాణంబులు గోలుపోవు నిఁక నీతాపంబు కంగారు చె
చ్చెఱ వర్జింపుము వారలన్ యమపురిన్ శీఘ్రంబె వంపించెదన్. 333

నాదు గండ్రగొడ్డలిచేత నరుకఁ బడఁగ
ప్రాణము విడు రాముని వేడి రక్త మీవు
రాక్షసీ! త్రాగెదవు లెమ్ము రయము యనుచు
ఖరుఁ డనఁగ మౌర్ఖ్యమున నామె ఖరు స్తుతించె. 334

ఆమె తెచ్చ గొట్టి స్తుతింప నాతఁ డపుడు
సైన్యపతి దూషణుని బిల్చి సరగఁ జెప్పె
నాదు మతి చొప్పు వర్తించు నట్టి పదియు
నాల్గు వేవురు గలుగుసైన్యముల నడపు. 335

కన భీమం బయి యాజి మర్లని మహోగ్రాకారులన్ క్రూర వ
ర్తనులన్ శూరుల లోకహింసకుల నీలాభ్రాభులన్ వ్యాఘ్ర దా
రుణులన్ రాక్షసులన్ మహాస్యులను సర్వోద్యోగ దీప్తాత్ములన్
ఘనులన్ వెంటనె వంపి సర్వబలమున్ సంసిద్ధ...న్ జేయుమీ. 336

త్వరగా నారథమందు వింటిని విచిత్రంబైన ఖడ్గంబులన్
శరముల్ శక్తుల నుంచి తెమ్మనఘులై పౌలస్త్యులౌ రాక్షసుల్
అరయన్ రామునిఁ జంపఁ బోదు నని వాక్యం బాడగా దూషణుం
డు రథం బంతటఁ బూన్చి వచ్చి యనెఁ దోడ్తో సిద్ధ మైనట్లుగన్ 337

అవలన్ మేరువు శృంగ మట్లలరి స్వర్ణాభూష ణోద్భాసియై
వివిధ స్వర్ణపు మత్స్య పక్షి ధరణి భృద్వృక్ష సూర్యేందు పు
ష్ప విచిత్రంబయి హైమ చక్ర మగుచున్ సౌవర్ణ పుం గింగిణుల్
రవముల్ చేయు రథంబు నెక్కె ఖరుఁ డార్భాటంబు మీఱన్వడిన్. 338

రథ మం దాఖరు దూషణుస్ గని మహోగ్రంబైన వీర్యంబు చే
మథియింపంబడి రాక్షసుల్ నలుగడన్ బార్శ్వబులందుండఁగన్
రథముస్ వీరులు నాయుధాలు గల సైన్యం బెల్ల వీక్షించుచున్
పదుఁడీ ముందుకె యంచు దూషణ రుల్ వాక్రువ్వసేనల్ చనెన్ 339

పరశుల్ పట్టిసముల్ గదల్ పరిఘులున్ వజ్రాలు శూలాలు ము
ద్గరముల్ చక్రములున్ పరశ్వధములున్ ఖడ్గాలు చాపాలు తో
మరముల్ శక్తులు బాణముల్ ముసలముల్ మైఁ దాల్చి పద్మాక్షుల్గు వే
పురు వీరుల్ ఖరచిత్త వర్తనులు తీవ్రుల్ వెళ్ళి రప్పట్టుననన్. 340

వ. అప్పుడు ఆభీమవిక్రములైన రాక్షసులను అనుసరించి ఖరుఁడు కొంతవడికి వెళ్ళెను. అప్పుడు బంగారు భూషలు గల యశ్వములను సారథి తోల నారథ శబ్దంబునకు దిశలు మార్మోగెను. 341

అపుడు క్రోధంబుతో కరస్వరముతోడ
నరిని జంపఁగ నంతకు డట్లు కరుఁడు
జాల వర్షించు మేఘముల్ గాలివోలె
సారథిఁ బురి కొల్పివడిగ సాగె ముందు, 342

గాడిదపళ్ళను బోలి బూడిద రంగుల
నీరదా లశుభమై నెత్తురు కురిసె
అరదాలఁ గట్టిన యశ్వాలు నూష్మాఢ్య
సమరాజ పథి యదృచ్ఛగను పడెను
కొన నెఱు పైన నల్లని పరివేషము
కొఱవి చక్రముబోలె నరుణుఁ జుట్టె
మెండైన బంగారు దండాల జెండాలు
పట్టియు పెను గ్రద్ద యట్టె నిలిచె

చని : వ్ర సమునఁ బరుషముగ నఱచి
మాంసము తిను పక్షి మృగాలు మసలి కూసె
అసురుల కభిముఖముగ నక్క లఱచి తిరిగె
వసుధ నాజనస్థానముల కరుగు నపుడు 343

మత్తేభములటు భీమంపు మబ్బులు సెత్తు
రలఁది మింట మిను లేనటులఁ జేసె
సంజ వేళయె కాక చదల నెత్తురలమె
దిశల విదిశలఁ బెన్ తిమిర మడరె
ఎదురొచు నక్కలు గృధ్రాలు డేగలు
ఘోరమైన మృగ పక్షులును నఱచె
పరిఘమువలె మొండె మరుణుదగ్గఱ తోచ
రవిని పర్వమె కాక గ్రహము పట్టె

వీచెను తుఫాను, సూర్యుండు వెలుగఁ డయ్యె
రాత్రిగాక మిణుఁగురు లట్లడరె చుక్క
లణఁగెఁ జేపలు పక్షు, లెండెను నళినులు
గాలిలేక మబ్బటు దుమ్ము కడలఁ గ్రమ్మె. 344

పూలు పండ్లును లేక మోడు లయ్యెను దరు
లీఁచికూచియని శారికలు నఱచె
ఉల్కలు పిడుగులు నుగ్రమై పడియెను
సురరథము మ్రోగ ధరణి వడఁకె
ఎడమచేయి యదరె నితని మాట వడంకె
అన్నివైపులఁ జూడ నస్త్రు లురలె
నుదుటి బాధ జనించె నొదవెను కంపము
సైనను అని నుండి వెనుకఁ జనఁడు

ఇట్టి యుత్పాతములను వీక్షించి కూడ
ఖరుఁడు నవ్వుచు చనియె రాక్షసులతోడ
నేను బలవంతుఁడను బలహీనమైన
వీని నాశక్తి లెక్కపెట్ట సుంత. 345

వ. తీవ్ర బాణములచే మింటినుండి నక్షత్రముల రాలగొట్టెద. మృత్యువును అయ్యెదను. గర్వితులగు నామలక్ష్మణుల చంపం మరలను.

ఎవతెచే రామలక్ష్మణు లిట్టిచత్తు
రామె నాచెల్లె తద్రక్త మానుఁగాక
ఆజి నింతవఱకు నోడు టన్నమాట
యెఱుఁగ మీరె చూతు రసత్య మెప్పు డాడ. 346

ప్రవిది త్రైరావతము నెక్కి వజ్రిఁ గూడ
నిట్టె కూల్తు నిట్టి కుమర్త్యు లేమిలెక్క
అనుచు గర్జించు ఖరు వాక్కులాలకించి
మృత్యుపాశానఁడు సేన ఎంతొ పొంగె. 347

సుర గంధర్వులు సిద్ధచారణు, లనిన్ జూడంగ నేతెంచి ప
ల్కిరి "గోబ్రాహ్మణ లోక పూజితులకున్ శ్రేయస్సు లౌఁగాక సం
గరరంగంబున రాఘవుం డసుర సంఘం బచ్యుతుండట్లు స
త్వరమే గెల్చెడుఁగాక" యంచు గగనస్థానిన్ విమానస్థులై. 348

వ. ఇటు లింకను పలురకములుగా పలుకుచు పరమర్షులు కుతూహలముతో గతాయుషు లగు రాక్షసుల సేనను జూచిరి. ఖరుఁడు మాత్రము వేగముగ సైన్యాగ్రమునుండె బయట వెడలగా మరల రాక్షసులు ఆ ఖరునిచుట్టును చేరిరి. శ్యేనగామి, పృథుగ్రీవుఁడు. యజ్ఞశత్రువు, విహంగముడు, దుర్జయుడు, కరవీరాక్షుఁడు, పరుషుఁడు, కాలకార్ముకుఁడు, మేఘమాలి, మహా

మాలి, సర్పాస్యుఁడు, రుధిరాశనుఁడు అను నీపన్నెండుగురు మహావీరులు ఖరుని కెదురుగా వెళ్ళిరి. మహాకపాలుడు. స్థూలాక్షుఁడు, ప్రమాది, త్రిశిరుఁడు అను నీనలుగురు సేనానులు దూషణుని అనుసరించిరి. ఇట్లు భీమవేగముగలిగి సమరము చేయఁగోరిన మహాబల యగు రాక్షస వీర సేన, ఆరాజపుత్రుల దగ్గఱకు వెంటనే వచ్చి గ్రహములమాల సూర్యచంద్రులను వలె ఆక్రమించెను, 349

ఖర పరాక్రమ మేపారు ఖరుఁడు నాశ్ర
మమున కేగ మేను * పులకింపఁగఁజేసి
ప్రజల కహితమౌ నట్టి యుత్పాతములనె
రాముఁ డరసి స్వాస్థ్యము పోవ భ్రాత కనియె. 350

ఓ మహాబాహు ! భూతాల నుక్కడంప
సర్వ రాక్షసులకు చావు సరిగ తెలుపు
నీమహోత్పాతములఁ జూడు మిదిగొ మబ్బు
గర్ద భారుణమై నెత్తుఱు కరముఁగురియు. 351

శరముల్ పెన్ పొగఁ జిమ్ముచున్ సమరమున్ శ్లాఘించు నీ మేలిబం
గరు పిళ్ళున్న ధనుస్సులున్ గదలు; నగ్రంబందు మాకెంతయో
వెఱపౌ జీవిత సంశయంబు గలిగెన్ వీక్షింపు "డన్నట్లు ని
త్తఱి పక్షుల్ పడఁగూయు, గొప్ప క్షయమున్ దాపయ్యెబోయిప్పుడే. 352

* భయముచేఁ గూడ ఒడలు పులకరించును. ఖర పరాక్రమము ఉగ్రమైన పరాక్రమము.

"ఇదిగో నా భుజమున్ స్ఫురించి పలుమా, తీస్వల్ప కాలంపు స
న్నిధిలోనే మనకున్ జయంబు. నరికిన్ జేడ్పాటు నౌనంచు ని
య్యది సూచించును; వేరి మోము విమలంబౌ సుప్రభం బౌచునుం
డవొ వారోడుదు, రేరి మోము విమలంబౌ వారికే గెల్పగున్. 353

"క్రూరుల్ రాక్షసు లేర్చిచేయు ధ్వనులున్ ప్రోగించు భేరీధ్వనుల్
ఘోరంబౌ, శుభ మొందఁ గోరెడి నరుండున్ బాధ శంకించుచున్
దూరాలోచనతోఁ జరింపవలెఁ దోడ్తో సీతతోఁ బోయి యా
చేరన్ రాని ద్రుమాఢ్యమౌ గిరిగుహన్ క్షేమంబ నిల్వుం డికన్. 354

వ్యతిరేకం బొకయింత దీనికి నొనర్పంబోకు, నాకాళ్ళతో
డుత నొట్టే సుమి యాలసింపకుమి తోడ్తోఁ బొమ్ము శూరుండ వ
ప్రతి యోధుండవ యైన నే స్వయముగా రక్షోగణం బెల్ల ను
ద్యత శక్తిన్ వధియింపఁ గోరెదను వత్సా ! శంక లేకుండఁగన్." 355

అని రాముండు వచింప లక్ష్మణుఁ డగమ్యంబౌ గుహన్ సీతతో
డను బాణాలు గ్రహించి విల్లుగొని తోడన్ దాఁ బ్రవేశింపఁగన్
పని పూర్తయ్యె నెబా సటంచుఁ గవచం బాపై వడిన్ దొడ్గి క్ర
న్ననఁ జీకట్లను మండు నిప్పువగిదిన్ రాముం డటన్ భాసిలెన్. 356

ఇఁక రాముండు మహా కా
ర్ముకమున్ శరములు గ్రహించి భూమి నభంబున్
వికటంబై మ్రోగగన్
సకల దిశలు నిండ నారి సరి మ్రోగించెన్. 357

సుర గంధర్వులు సిద్ధచారణ ఋషుల్ చూడంగ నేతెంచి చె
చ్చెర గోబ్రాహ్మణ లోకపూజితులకున్ శ్రేయస్సు లౌఁగాక సం
గర రంగంబున రాఘవుం డసురసంఘుం బచ్యుతుం డట్టులన్
త్వరగా గెల్చెడుఁగాక యంచు నని రవ్వారల్ విమానస్థులై. 358

అని వాక్రుచ్చి పరస్పరంబు గని క్రూరాచారులౌ రాక్షసా
శిని పద్నాలుగు వేవురన్ మఱి యెటుల్ శ్రీరాముఁ డొక్కండె ధ
ర్మ నిబద్ధుం డెదిరించు నంచును ఋషుల్ రాజర్షులున్ సిద్ధులున్
గణయుక్తంబుగ వింతతోఁ గన విమానా లెక్కి యున్నా రటన్. 359

## :— రాముఁడు ఖరుని సైన్యములతో పోరుట :—

అటు తేజస్సున వెల్గుచున్ రణముఖం బందున్న యారాము నం
తట వీక్షించి సమస్త భూతములు బాధం జెందెఁ తత్తుల్యుఁ డె
చ్చటఁ గన్పింపడ యిష్టు రాము ముఖవేషంబౌ పినాకంబు ను
త్కటుఁడై దాల్చిన రుద్రుఁ బోలి భయదంబై మీఱె నప్పట్టునన్. 360

సురగంధర్వులు సిద్ధచారణు లటన్ జూడన్. సమీపాన భీ
కర రక్షోగణముల్ పొనర్పెడి మహా గంభీర నిర్హ్రాదముల్
తఱి మార్మోగెడి ఖడ్గశస్త్ర కవచ ధ్వానాల్ విజృంభించుచున్
నిరతం బేర్చెడి సింహనాదములు నిండెన్ తద్వనం బంతటన్. 361

అవలన్ భీకర మైన యాధ్వనికి వన్యశ్వాపదాల్ పర్విడెన్
వివిధా లాయుధముల్ ధరించియు మహావేగంబుతో సైన్యముల్
కవియన్ భీమగభీర సాగర మటుల్ గాన్పింప రాముండు నా
హవభీముం డయి సర్వదిక్కులకుఁ గండ్లంతంత సారించుచున్. 362

ఖరు సైన్యంబులు సంగరాభిముఖమై కాన్పింప శీఘ్రంబుగన్
శరముల్ తూణులనుండి తీసి ధనువున్ సారించి యాదారుణా
సురులన్ జంపఁగ గాలవహ్ని యగుచున్ జూడంగ రాకున్న దు
ర్భరు రామున్ వనదేవతల్ గనిరి భావంబందు నుద్వేగముల్. 363

* మున్ను దక్షాధ్వర ధ్వంసమును బొనర్ప
ఆపినాకము నెత్తిన హరుని బోలి
యుద్ధరంగాన తేజస్సు లొప్పి యున్న
రాము వీక్షింప భూతముల్ పఱచె వెఱచి. 364

ధనుసులను నాభరణముల ధ్వజగణాల
నగ్నిఁ బోలిన కవచాల నమరియున్న
అసుర గణ సేన సూర్యోదయమ్మునందు
నీలి మబ్బుల బృందంబుఁ బోలె తనరె. 365

ఖరుఁ డా యాశ్రమమంత చేరియు ద్విషద్ఘాతాత్ము డు
ద్ధరు, యోధుల్ తనతోడ రా నరసి ఘోరధ్వానమౌ చాపమున్
కరమందెక్కిడి రాము ముందునకు వేగన్ స్యందనం బింకతో
లరసూతా! "యని హెచ్చరింప హయముల్ నడ్పించె సూతుండటన్.
366

అట వింటిన్గొని యొక్కఁడై పృథుభుజుండౌ రాముఁడున్నట్టి య
చ్చటికిన్ జోవు యెడిదైత్యుజుం మహాశబ్దంబు గావించుచున్
విట తాటంబుగ రాక్షసుల్ చనియు నావేష్టింప నవ్వారి కం
తట మధ్యస్నతఁ డొప్పెఁ దారల నడిన్నం గారకుండున్నటుల్. 367

శిరముల్ వేల్ కురిపించి యప్రతిమ తేజస్కుండెయౌ రాముపై
కరమాజిన్ ఘననాదమున్ బొనరుపన్ గర్జించు నారాక్షసుల్
కరమల్కన్ బలుశస్త్రముల్ కురిసి యుగ్రంబైన చాపంబు భీ
కరుఁడై దాలిచి దుర్జయుండయి మహాగంభీరుఁడౌ రాముపై. 368

---

* దీనిని కాళిదాసు దుష్యంతవర్ణనలో అనుకరించెను.

అనిలో ముద్గరముల్ పరశ్వథములన్ ప్రాసంబులన్ ఖడ్గముల్
ఘనశూలంబుల పట్టసాల గిరి తుల్యంబైన యేన్గుల్ హయా
ల నియోగించి పయోద తుల్యు లగు నారక్షోగణా లెల్ల రా
ముని నాజిన్ వధియింప నారిచిరి ముష్ఠన్ ఘోరనాదంబులన్ 369

బలధారఁ గురిపించు జలదాల గిరివోలె
శరవర్షి యసురాళి రాముఁ దొప్పె
తిథులఁ బారిషదాళిఁ దేలిన హరుఁ బోలి
రాక్షస బాణాళి రాముఁ డెసఁగె
నది జలాఘాతల్ జలధి వోలె నసురశ
రాళి నొవ్వక సైచి రాముఁ డలరె
దీప్తవజ్రాల నద్రీంద్రుఁ బోలియు మేని
రక్తాల సంధ్యాభ్ర రవిని బోలె

రాముఁ డొకఁడె సహస్రాసురాళిఁ బొదువఁ
గని ఋషి సుర గంధర్వులు వసటఁ గనిరి
కాని రాముఁడొ విలువంచి బాణతతులు
నూఱులును వేలు కురిపించె ధీరుఁ డగుచు. 370

అడ్డగింప రాని, సహింప నలవికాని
కాలదండము వంటి, వంకరలు లేని
శరము లేయు లీలగ. నవ్వి యరిబలాల
ప్రాణములఁ దీసికొనెఁ గాల పాశము లటు. 371

ఆశరాలు రాక్షసుల దేహాల వెడలి
రక్తములఁ దడ్సి దివి నుజ్వలాంగమయ్యె
గుండ్రముగను వంగినవింటి నుండి వెడలు
నగణిత శరాలు పీల్చె దైత్యాసువులను. 372

తలలున్ మొండెములున్ ధ్వజంబులును తత్తద్భూష ణోపేత బా
హులు తొండంబులఁ బోల్ తొడల్ పసిఁడిజీ నొప్పారు గుఱ్ఱాలు నే
న్గులు నంబారులు మావటుల్ రథములున్ సూతుల్ పదాతుల్ శతం
బులు పల్వేవురు రాము బాణములలోఁ బూర్ణాహుతై రచ్చటన్. 73

* పిదప నాళీక నారాచ వితతి చేత
ఆ వికర్ణులచేత తీవ్రాగ్రములను
వీల్చఁబడుచు రాక్షసులును భీమ మైన
యార్తనాదాలు చేసి మోహంబు పడిరి. 74

వ. ఆసైన్య మంతయు అపుడు మర్మములను భేదించు వాడి బాణము లచే రామునిచేఁ గొట్టఁబడి యెండిపోయిన యడవి అగ్నిచే వలె సుకము పొందదయ్యేను. అపుడు కొండఱు భీమబలులైన రాక్షసులు శూలములనుకడ్గము లను పరశ్వథములను ఇతరాయుధములను రామునిపైకి విసరిరి. అపు డా మహాబాహు వైన రాముఁడు ఆశస్త్రములను బాణములచే నడ్డగించి శిరస్సు లను నఱికి వారిని జంపి వైచెను. వారందఱు అపుడు శిరస్సులు కవచములు ధనుస్సులు తెగి పోఁగా గరుత్మంతుని అమృతాపహరణ సమయమున ఱెక్కల గాలికి విఱిగి పడిన చెట్లవలెఁ గూలిరి. చావఁగా మిగిలిన రాక్షసులు విషాద మొంది ఖరుని శరణుఁ జొచ్చిరి. వారి నందఱినోదార్చి మరల దూషణుఁడు రుద్రునిపై పు పరువెత్తు యమునివలె రామునిపైపు పరువెత్తెను. దూషణుని యాశ్రయముచే నిర్భయులైన రాక్షసులు మరల మద్దిచెట్లు తాటిచెట్లు. 75

* నాళీకములు=చివరమాత్రము ఇనుము కలివి.
నారాచములు=పూర్తిగా ఇనుమైనవి
వికర్ణులు=చివర అంకుశములున్న వి.

వ. వాళ్ళు ఆయుధములుగాఁ గొని రామునిపై పు పరు విడిరి. శూలము లను ముద్గరములను ధనుస్సులను మరల చేతులతో ధరించి శరవర్షములు కురిసిరి. శస్త్రముల వైచిరి. చెట్లను విసిరిరి. రాళ్ళు పడవైచిరి. ఇట్లు ఆ యుద్ధము మహాఘోరము అద్భుతమై తుముల మయ్యెను. ఇట్లు రాక్షసులకు రామునికిని మహోగ్రమైన రణమున దిక్కులు విదిక్కులు రాక్షసులతో ప్రాస ములతో శరవర్షములతో నిండిపోయెను, అపుడు రాముఁడు భైరవ నాదము చేసి మిగులఁ ప్రకాశించు గాంధర్వాస్త్రమును ధనుస్సున సంధానము చేయు అందుండి శరములు కురిసి బాణములతో నది దిక్కులను నిండిపోయెను. 376

శర మెన్నం డకఁ డెక్కుపెట్టు, విడుచున్ సంధించుఁ దూణంబులో
గర మెప్డంచునొ లాగునో యెఱుఁగరే కానీ శరాసారముల్
కురియున్ రాక్షసు లెల్ల నేడ్తురు, తలల్ కోల్పోదు రట్టిట్టులన్
పరువుల్ తీతురు, నాట్యమాడెద రహో! ప్రఖ్యాత యుద్ధంబులో. 377

శర వర్షంబుల మిన్ను సూర్యుఁడు సమస్తం బంధకారంబుగన్
వఱలెన్; రాముఁడు వాఁడి బాణముల వానల్ గ్రక్కుచున్నాఁడొ యన్
కరణిం దోఁచె; ధరిత్రిపైఁ బడు, పడంగా బోవు, నాపద్ద యా
మరణం బొందిన, దొర్లు రాక్షసులతో మాయం బదృశ్యంబె యౌ. 378

మరణంబొంధిన, కూలిన
నఱకఁబడిన, క్షీణులైన, నలిగిన, యెముకల్
విరిగిన ప్రీలిన యసురులు
ధరపైఁ గనఁబడి రటు నటఁ దగి వేవురుగన్. 379

తలపాగల్ తల లంగదాలు భుజముల్ తద్భూషితాంగాలు మూ
రలు మోకాళ్ళు తొడల్ నగల్ కరులు గుఱ్ఱంబుల్ రథంబుల్ ధ్వజం
బులు ఛత్రంబులు చామరాలు వ్యజనంబుల్ శూలముల్ పట్టిసం
బులు నారామునిచేత భిన్నమయి పోరన్ భూమి భీగొల్పెడిన్. 380

ఇటు తనసైన్య యోధుల వధించుచు నుండుట కండ్లఁ జూచి యు
ద్భట భుజుఁడైన దూషణుఁడు వారితులై సమరానివర్తులై
పటు బలు లైదువేవురను పంపఁగ వారలు పట్టె సాల ను
త్కట తరు శూల బాణకరవాల శిలల్ కురిపించి రయ్యెడన్. 381

స్వనయనముల మూసికొని వృషంబువోలె
అపుడు ప్రాణ హితమగు శిలాదివర్ష
ములను ధర్మాత్ముఁడైన రాముఁడు శరాల
నెదురుకొని సర్వరాక్షస వధకుఁ బూనె, 382

పిదప క్రుద్ధుఁడై తేజుచే వెలిగి వోలె
సైన్యమును దూషణుని దోల శరము లేయ
ద్వేషి దూషణుఁడైన యాదూషణుండు
సైన్యపతి పిడుగులవంటి శరము లేసె. 382

త్వరగ రాముఁడు కోపించి క్షురప మేసి
దూషణు ధనుస్సు భేదించి తురగములను
నాల్గిటిని వాడి శరములన్ జంపి సూతు
తలను భేదించె నర్ధచంద్రాస్త్ర మేసి. 383

త్రిశరముల దూషణుని ఱొమ్ము వ్రీలఁ జేసి
రాముఁ డార్వ ధనుస్సు గోల్పడి హయాలు
చావ సారథి కూల దూషణుఁడు విరథుఁ
డయ్యు నూరకుండకయె క్రోధాంధుఁ డగుచు. 385

గిరి శృంగంబునుబోలి, మేనఁ బులకల్ కీలించి, దీపించు బం
గురు పట్టంబులఁ జుట్టగాఁబడి, సురగ్రామం బఱన్ వైరిగో
పురముల్ చీల్చియు, నిన్ప మేకులను సంపూర్ణంబ సంబద్ధమై
పరవక్షో వస యొప్పు వజ్ర పరిఘన్ బామట్లుచేఁ బట్టియున్. 386

క్రూరుండై వడి దూషణుండు మిగులన్ క్రోధంబుతో రాము దు
ర్వారోగ్రంబ యెదిర్చి మీదఁ బడఁగన్ బవ్వెత్తి యేతేఱ నా
ఘోరాకార విశేష దూషణు భుజం గోగ్రంబులౌ బాహులన్
శూరత్వంబున రెండు బాణములచే సూక్ష్మంబ ఛేదించెఁగా. 287

హస్తములు తెగి తద్దేహ మాజిఁ బడఁగ
నింద్రు ధ్వజమట్లు పరిఘయు నిలను బడియె
దూషణుం డంత నేలపైఁ గూలి చచ్చె
దంతములు విఱిగి పడిన దంతి వోలె. 288

అట్లు పడిన దూషణుఁ జూచి యఖిలప్రాణు
లపుడు మేలు మేలని కొల్చి యర్చ చేయ
నింతలో క్రుద్ధులై సేన కెదురు పఱచు
మూవు రసురు లడ్డిరి రాము, చావు మూడ. 289

వ. ఆముప్పురు రాక్షసులలో మహాకపాలుఁడు విపులమై శూలమును, స్థూలాక్షుఁడు పట్టిసమును ప్రమాధి పరశువును తీసికొని రామునిపైఁ బడవచ్చుచుండ రాముఁడు చూచి వెంటనే వాడి బాణములచే అతిధులనుబోలె వారి నెదుర్కొని, మహాకపాలుని శిరస్సును భేధించెను. అసంఖ్యాకమైన బాణ ప్రవాహములచే ప్రమాధిని వధించుటయు అతఁడు మహావృక్షమువోలె క్రిందఁ బడెను. స్థూలాక్షుని కన్నులను తీక్ష్ణమైన బాణములతో నింపెను. ఇట్లురాముడు దూషణుని ననుచరులు అయిదువేవురను కోపించి. బాణౌఘముల చేయుము నింటికిఁ బంపెను.

అపుడు దూషణుఁడు హతుఁ డగుట చూచి అతని యనుచరు లగు సేనాధ్యక్షులను జూచి రాముని బైకిఁబంపి యిట్లనెను. "ఓరాక్షసులారా। ఈ ఈ దూషణుఁడు తన యనుచరులతో పాటు యుద్ధమున హతుఁ డయ్యెను. మీరీకుత్సిత మనుష్యునితో ఈ మహాసేన గైకొని యుద్ధము చేసి చంపుఁడు

అని ఖరుఁడు తాను రామునిపై బడపరువెత్తెను మఱియు శ్యేనగామి పృథుగ్రీవుఁడు యజ్ఞశత్రువు కాలకర్మకుఁడు, మేఘమాలి మహామాలి సర్పాస్యుఁడు రుధిరాశనుఁడు అను పన్నెండుగురు సైన్యాధిపతులు తమ సైనికులతో శరములు విడచుచు రాముని పైపై నడచిరి. అపు డాతేజస్వి యగు రాముఁడు తీవ్రమైన బాణములచే హతశేష మగు నాసైన్యమును ఎదుర్కొనెను. అపు డారాముని బంగారు పిడిగల బాణములు పొగగల నిప్పులవలె పడి వజ్రములు మహావృక్షములను పడఁగొట్టినట్లు నూఱుగురు రాక్షసులను నూఱుసాయకముల చేతను వేవురు రాక్షసులను వేయిబాణములచేతను గొట్టెను. 390

రాముబాణాలు కవచముల్ నగలఁ జీల్చి
విండ్ల విఱిచి నఱికి నెత్తురి నెడలి తడుప
నేలఁ బడిన రాక్షసుల కేశాలు చెదర
పృథ్వి కుశల నిండిన యజ్ఞవేది యయ్యె. 391

ఇట్టు త్రుటిలోనఁ గానన మెల్ల నరక
మయ్యె రక్తమాంసాలచే నలఁదఁ బడియె
ఇట్టు లొకనరుచే భీమవృత్తి కలుగు
పదియు నాల్గువేవు రసురుల్ ప్రహతు లైరి, 392

ఇఁక మహారథుండు ఖరుండు నొక త్రిశిరుఁడు
మిగిలి; రరిదమనుఁడు రాముఁ డొగను మిగిలె
ఇట్టు లందఱు హతులౌట నెంచి ఖరుఁడు
పడియె రాముపైఁ బిడుగెత్తు వజ్రివోలె. 393

రాముపై పు యుద్ధమున కాగ్రహము మెఱయు
వెడలు ఖరుఁ జూచి యాసైన్య విభుఁడు త్రిశరుఁ
డనియె "విక్రాంత ! నను యుద్ధమునకుఁ బంపు
మరలు, రాముఁ జంపెద నిదె యరయు మిపుడె. 394

ఇదె ప్రతిజ్ఞ చేయుదు సత్య మిదిగొ కత్తి
బట్టి రాముఁ జంపెద రాక్షస భద్రమునకు
అతని కేనొ యాతఁడు నాకొ యగుత మృత్యు
వాజి నుండి మర్లి క్షణంబ సాక్షి వగుము. 295

హతుఁడై రాముఁడు నేలఁ గూల నుద మింపారన్ జనస్థానపున్
క్షితికిఁ బోయెదు గాని, నే హతుఁడనై నేలన్ బడన్ రామునిన్
హతమార్పన్ జను", మంచు మృత్యునెడ మోహం బంది పల్కెన్. ఖరుం
డతి వీరుండటులే యనంగ త్రిశిరుం డంతన్ బడెన్ రాముపై. 296

త్రిశిరుం డట్టుల రాముపైఁ బడి హయోద్దీప్తంపు తేరెక్కి తా
నసమోగ్రాజిఁ ద్రిశృంగ శైలమటు బాణాసార సంఘంబులన్
ప్రసరింపించుచు మబ్బటుల్ కురిసి యార్ద్రం బైన పెన్ భేరి య
ట్లు శుభంబౌ ధ్వని చేయుచున్ దరియఁగా నారాముఁ డత్యుగ్రుఁడై.
297

ధనువుం గైకొని వాఁడియౌ శరములంతన్ వేసె నాయిర్వురున్
ఘనఘోరం బగు పోరు చేసి రిటు సింగం బేన్గు లట్టుల్; మొగం
బున నమ్ముల్ త్రిశరుండు వేయ వడి నప్డున్ రాముఁడున్ క్రుద్ధుడై
యనె నిట్టుల్ దితిజోగ్రు డీత్రిశిరుతో నార్భాట మేపారఁగన్. 298

అవురా! విక్రమ శూరుడౌ నసురు వీర్యం బిద్దియా మేమి యీ
యవి వక్త్రంబున వేసి నట్టివి సుమాలా లేక బాణంబులా
యివె నాచాపమునుండి వచ్చు శరముల్ వీక్షింపు మంచున్ భుజం
గ విధంబౌ పదునాల్గుటమ్ములను వేగన్ గొట్టె తద్వక్షమున్. 299

నాలుగు శరాల వాని గుఱ్ఱాలఁ గొట్టి
చతురుఁడౌ రాముఁ డెన్మిది సాయకముల
సూతుఁ గొట్టి రథమునుండి క్షోణిఁ గూల్చి
యొక్క బాణాన ధ్వజమును నూడఁగొట్టె. 400

వ. అటు విగత సారథి హయుండయి రథమునుండి ఎగురు త్రిశిరుని హృదయమును బాణములచే భిన్నము చేసి, మూఁడు వాడి బాణములచే మూఁడు శిరస్సులను పడఁగొట్టి ఆశిరస్సులు రక్తముఁ జిమ్ముచు నేలఁబడ ఆత్రిశిరుండును నేలపయి పడఁగా పరువెత్తి శరణు గోరు నారాక్షసులు పెద్ద పులికి భయపడు లేళ్ళవలె పర్విడుచుండ వారి నందఱను ఖరుఁ డాపి చంద్రుని పైకిఁబోవు రాహువువలె రాముని పయి విఱుచుకు పడెను. 401

త్రిశిరుతో పాటు దూషణు డసువు లుడిగి
చావఁగ రాము బలమెంచి జడిసె ఖరుఁడు
సైచరాని రాక్షస సేన సకల మిట్టె
హతులయిరి యొక్క రాముని యస్త్రములనె. 402

అని ఖరుం డెంచి హతమైన తన బలంబు
నరసియు నముచి యింద్రుని నట్లెదుర్ప
చాపమెత్తి బాణము లయిదు సర్పము లటు
లేసి తన నేర్పు చూపె తేరెక్కి మిగుల. 403

అపు డది గని సుహారథుఁ డైన రాముఁ
డా మహా కార్ముకమును నన్ని దిశలు
విదిశలను నొక్క పర్యాయ మెదను దలచి
బాణములతోడఁ బూరించెఁ బ్రబలుఁ డగుచు. 404

రాముఁడు సహింపరాని శరాలతోడ
తొరగ నెఱసుల యగ్నులతోడఁ బోలె
జలదమటు వర్షములతోడ వలెను నపుడు
ఆకసము వివరము లేని యట్లు చేసె. 405

ఖరుఁడు రాముఁడు నటుఁ బరస్పరము వేయు
వాడి యైనట్టి శరముల వలన నపుడు
అన్ని వైపులు బాణంబు లావరింప
ఆకసం బాకసము లేని దయ్యె నపుడు. 406

ఒకరి నొకరు చంపదలంచి యుద్ధాన వేసినట్టి
బాణ వర్షాల లోపల భానుండు వెలుఁగఁ డపుడు
తీవ్ర నాళీక నా రాచదీప్త వికర్ణి శరము
లేసి ఖరుఁడు రాముని గొట్టె నేన్గు నంకుశము నటుల. 407

ధనుసు పూని రథమున సిద్ధముగ నున్న
ఖరుని పాశహస్తు యమున ట్లరసె జగము
సకల సైన్య హంతకుఁ బౌరుషాఢ్యు రాము
పృథుల సత్త్వు నలసిన ట్లెంచె ఖరుఁడు. 408

సింగంబట్టుల విక్రమించి ఖరుఁడున్ సింగంబటుల్ సంచరిం
పంగా రాముఁడు చూచి, క్షుద్రమృగమున్ బంచాస్యమట్లెంచె, సం
తంగాంతిన్ వెదజల్లు సూర్యునెటొ గెంటంజాల్ రథంబెక్కి వే
గం గోపంబున రామవహ్ని మిడతై క్రమ్మెన్ ఖరుండయ్యెడన్.
409

పిదపన్ బాణముదీసి శీఘ్రముగ గుప్పింటన్ నిబంధించు రా
ము ధనుస్సున్ కరలాఘవాన నతఁడున్ మోపెట్టి ఖండించి యిం
క ధనుస్సందిడి యేడు బాణములు వేగన్ సూర్యునింబోలి రా
ముఁ దనుత్రాణముగొట్టు నాకవచమున్ మూడై పడెన్ నేలపై. 410

శరముల్ వేల్ కురిపించి యప్రతిమ తేజస్సొప్పు రామున్ వడిన్
ఖరుఁడున్ నొవ్వఁగఁజేసి యుద్ధమున సింగంబట్లు గర్జింప, న
త్తఱి సర్వాంగములందు బాణముల దెబ్బన్ నెత్తురు చిమ్మంగ సం
గరసీమన్ బొగలేని యగ్ని యటు బిగ్గన్ వెల్గె రాముండొగిన్. 411

కడు నల్కన్ రిపుహంత రాముఁడపుడే గంభీర నిర్హ్రాదమై
జడదారిచ్చిన వైష్ణవంబును మహాచాపంబు వేరొండు నె
వ్వడిమైఁ గైకొని శత్రుమారణ మొనర్పంగా ఖరుండున్న య
య్యెడకుం బర్విడి స్వర్ణబాణముల కండించెన్ ధ్వజంబున్ వడిన్. 412

ప. అప్పుడా బంగారు ధ్వజము చెల్లాచెదురుగాఁబడి దేవతలయాజ్ఞచేఁ బడమిఁబడిన సూర్యునివలె దర్శనీయమయ్యెను. పిదప కరుడు నాలుగు బాణములు వేసి మర్మజ్ఞుఁడు తోమరములచేత ఏనుంగునుబలె సర్వగాత్రములందు రామునికి బాధకూర్చెను. అనంతరము కరుడు ప్రయోగించిన నాలుగు బాణములచేఁ గొట్టఁబడి రాముఁడు నెత్తురుచే తడపఁబడి కోపగించి గురిచూచి ఆరు బాణములను వేసెను. ఒకటి శిరస్సును. రెండు బాహులపైని అర్ధచంద్రుని వంటి మూఁడు బాణములనువేసి కొట్టెను. అట్లుకొట్టి మరియు ఒక బాణముచే రథయుగమును, నాలుగు శరములచే నాలుగు గుఱ్ఱములను ఆరవదానిచే రథ సారథి శిరస్సును మూడిటిచే యుగాధార కాష్ఠమును, రెండిటిచే యిరుసును పండ్రెండవ బాణముచే కరుని సశర ధనుస్సును భేదించి వజ్రమువంటి పద మూడవ శరముచే ఖరుని కొట్టెను. ఇట్లు కరుడు ధనుస్సును, రథమును గుఱ్ఱములను సారథిని గోల్పోయి గద ధరించి ఎగిరి భూమియందు నిలుచుండెను. అట్టి మహారథుడగు రాము కర్మచూచి దేవతలు, మహర్షులు ప్రాంజలులై విమానాగ్రమునందుండి పూజించిరి. 413

విరథుండై ఖరుఁడున్ గదన్ గొని రణోర్విన్ నిల్వ రాముం డటన్
పరుషోక్తిన్ మృదుపూర్వమైన యటులన్ వాక్రుచ్చె నోయీ కరా
కరు లశ్వాలు రథాల్ గలిగి యుగ్రంబై బలంబుండ సం
గరమం దేచితి క్రూరమై సకల లోకాలసహ్యమౌ కర్మలన్. 414

అనయం బన్నిటి గష్టపెట్టుచు కలుండై యుండి పాపంపుఁ గ
ర్మను గావించెడు వాఁడు మూఁడుజగముల్ పాలించువాడయ్యు ని
ల్వను జాలండు, జగద్విరుద్ధ మగు కర్మల్ చేయు క్రూరాత్మునిన్
జనమెల్లన్ గుటిలోరగంబును బలెన్ జంపింతు రక్రాంతమున్. 415

కడులోకుల్ మది నేదొ లోభముననో కామానకున్ లొంగియో
చెడు కర్మల్ పొనరించుచుంటి మనుచున్ జింతింపకే భ్రష్టులై
వడఁగండ్లన్ నలికళ్ళపాముపలెనే ధ్వంసంబ యై పోదు రి
య్యెడ ధర్మాత్ములఁ జంపి మౌనుల ఫలంబే మొందెదో నీ వహో 416

పాపపుఁ గర్మ చేసి నటువంటి దురాత్ములు లోక నింద్యు లె
న్నో పెను సంపదల్ గనియు నొందెదరు శ్రేయసు నెండు చెట్లటుల్
పాపఫలంబు పొందెదరు పండిన కాలమునందె మాత్ర మె
న్నో పువులన్ ఋతు క్రమము నొందిన యప్పుడె యెల్లచెట్లటుల్. 417

ఇలలోనఁ బాప కర్మకు
ఫలము లచిరకాలంబులోనె ప్రాప్తించుఁ జుమీ
తెలియుము రాక్షస! విషముల్
గలసిన యన్నములు తిన్న ప్రాణుల కటులన్. 418

దారుణ పాపము చేసిన
వారల, లోకాప్రియంబు వాంఛించెడి యా
వారల ప్రాణము తీయగ
నో రాక్షస! నేను వచ్చియుంటిని గనుమీ. 419

పసిడి భూషణంబులు గల బాణము లివి
నేను వేయ నీదేహమున్ జీలుచుకొని
పాములను పుట్టలోనుండి వలెను వచ్చి
నేలపైని బడఁగలవు నీవు చూడు. 420

నేను నిను జంప దండక కాననమున
నీవు చంపి తినిన ధర్మ నిరతులైన
సంయముల నిప్పుడే నీవు చచ్చిపోయి
సఖిలసేనతో పాటుగ సనుసరింతు. 421

మున్ను నీవు చంపిన యట్టి మునిజనంబు
నాశరాలఁ జంపబడియు నరకమందు
గ్రాలు నిను విమానములెక్కి కాంౘతు కొట్టు
నడుపు ఛాటిపండటు తలపడగ గూల్తు. 422

—: ఖరరామ యుద్ధము :—

అని రాముండు వచింప రక్తనయనుండై క్రోధ సమ్మోహుడై
యనియెన్ నవ్వి ఖరుండు పామరుల, దైత్యశ్రేణులన్ జంపు మా
త్రన నీయంతట నీవు నిన్నిటుల నశ్లాఘ్యున్ గడున్ శ్లాఘ్యుఁగా
ననుకొన్నా విటు విక్రమాంచితులో నిన్నావంతయేన్ మెత్తురే. 423

వ. విక్రమము గలిగి బలవంతులైన నరశ్రేష్ఠులు తమ తేజస్సుచే గర్వితులై ఏమిఁగను తమ్ము గురించి చెప్పుకొనరు. రామ! నీవు నిన్ను పొగడు కొనునట్లు నేర్పరులు కాని పామరు లిట్లు తమ్ము పొగడి కొందురు అనవసరముగా నెవరు తమకులము గొప్పను జెప్పుకొనుచు మరణసమయము రాఁగా తమతమ వంశమును చెప్పుకొందురు. బంగారమువలె తోచుని త్తడితుషాగ్నిలో తప్తమై తన తక్కువ తనమును చూపు నట్లు నీవు నిన్ను పొగడికొని తేలిక తనమును ప్రదర్శించుకొంటివి. గదను ధరించి నేను కంపింప రాక గైరికాది ధాతువులచేత చిత్రితమై యున్న ధరాధరమైన పర్వతమువలె నుండుటనునీవు చూచుట లేదు. పాశమును దాల్చిన యంతకునివలె నేను గదను దాల్చి నిన్నే కాదు మూఁడు లోకములను గూడ చంపగలను. నేనును చాల చెప్ప వలసి యున్నది. కాని నేను చెప్పను. సూర్యుఁ డస్తమించుచున్నాడు. విఘ్నము కలుగును. నీవు పదునాలుగు వేవురు రాక్షసులను జంపితివి. నిన్ను జంపి వారి కళ్ళ నీళ్ళు తుడిచి పైచెదను" అని ఖరుఁడు చెప్పి బంగారు కడియము కల యీగదను ఖరుఁడు రామునిపైని విసరెను. అపుడాగద నిప్పులు గ్రక్కుచు దారిలోని చెట్లను పొదలను బూడిద చేయుచు రాముని సమీపము

నకు వచ్చెను. అట్లు ఆకాశము నుండి వచ్చుచున్న మృత్యుపాశమువలెనున్న యాగదను చూచి రాముఁడు బాణములచే ముక్కముక్కలుగాఁ జేసెను. అవ్వి డది మంత్రౌషధి బలములచేఁ బడఁ గొట్టబడి త్రాచుపామువలె బాణములచేఁ గొట్టఁబడి యాగద నేలపై పడి పోయెను. 424

చిఱునవ్వుల్ తులకింప ధర్మరతుఁడౌ శ్రీరాముఁ డాటోపముల్
వఱలంగన్ ఖరుజూచి యిట్లనె" నిదా త్వద్వీర్య సర్వస్వమున్
ఖర! నావల్లనె శక్తి శూన్యుఁడవుగా నై పోతి, వ్యర్థంబుగా
నుఱకే గర్జనచేతు నీగద యిదే యుర్వింబడెన్ జూడుమీ. 425

మఱి ప్రగల్భాలు కొట్టి నమ్మకము కలుగ
"రాక్షసులకంటి లోని నీళ్ళను కరంబు
తుడిచి వైచెద నంటి" వానుడులు నిపుడ
యేమి మయ్యె నీమాట లనృతమె యయ్యె. 426

అనృతాచారివి క్షుద్రశీలుఁడవు నీచాత్ముండ! నీప్రాణముల్
గనుమీ నేన హరించెదన్ సుధ గరుత్మంతుడు వోలెన్ భవ
ద్ఘస కంఠంబును నేనిటన్ నరుక వేగన్ ఫేనముల్ చిమ్ము వె
చ్చని రక్తంబును ధారి తలము స్వేచ్ఛన్ త్రాగుగాతన్ వడిన్. 427

ఒడల బూది పూసికొని బాహువులు రెండు
చాపి దుర్లభాంగనఁ బోలె క్షమను గౌఁగి
లించి రాక్షస పాంశన! యీవు గాఢ
నిద్ర చెంద దండకలు శరణిచ్చుఁ బ్రజకు. 428

సరె జనస్థానమిది హితస్థాన మగుచు
నీకు నాశరాలనుకాఁగ నిర్భయులయి
వనము నందంతటను మునిగణము లెల్ల
ఇంక ముందు నెప్పుడు సంచరింపఁ గలరు. 429

ఇంక రాక్షస భామిను లిపుడు కనుల
నీళ్ళు కాఱఁగ దీనలై యెల్ల హితులు
మృతి గనగ భీతిఁ బొందియు నితర భయము
కలుగఁ బోయెద రిదండకలు త్యజించి. 430

భర్త, వీవిట్టివాఁడవై వఱలు చుండ
నీకు ననురూపపత్నులు వృథగ బ్రదుకు
పోవ, శోక రసంబులు పూర్తి కాఁగ
తెలిసి యనుభవించుచు నేడ్తు రిలను కూలి. 431

నీచ! క్షుద్రబుద్ధి! నృశంస! నిత్య విప్ర
కంటక! యెవుడు వత్తువో గద యటంచు
నిను గురించిన శంకతో మునులు తాము
అగ్నిలో హవిస్సుల వ్రేల్తు రనవరతము. 432

అని గంభీరతఁ బల్కు రాము వచనం బాలించి రోషంబుతో
వనె గర్జించి ఖరుం డపశ్యమును గర్వాంధుండవై భీతికిన్
అనువౌ చోటున నిర్భయుండ వయి వాచ్యావాచ్యముల్ చూడకే
యనుచున్నా విటు; మృత్యుపాశవశమై యాలోచింప వేమాత్రమున్. 433

ఆకాల పాశ వశులై
ఈ కార్యాకార్యము లెవౌ యీక్షింపకయే
లోకులు నింద్రియ వశులై
లోకంబునఁ జేయుచుంద్రు రోషమునఁ బనుల్. 434

అని వాక్రుచ్చి రుండు రామునికి నడ్డౌచున్ విజృంభించుచున్
కనుబొమ్మల్ ముడి పెట్టి దగ్గఱగనే కన్పించు సాలంబు పెం
డని ప్రేక్ష్యడఁగఁ బీకి యంత వడిగన్ తా పెంపి క్రోధంబునన్
ముని పంటన్ గడుగట్టిగా కొఱికి రామున్ గొట్టచెట్టెత్తియున్. 435

—: ఖరుని మృతి :—

అటులన్ గొట్టుచు నార్చి చచ్చితివిరా యంచున్ వచింపన్ హుటా
హుటిమై వచ్చెడి చెట్టు నంపగమితో నూటాడి ఛేదించి వేగన్ ఖరున్
మటుమాయం బొనరింపఁ బూని చెమటల్ మైపర్వ రాముండటన్
బటు రోషంబున నెత్తిఁ బాఱు కనులన్ బాణాలఁ గొట్టెన్ఖరున్. 436

వ. అపు డారాముని బాణమధ్య నుండి నురుగుతోఁ గూడిన రక్తము, ప్రస్రవణ గిరినుండి జలధారవలె స్రవించెను. యుద్ధమున రాముని బాణముల చేత ఖరుఁడు విహ్వలుఁడుగాఁ జేయబడి నెత్తుటి వాసనచేత మత్తుఁడై రాముని పై పె పరువెత్తెను. అపుడు. 437

ఒడలది నెత్తుటం దడియ నుస్నటులుండి చటుక్కునన్ బయిన్
బడివడి వచ్చు నాఖరుని పట్టి వధింపఁగ విక్రమంబుతో
నడు గటు వెన్క సర్దుకొని యంతనె నిల్చియు బ్రహ్మదండమే
వడునన నింద్రదత్తమయి వహ్నిని బోలు శరంబు తీసియున్. 438

వడి సంధించియు మంటలే యెగయు అవజ్రాయుధ ధ్వాన మే
ర్పడ వక్షంబున వేసి యంతకు సితారణ్యంబునం దుగ్ర రు
ద్రుఁడు వోలెన్ బలు నింద్రుఁ డట్లు సముచిన్ దుర్వార వజ్రం బటుల్
పడి వృత్రున్ సురరాజువోలె సడరన్ వ్రాలెన్ ఖరుం డుర్విపై. 439

వ. అపుడు రాజర్షులును మహర్షులును అందఱు కలసి వచ్చి రాముని గౌరవించి ప్రహర్షముతో నిట్లనిరి. ఓ దశరథాత్మజా! ఇందుకొఱకే పాకశాసనుఁ డగు నింద్రుఁడు పావన మైన శరభంగా శ్రమమునకు వచ్చెను. ఇందుకొఱకే యుపాయముచేత మహర్షులు నిన్ను ఇటకు రప్పించిరి. పాపకర్ము లగు రాక్షసుల వధయే యిపుడు మేము తలచిన కార్యము. అది నీ వొనరించితివి. ఇంక మహర్షులు సుఖముగా ధర్మముగా దండకారణ్యమున చరింతురు" అని యామహర్షులు చెప్పు నంతలో దేవతలు చారణులతోఁ గలిసి వచ్చిరి. దుందు

భులు ప్రోగించిరి. అంతట పుష్పవర్షము రామునిపైని ఆశ్చర్యముగాఁ గురిపించిరి. అర్ధము కంటె నెక్కుడైన ముహూర్తములోనే మూడుగంటలలోనే రాముఁడు వాడి బాణములచే భయంకర కర్ములగు పదునాలుగువేవురు రాక్షసులను జంపెను. ఖరదూషణాది ముఖ్యులును చంపఁబడిరి. ఔరా! యేమి విదితాత్ముండగు రాముని మహాకర్మ మహావిష్ణువునకుఁ బోలె చూడగా ఎంతటి ఘనము. ఎంతటి దక్షత" అని ప్రశంసించి దేవులందఱు వచ్చినట్లు వెడలి పోయిరి. ఇంతలో లక్ష్మణుఁడు సీతను వెంటఁ బెట్టుకొని గిరి గుహను వెడలి హాయిగా ఆశ్రమమునకు వచ్చెను. అపుడు విజయియైన రాముఁడు మహర్షులు పూజింప లక్ష్మణుండు కొలువ ఆశ్రమము ప్రవేశించెను. అపుడు శత్రుహంతకుఁడును, మహర్షులకు సుకముగలిగించినవాఁడు నగు భర్తను వైదేహికౌగిలించుకొనెను. రాక్షసు లట్లు చావఁగా నే బాధయు లేకుండు రాముఁడు వచ్చుటయు జూచి శశిప్రభానన యగు జానకి ప్రహృష్టలైన మహర్షులచే గౌరవింపఁబడు రాముని మరలఁ గౌఁగిలించుకొనెను. 440

అపు డకంపనుం డనియెడి యసురుఁ డొకఁడు
ఉలికి పడి జనస్థాన మందుండి వెడలి
జంకి కంగారుపడుచును లంకకేగి
రావణునితోడఁ జెప్పె సంభ్రమము మీఱ. 441

ఆ జనస్థానమం దున్న యసురు లెంతొ
మంది చంపబడిరి యుద్ధమందు ఖరుఁడు
చంపఁబడియెను; నెట్టులో చావ కుండి
బ ముటఁబడి యిచ్చుటకు నేను వచ్చినాఁడ. 442

అని యకంపనుఁడు వచింప నాలకించి
క్రుద్ధుఁడై యెఱ్ఱఁబడిన కన్గొనలతోడ
కంటితోఁ దగులఁ బెట్టఁ గలుగువాఁడు
వలె, నకంపనుతోడుతఁ బలికె నిట్లు, 443

ప్రాణముల యాశ వదలిన వాఁడెనండు
నారుచిర జన స్థానమున్ హత మొనర్చె
ఎవఁడు సర్వలోకములందు మెసఁగి యుండి
కాలగతిని నిప్పుడు పొందఁగాఁ గలండు, 444

స్వర్గ పతిగాని యల్లవై శ్రవుఁడుగాని
యముఁడుగాని మహావిష్ణువైనఁ గాని
నాకు నప్రియ మొనరించి లోకమందు
సుకముగా నుండఁ జాలరు సుమ్మి తెలియు. 445

యమునికిఁ గూడ నే యముండ నగ్నిని గూడ దహించివైతు వ
చ్చు మృతికిఁ గూడ మృత్యువను సూర్యుని దేజసుచేతఁ గాల్తు వా
తము వడి నడ్డగింతు నని తద్దశవక్త్రుఁడు రావణుండు ను
గ్రముగ వచింపఁ గన్గొని యకంపనుఁ డంతవణంకి పోవుచున్. 446

అభయ హస్త మీయఁగఁ గోర నభయ హస్త
మాదశాశనుఁ డీయఁగ హడలు మాని
స్తిమిత పడి యకంపనుఁ డంత తెప్పరిల్లి
రావణుని తోడ నపుడు నీలాగు . 447

రాముఁ డనువాఁడు దశరథరాజ సుతుఁడు,
గలడు, సింహగాత్రుఁడు వృషస్కంధుఁ డతఁడు
తిరిగిన పొడుగు బాహువుల్ వఱలు వాఁడు
వీరు డతుల విక్రముఁడును పృథు యశుండు. 448

వీరు డతడు శ్రీమంతుడై వెలయుచుండి
మన జనస్థాన మంతను దునిమి వైచె
దూషణుని తోడ ఖరుఁ గూడ దునిమె ననుచు
నొగి ననఁగ రావణుఁ డహి యట్లూర్చె యనియె. 449

ఎల్ల సురల తోడను నాసురేంద్రు తోడ
తరలె నేమి రాముఁడు జనస్థానమునకు
చెప్పు మన నకంపనుఁడు వచించె నిట్లు
వెస మహాత్ముఁడౌ రాముని విక్రమమును. 450

రాముఁడౌ యతితేజుఁడు ధనుర్ధర వరుండు
ఆజిలో నింద్రసముఁడు దివ్యాస్త్ర యుతుఁడు
అతనికి తగిన తమ్ముఁడు నరుణ నేత్రుఁ
డిందు ముఖుండు లక్ష్మణుఁడు వాఁ డిద్ధబలుఁడు. 451

అగ్నికిని గాలి మిగులఁ దోడైన యట్లు
అనుజుడును తోడు రా రాము డధిక బలుఁడు
శ్రీయుతుఁడు జనస్థానముఁ జెల్ల చెదరు
చేసి నాశంబు గావించె శీఘ్రముగనె. 452

అది మహాత్ములౌ సురల కృత్యంబు గాదు
ఇందులో విచారణయుఁ గావింపవలదు
రాముఁ డేయు పైఁడి పిడి శరాల సురుల
సింహములయి పాములయి భక్షించివైచె. 453

ఎట కెటకు రాక్షసులు భీతి నెంతొ పడలి
పరువు లిడుదురో యందందె స్వాగ్రమందు
రాముఁ డున్నట్లె చూచువారలు మహాత్మ!
ఇటు జనస్థానమును రాముఁ డేచి కూల్చె.

అని యకంపనుఁ డనఁగ రావణుఁడు పలికె
ఇదె జనస్థానమేగెద నిట్టె రాముఁ
లక్ష్మణుని తోడఁ జంపెద రయముగానె
అన నకంపనుఁ డనియె రావణుని తోడ. 455

వినుము ప్రభు! రాము పౌరుషమును బలంబు
జరిగినది జరిగిన యట్లు సరిగ వినుతు
క్రుద్ధుఁడగు రాముఁడౌ యసాధ్యుఁ డిద్ధయుశుడు
విక్రమంబున సర్వము నాక్రమించు. 456

వఱఁదల్ వచ్చియుఁ బొంగి పొర్లెడి నదిన్ బాణాలచే నాపు, నం
బర మం దొప్పెడి తారకా గ్రహములున్ మాయన్ భువిం గూల్చుఁ జె
చ్చెర నీటంబడి మున్గు భూమినయినం జేచేతఁ బైకెత్తు సా
గరవేలన్ బడగొట్టి లోకములు మున్గం జేయునాతం డిటన్. 457

జలధిన్ గాలిని వేగమాపును శరాసారంబు కుర్పించియున్.
బల శౌర్యంబుల లోకముల్ దునిమియున్ బౌరాళి సృష్టించెడున్
కలనన్ రాముని నెట్టులున్ గెలువ శక్యం బెమిగా దాదురా
త్ములు స్వర్గంబును గెల్వలేనటుల దైత్యుల్ గెల్వలే రాతనిన్. 458

విను రామున్ సురలైన దైత్యులయినన్ వీర్యంబుచేఁ గెల్వలే
రనుకొందున్; మఱి వానిఁ జంపెడి యుపాయుం బేను వాక్రుత్తు శ్ర
ద్ధను నాలింపుము సీతనాఁగ నొక కాంతారత్న మొప్పున్ దదం
గనతో లోకమునందు సాటి యెచటన్ గన్గోము సూ రావణా. 459

పరువంబొందిన యౌవనంబు గలదై బాగొప్పు నంగంబులున్
సరిగాఁ బంచఁగ బడ్డవై తనరు నాచార్వంగికిన్ సాటి కి
న్నరిగానీ సురకాంత లేన్ దనుజకాంతల్ గాని చెన్నారు న
చ్చర గానీ తనరార, రింకను మనుష్యస్త్రీ లెటుల్ సాటియౌ. 460

వనిలో రాముని మోసగించి వడిఁ దత్పత్నిన్ హరింపందగున్
వనితన్ గొల్చెడి కామి రాముఁడును స్వప్రాణాలు వర్జించుఁగా
యని యాతం డన రావణుం డతని వాక్యంబుల్ మదిన్ నచ్చ న
ట్లనె భావించి యకంపనున్ బలికె నీలాగప్పు డీవాక్యముల్. 461

సరె రేపే యిటనుండి యొంటరిగ నే చల్లంగ నాసూతుఁడే
అరుదేఱన్ జని సీత నాపురికి నెయ్యన్ నొత్తుగా జుమ్ముంచు కం
చరగాడ్డెల్ గల తెల్లనౌ రథముపై సర్వప్రదేశంబులున్
మెఱయంగన్ దివిఁ దారకాపథమునన్ శీతాంశు వట్టుల్ చనెన్. 462

మరి దైత్యేశుఁడు తాటకాతనయుఁడౌ మారీచు నయ్యాశ్రమం
బరయుంగాఁ జని, భక్ష్య భోజ్యములచే మారీచుచే నర్చనల్
కరముం బొందియుఁ గూరుచుండ నట నర్ఘ్యం బిచ్చి సేవించి య
త్తఱి మారీచుఁడు రావణాసురుని కర్థప్రాప్తిగా నిటన్. 463

ఎల్ల లోకంబులకు క్షేమమే గదయ్య
యసురనాథ! నాకాశంక యగుచు నుండె
ఉన్నటుల నుండి వడి రాఁగ నౌదవె నేదొ
యనుచు ననుకొందు నెఱుఁగుదు నధిప వర్య! 464

ఇటుల మారీచుఁడు వచింప నిద్ధతేజుఁ
డసురపతి వాక్యకోవిదుండనియె నిట్లు
"సులువుగఁ బని చేసెడి రామువలన నాదు
రాక్షస జగంబు నాయన! ప్రహతమయ్యె. 465

చంపరాని సకల జనస్థానమిట్టి
యుద్ధమునఁ గూల్చఁబడె, నిట్టులున్న నాకు
నతని భార్యాపహరణ కార్యమును సరిగ
చూచు మంత్రివగు మన మారీచుడనియె. 466

ఎవ డాసీతనుగూర్చి చెప్పె సఖుఁడన్ శ్రేష్ఠాఖ్యతో నున్న శ
త్రువె యాతండు నినుంగనుంగొనుచు సంతోషించగా లేని జీ
వి వినింద్యాత్ముఁడు, సీతఁ దీసికొని రాఁ బ్రేరేచు వాఁడెవ్వఁ డా
యవివేకుస్ వడి, దెల్పు, మాయఖిలదైత్యాంగార మెవ్వం డొకో! 465

నిను బ్రోత్సాహము పెట్టువాఁ డరియె, సందేహంబు లే దిందు నే
మనుదున్. నీదుకరాన సర్పవదనం బం దున్న పెన్గోర ని
ట్లనె పీకించుచునుండె వాఁ డెవనివల్లన్ చెడ్డదౌ బాట ని
ట్లను నిల్పంబడి, తేఁడు హాయిగఁ బరుండన్ నీతలన్ గొట్టె రా. 468

విమల ఘనవంశ మనెడి తొండమున మీఱి
హ స్తముల దంతములు, తేజ మనెడు మదము
గలుగు రాముఁ డనెడి గంధగజముతోడ
యుద్ధ మొనరింపఁ జూడ నయు క్త మయ్యె, 469

ప్రహరణాంత సుస్థితి సంధి వాల మొప్పి
చతుర మగురాక్షసమృగాళిఁ జంపఁ గలిగి
అసుగాంగ పూర్ణుఁడయి తీవ్రాసి దంష్ట్రి
నేపుగల యీనృసింహమున్ లేపఁ దగదు. 470

విండ్లను మొసళ్ళు, బాహుల వేగ పంక,
మమ్ము కెరటాల్, రణప్రవాహములు మీరి
యుగ్ర రామపాతాల ముఖాగ్రమందు
తిరిగి పడఁగ యు క్తము గాదు దితిజ రాజ! 471

అసుర రాజ! ప్రసన్నుఁడవై గ్రహింపు
లంక కరిగి లంకేశ! హర్షంబు గనుము
నీదుసతులతో విహరింపు నిరత మెలమి
ఇంతితో రాముఁడును విహరించు వనుల. 472

అనుచు మారీచుఁడు పచింప నాలకించి
రావణుఁడు లంక కపుడు శీఘ్రముగ నేగి
తనదు నుత్తమ గృహమును త్వరగఁ జొచ్చి
యటనె యుండెను. నేమియు నసుకొనకయె. 473

తనకళ్ళ ముందె యిట్టి ప
దునాల్గు వేవు రసురులను దుర్జయు ఖరు దూ
షణు త్రిశిరసు నొకరాముఁడె
తునుముట శూర్పణఖ యంత తూర్ణమ కనియున్. 474

జలదమ్మటు, లురుముచు, న
ట్టుల నెవ్వరును సలుపని కఠోరపుఁ గర్మం
బులు రాముఁడు చేయఁగని మ
రలి రావణుఁ డేలు నట్టి లంకకుఁ జనియెన్. 475

## —: రావణు వర్ణన :—

సౌధాగ్ర భాగాన సచివులతో తేజ
మెసఁగి, సురలతోడి యింద్రుఁ బోలి
పసిఁడి వేదిని మండు పావకుఁ డటు, సూర్యు
మీరు నాసనమునఁ గూరుచుండి
వాయి తెఱచు యమున్ బలె, మహాత్ములు దేవ
కిన్నరఋషులకుఁ గెలువరాని
దేవాసుర రణాన దీప్త వజ్రైరావ
త క్షత వక్షో వ్రణోక్షితాంగు

ఇర్వది భుజాల రావణు నింపు గుల్కు
ను త్తరీయము గలవాని, నుజ్వలాంగు
కనక కుండలు, వైడూర్య కాంత గాత్రు
సుభుజు శుక్లదంతు మహాస్యుఁ జూచె నామె. 476

విష్ణు చక్రాదిచే వేల దెబ్బలు దేవ
రణమునఁ దినురాజలక్షణాఢ్యుఁ
డురువక్షుఁడు నమరాయుధముల వ్రణములు
తగ దృఢాంగములచే దనరువాఁడు
అక్షోభ్య జలధులునను క్షోభ పెట్టుచు
గిరుల నెగురవైచు క్షిప్ర కరుఁడు
సురల మర్దించుచు వరధర్మములవీడి
పరభార్యలను బల్మిఁ బట్టువాఁడు

అఖిల దివ్యాస్త్రధరుఁడు యజ్ఞాంతకరుఁడు
చొచ్చి భోగవతీపురి వాసుకుని గెల్చి
తక్షకుని భార్య హరియించి తనరువాఁడు
అట్టిఘనుఁ డైనవాఁడు దశాస్యుఁ డతఁడు. 477

త్వరగఁ గైలాసాద్రి నరవాహనుఁ గుబేరు
నణఁచి పుష్పక విమానము హరించె
చైత్ర రథవనంబు సరస నళినిని నం
దనముఖోపవనాల నణఁచి కూల్చె
తపియించి యుదయించు తపనుని చంద్రుని
శైలశృంగమటు హస్తాల నడ్డె
పదివేల యేండులు వనిని దపసుచేసి
మును స్వయంభువుఁ దలల నిడి గొలిచె

నరుని వల్లను దక్క నేసుర పిశాచ
పతగ గంధర్వ నాగాది భయము గొనఁడు
ద్విజులచే మంత్రములచే స్తుతింపఁబడియె
హవిసు లర్పింప సోమమున్ హరణచేయు. 478

అస్వతంత్రులై తన దేశ మరయు నట్టి
నృపులు- గిరు లబ్ధిని వలెదీపింప రెపుడు
ఆత్మవిదు లైన దేవ సిద్ధాసురాళు
లెదురుకొన రాజవయి యేలు దెట్లుచపల ! 480

మూఢచిత్తుండవు బుద్ధిహీనుండవు
క్షేయమెఱుంగవు క్షితిపుఁ డవుదె
చారులు నయము కోశమ్ము స్వాధీనముల్
కాని రాజులు మూఢు లైనవారు
దవ్వునఁ గల యనర్థముల చారులవల్లఁ
గని దీర్ఘ చక్షు లై దనరు చుంద్రు
ఆజనస్థానమునందుఁ జచ్చిన వారి
నెఱుఁగవు మంత్రుల వలలికూడ

రాముఁ డొకఁడె దూషణ ఖర ప్రభృతు లైన
పదియు నాల్గువేవురు దైత్యవరులఁ జంపి
ఋషుల కభయంబు నిడి యింక నెల్లదండ
కాటవికి క్షేమ మొనరించె నయ్య వినుము. 481

వ. సులువుగఁ గార్యములు నెఱవేర్చు రామునిచేత ఆజనస్థానమంతయు ధర్షిత మైనది. రావణా ! నీవు లుబ్ధుఁడవు ప్రమత్తుఁడవు పరాధీనుఁడవు. నీ దేశమునఁ గలిగిన భయము నెఱుఁగ కుంటివి. తీక్ష్ణుఁడై యల్పదాతయై ప్రమత్తుఁడయి గర్వితుడై శఠుడైన రాజును వ్యసనములో సర్వభూతములు రక్షింపఁ బూనవు. అతిమానియై సుజనులచే గ్రహింపఁ బడక తన్ను దాను గౌరవించుకొను క్రోధనుడైన నరపతిని వ్యసనములలో స్వజనులుకూడఁ జంపెదరు. కార్యములాచరింపక భయస్థానములందు భయపడక త్వరగా రాజ్యము నుండి చ్యుతుఁడైన దీనుఁడు గడ్డిపరకతో సమాను డగును. ఎండిన కట్టెలు బెడ్డలు దుమ్ముకూడ పనికివచ్చును గాని స్థానభ్రష్టులు రాజు లెందుకును పనికిరారు.

వాడిన వస్త్రము నలిగిన పూలదండలువలె రాజ్యభ్రష్టుఁడైన వాఁడు సమర్థుఁడైనను వ్యర్థుఁడె యగును. పొరపాటుపడక సర్వమునెఱిఁగి యింద్రియముల వశమం దుంచుకొని కృతజ్ఞుఁడై ధర్మశీలుఁడైన రాజు చిరకాలము నిలుచును. కన్నులు మూసికొని నిద్రించినను నీతినేత్రముచే చూచుచు సమయమువచ్చినపుడు క్రోధప్రసాదములు వ్యక్తపఱచువాఁడు జనులచేఁ బూజింపఁబడును. రావణా ! నీవు దుర్బుద్ధివి. ఈయుత్తమ గుణములు లేని వాఁడవు. ఈ రాక్షసుల మహాపథను చారులవల్లఁ దెలిసికొనవైతివి. శత్రులం దుదాసీనుఁడై విషయ సక్తుఁ డయి దేశకాల విభాగముల తత్త్వ మెఱుఁగక గుణదోష నిశ్చయమున యుక్త బుద్ధికాక విపన్నరాజ్యుఁ డగువాఁడు త్వరలో విపత్తు పొందును." అని యిట్లు శూర్పణఖ చెప్పిన స్వదోషములను బుద్ధితో నాలోచించి ధనముతోడను దర్పముతోడను బలముతోడను గూడిన ఆరావణుఁడు చిరకాలము చింతించి అట్లు క్రోధముతో పరుషముగాఁ బలుకు శూర్పణఖను జూచి అమాత్యుల మధ్య మిక్కిలి కోపముతో నిట్లు అడిగెను. 482

రాముఁ డెవండె యాతని బలం బెది యెట్టుల నుండు విక్రమం
బేమిటి యాతఁ డెవ్వరును నెట్లును చేరఁగ రాని దండకన్
ఏమని చొచ్చె దూషణుని నీఖరు నీత్రిశిరున్ వధించు నా
రాముని శస్త్ర మేది రుచిరాంగి ! విరూపగ నేరు చేసిరే. 483

అని దైత్యేంద్రుఁడు ప్రశ్న చేయ నలుకన్ వ్యామోహముం బొందిరా
ముని వృత్తాంతము నెల్ల శూర్పణఖ సంపూర్ణం బెఱింగింప ని
ట్లనియెన్ "రాముఁడు దీర్ఘబాహువు విశాలాక్షుండు కందర్పుఁడో
యన నొప్పారును అతఁడో దశరథ క్ష్మాధీశు పుత్రుం డగున్. 448

మృగపుఁ జర్మ వల్కలములు మేనఁ దాల్చి
పడి విలు వంటిదై పైడి వలయు మొప్పు
వింటి నెక్కిడి పాములవంటి విషము
వరలు వాడియౌ బాణముల్ కురియు నతఁడు. 485

అట్టి వరాస్య నీకు సతియౌ నటు చేసియుఁ దేఁగఁ బూనఁ దా
నిట్టులు క్రూరలక్ష్మణుఁడె యీడ్చి విరూపగ నన్నుఁ జేసె నీ
వట్టి సమగ్రచంద్రముఖి నారసి కాముశరాల బారియై
యిట్టె వశంబు కాఁగలవ యెంచుము దీనిని నోమహాభుజా ! 492

ఆమెను భార్యఁ జేసికొను నాశయ మిప్పడ నీకె యున్నచో
ఈసురు ముహూర్తమందునె జయింపఁగ నీకుడికాలు పెట్టు నీ
వేమియు శంకఁ బూన కొనరింపుము నాదగుమాట; రావణా!
రాముని వాని తమ్ము నబలత్వము నీబల మెంచి పూనుమీ. 493

రాముఁ డొక్కఁడ యవక్ర శరాలు వేసి
ఆజన స్థానమందున్న యసురతతుల
ఖరుని దూషణుఁ జంపెను నెఱుఁగు మోయి
దానికిఁ బ్రతిక్రియయుఁ జేయఁ దగుదు వయ్య. 494

ఒడలు ఝల్లన మెయిఁ బుల్క లొదవఁజేయు
శూర్పణఖనుడుల్ రావణాసురుఁడు వినియె
సచివుల యనుమతిం గొని సలుపఁదగిన
దెఱిఁగి గుణదోష చర్చ గావించి యపుడు. 495

ఇట్లు గావింపవలె నని యేర్పరించి
సరిగ స్థిరబుద్ధియై యానశాల కరిగి
గూఢముగ దైత్యపతి సూతుఁ గూడి యంత
రథము పూన్పు మటంచు పల్కంగ నతఁడు. 496

క్షణములో రత్నభూషిత కనక రథము
పైడి మువ్వలును పిశాచ వదనము లగు
ఖరములను గట్టి నడుప మేఘ స్వనంబు
గల రథంబుపై జలధి కడకుఁ జనియె. 497

ధవళ చ్ఛత్రము శ్వేతచామరము లందాలీన వైడూర్య క
చ్ఛవియై బంగరు కుండలంబు లమరన్ చారూత్తరీయంబునన్
దివిజ ద్వేషి మునిఘ్నుఁ డీర్వది భుజాల్ దీపించు నారావణుం
డవనీధ్రేశుఁడువోలె రాజిలెఁ గరం బాటోప మేపారఁగన్. 498

కామచరం బగు రథమును
ఆమెయి నెక్కి దనుజేంద్రుఁ డపుడు వెలింగెన్
ఆమింట బలాకలు తగ
శ్యామల మేఘము మెఱుపుల నమరియుఁబోలెన్. 499

వివిధ పుష్ప ఫలాల వృక్షాలు వేల కొ
    లఁది గల భూముల రమ్య మగుచు
చల్లని శుభమైన జల మొప్పు తమ్మికొ
    లఁకులు వేది సహితాశ్రమము లమరి
నారికేళ కదళీ సాల తాల తమాల
    ఘన వృక్షములఁ జుట్టుకొనఁగ బడియు
అతి నియతాహారు లగు వేల ఋషి నాగ
    గంధర్వ కిన్నరుల్ కలిగి యుండ

బ్రహ్మసుతులు వైఖానసుల్ వాలఖిల్యు
లామరీచిపులు జితేంద్రి యాది సిద్ధ
చారణులు మీర మిక్కిలి చారు వగుచు
నలరు వార్ధి భూభాగంబు నరిగె నతఁడు. 500

అది దివ్య మాల్య భూషాకారలౌ కేళి
    రస లచ్చరల సుందరాలయంబు
శ్రీమతులౌ దేవతామణులకు శ్రీకి
    దాన వామృత భోజి తతికి గృహము

నిషాదదేశమును జంపి మహామునులను మృత్యువునుండి విడిపించి యెక్కువ సంతోషము పొందెను. ఆ సంతోషముతో రెట్టింపైన పరాక్రమముతో అమృతమును తీసికొని రా బుద్ధి గలవాఁడై యినుప గొలుసులను ద్రెంపి మహేంద్ర భవనమునఁ దాచఁబడిన యమృత భాండమును దెచ్చెనో ఆ మఱ్ఱి వృక్షము మేఘమువలె వ్యాపించియుండెను.

దానిని రావణుడు దారిలోఁ జూచుచు నదీపతి సముద్రుని యవతలి యొడ్డున కేగి యట నేకాంతముగా రమ్య మగు వనమధ్య ఒక యాశ్రమమును చూచెను. 503

అటను లేడిచర్మము పూని జటలు దాల్చి
నారబట్ట లూని నియతాహారుఁ డైన
అసురు మారీచుఁ గన నాతఁ డసుర పతిని
కల యమానుష కామాలఁ గొలిచి యనియె. 504

రాజ! లంకలోపలఁ గుశలంబ కాదె
ఎందుకై త్వరగా వచ్చి తిటకు మరల
అన మహాతేజుఁ డైనట్టి దైత్య విభుడు
వాక్య చతురుఁ డీరీతిగఁ బలికె నపుడు. 505

వత్స! మారీచ! నేఁ జెప్పు పలుకు వినుము
ఆర్తుఁడను నేను గతివి నాకార్తునకును
ఎఱుఁగుదువు జనస్థానాన ఖరుని దమ్ము
ప్రకటభుజుని దూషణుని శూర్పణఖఁ జెల్లి. 506

పిశితభోజిని తేజస్విఁ ద్రిశరు నెఱుగు
దన్యరాక్షసుల్ పోర నాయాజ్ఞచేత
ధర్మ చరులైన మునుల బాధలకు లోను
చేసి యడవిలో నెపుడు వసింత్రుగాదె. 507

శూరుఁడవు సర్వమాయా విశారదుఁడవు
కడు సుపాయజ్ఞుఁడ విటు నీకడకు నేను
వచ్చితిని, సాయమునకు నాపలుకు వినుము
సంశయింపక యిటు వచ్చి సాయ మగుమిఁ. 5

బంగరు లేఁడివై రజత వర్ణపుఁ జుక్కలు మేనఁదాల్చి వే
గం గని రాము నాశ్రమము క్రచ్చఱ సీతకు నందునట్టిటుల్
చెంగున గంతులేయు నిను సీత గనుంగొని లేడివైన ని
న్నుం గనితెమ్మటంచును అనున్ మఱి పంపును రాము లక్ష్మణున్.

పిదప వారిద్దఱును లేని వేళ నేను
సుకముగా నడ్డు లేకుండ సోమకళను
రాహు వటు-సీత హరియింతు రాము డింక
బెంగ స్రుక్కిపోఁ బ్రహరింతు వేగ రాము.

వ. అని రాముని గుఱించిన కథలు రావణుఁడు చెప్పగా విన్న
మహాత్ముఁడైన మారీచుని మొగము నెత్తురు చుక్కయైనలేక యెండిపోయె
అంత భయపడిపోయి యెండిన పెదవులు తడుపుకొనుచు ఱెప్పపాటు లేనివి
నున్న కండ్లతో ఆర్తుఁడయి మృతప్రాయుడయిన వాడువలె రావణ
మొగముపైకి చూచి భయపడిన మనసుతో రాముని పరాక్రమ మెఱిఁగిన
డయి కృతాంజలియై అతనికిని తనకును అహితము గోరుచునిట్లు సరియ
సంగతిని వాక్యవిశారదుఁడగు మారీచుడు చెప్పెను.

అనయము ప్రియముగఁ బల్కెడి
మనుజులు సులువుగ లభింత్రు మహిలో రాజా!
మనమున కప్రియము హితము
వినిచెడి వారు వినువారు వెదకిన నరుదే.

స్థిరబుద్ధి లేని వాఁడవు
నిరత మనుచిత వర్తనుఁడవు నిజముగ రాముస్
స్థిరవీర్యుని గుణయుక్తుని
వరుణేంద్రోపము నెఱుఁగవు వసుధాస్థలిలో. 518

భూమి నఖిల రాక్షసులకు
క్షేమం బగుటన్నది యిక స్థిరమగునే నిన్
రాముండే క్రుద్ధుండయి
యామహిని నరాక్షస మొనరింపఁడు గాతన్. 519

నీచావు కోసమై నిజముగ సీతయె
పృథివిలోపలఁ బుట్టలేదు గదవె
సీతా నిమిత్తమై భూతలి నాకును
కష్టంబు నిప్పుడు కలుగదు కద
అడ్డులేకుండఁ గామాత్ముఁడవౌ నీవ
లన సరాక్షస లంక యుఱఁగదు గద
నీవంటి కామియు నిర్గుణ దుశ్శీలి
పాపి రాష్ట్రముఁ దన్ను మాపఁడుగద.

అతఁడొ తండ్రి గెంటినవాడె యసలె కాఁడు
ఎటులు మర్యాద లేని వాడెందుఁ గాఁడు
కనఁగ లోభి దుశ్శీలుఁడు గానివాఁడు
అతఁడు కాఁ డెన్నడును క్షత్రియాధముండు 520

## —: మారీచుఁడు రావణునికి హితము చెప్పుట :—

తాను ధర్మగుణాలు లేనివాఁడును గాఁడు
కౌసల్య కానందకారి యతఁడు
కర్కశుండును గాఁడు కల భూతముల కెందు
అహితంబు కోరువా డసలె కాఁడు
కైకేయి వంచింపఁ గని పితన్ సత్యాత్ముఁ
జేయ ధర్మాత్ముఁడై చేరె వనికి
పితకును గైకకు ప్రియము కామము గూర్ప
రాజ్యభోగాల్ వీడి ప్రాలె వనుల.

రాముఁడో దారుణుండు కర్కశుఁడు గాఁడు
ఎఱుక గలవాఁడె కాఁ డజితేంద్రియుండు
ఈతఁ డనృతమాడుట యాలకింప మెపుడు
అందుచేత నీవిటు చెప్ప ననుచితంబు. 521

ఈమెయిఁ దాల్చిన ధర్మమె
రాముఁడు, సాధువు నతని బలము సత్యంబే
రాముఁడు జగములపతి సు
త్రాముండు సమస్త దేవతలకుం బోలెన్. 522

తనతేజసుచేఁ గాచికొ
నిన యాతని సీత బల్మి నీవు హరింపన్
మనమునఁ దలఁచుచు నుంటివి
యినుని ప్రభనుబోలె సంశయింపక యిపుడే. 523

శరములయర్చిసు గలిగి, యె
దురు కొనరాని వగు ధనుసు దూసిన యసియన్
చిఱు కట్టెల రామాగ్నిని
దరికొలిపిన దానిఁ జొరకు ధనుజాధీశా ! 524

రాజ్యము సుఖంబు ప్రాణముల్ వదలి పెట్టి
ధను సనెడి తెఱచిన నోరు దసరియున్న
వైరి సైన్యాల ప్రహరించు వీరుడైన
రామయముని సమీపింపరాదు సుమ్ము. 525

జానకి రాము తేజము సైపరాదు
రామ చాపాశ్రిత హరింప రాదు నీకు
సింహవక్షుని ననుసరించెడి లతాంగి
అతని ప్రాణాలకంటె బ్రియంబు సుమ్ము. 526

మండు నగ్నిహోత్రములోని మంటఁ బోలె
అట్టి తేజస్వి సతి సీత నంటరాదు
ఎందు కీవృథాశ్రమను గావింతు వీవు
ఆజి నిన్నతఁడు గని నీయంతు చూచు. 527

ఇట్టి జీవము సుకము రాజ్య మెందు నరుదు
ధర్మపరులౌ విభీషణా ద్యమల మంత్రి
వరుల సంప్రదించి నీదు బలము రాము
శక్తిని హితాహిత గుణ దోషముల నెఱుఁగు. 528

కోసలాధిప సుతునితోఁ గూడి రణము
సలుపుటది మేలు కాదని తలపు మయ్య
మఱియు నాయుక్తమోక్తి క్షమంబ యుక్త
మైనదియు నాలకింపుమి యసుర రాజ ! 529

నేనొకపుడు వేయి యేనుగుల బలంబు
వఱల నేపున భువిఁ దిరుగుచుండి

అద్రి తుల్యుఁడను నీలాభ్రసముఁడనై
మేలి బంగారు కుండలాలు దాల్చి

లోకంబునకు భీతి పుట్టఁ గిరీటినై
పరిఘఁ దాలిచి ఋషివరులఁ దినుచు

దండకారణ్యాలనుండి స్వైరంబుగ
సంచారములు నేను సలుపుచుండ

ధర్మపరుఁడు విశ్వామిత్ర పరమమౌని
నావలన భీతిలి దశరథావనీశుఁ
గోరె నేఁబర్వమున శ్రద్ధ మీర రాముఁ
డింక మారీచునుండి రక్షించుగాక". 530

అని కోరన్ వరధర్ముఁడౌ దశరథుం డాలించి యాశ్రేష్ఠ మౌ
నిని వీక్షించి వచించె "నాసుతుఁడు * పంద్రెండేళ్ళ వాడింక న
స్త్ర నిదానంబును లేనివాఁడె, ఘనమౌ సైన్యంబుతో నేను వ
త్తును గొంపోవుము, దైత్యులన్ దునిమి ప్రోతున్ నీదు యజ్ఞంబన్.
532

* అయోధ్యలో విశ్వామిత్రునితో రాముఁడు ఊన షోడశ వయస్సు గలవాడని దశరథు డనెను. ఇపుడు రాముఁడు పంద్రెండేళ్ళవాఁడు అని చెప్పెను. రాముఁడు చిన్నతనములోనే తన్నుఁ గెల్చె నిక నిప్పు డాతడుచాల ఘనుఁ డని తెలుపుటకై యని తెలియునది. బాలకాండలోని ఊడ షోడశ పదునాఱేండ్లు నిండనివాఁ డనఁగా పంద్రెండేళ్ళుగల వాఁడని దీనిబట్టి తెలియునది. చూ. పీఠిక.

—: మారీచుఁడు రాముని ఘనతఁ జెప్పుట :—

వర ధాత్రీశుని వాక్కు లంత విని విశ్వామిత్రుఁ డీలా గనెన్
సురలన్ బ్రోచిన మాట సత్యమె కడున్ క్షోణీశ! ముల్లోకమం
దరయన్ ఖ్యాతుండ వీవె బహుసైన్యం బుండనీ, రాఘవే
తరు లారాక్షసుఁ జంపజాలరు సుమీ తామెంతవారేనియున్. 532

రాముఁడు బాలుఁ డయ్యును వరౌజసుఁ డాతఁడె వానిఁ జంపు సు
స్థేమము గల్గువాఁ డతనిఁ జెచ్చెరఁ గైకొని పోదు నీకిఁకన్
క్షేమము గల్గుఁగాక యని చెప్పి ప్రియంబున స్వాశ్రమానకున్
రాముని వెంటఁ దీసికొని రంజిలి యేగెను మౌని యంతటన్ 533

అవలన్ దండకలోన యజ్ఞమును జేయన్దీక్షితుండైన మౌ
నివరేణ్యుం భజియింపఁ జేరి ధనువున్ జిత్రంబ సారించి మ
ధ్యవయశ్చిహ్నలుసుంత గన్పడని పద్మాక్షుండు రాముండు పి
న్న వటుం డొక్కటె వస్త్రమున్ శిఖను స్వర్ణంపున్ స్రజం బూనియున్.
534

తన తేజస్సున దండకాటవిని దీప్తంబౌనటుల్ చేయుచున్
వినువీధి న్నుదయించు లేశశియటుల్ వేగంబ యేతేర మే
ఘ నిభుండన్ వరకుండలుండ బలిమిన్ గర్వించి నే నప్పుడున్
ఘనమైనట్టి వరాలఁ గ్రొవ్వి యట శీఘ్రంబ యేతెంచితిన్. 535

అతఁ డావేళ ననుం గనుంగొనిధనుస్సం దమ్ము(దు-అమ్ము)నెక్కించినే
నితఁడో బాలుఁడె యేమి చేయు నని యెంతే మోహముం జెంది క్రొ
వ్వి తపోరాశి సుయజ్ఞవేదికకుఁ బర్వెత్తంగ నభ్రాంతుడై
శిత బాణం బొక టేసి కొట్టె జలధిన్ నేఁగూల నూఱామడల్. 536

అతఁడో నన్ వధియింప నెంచకయె యట్లంభోధిలోనన్ బడన్
శిత బాణంబునఁ గొట్టనేనును స్మృతిన్ జేఁదప్పి యెట్లో తుదిన్
స్మృతియుం గాంచియు లంకఁ జేరితిని నిట్టే చిన్నవా డయ్యు నా
మతిపోఁ గొట్టి సహాయులన్ దునిమెః రామాఖ్యన్ స్మృతిం దేకుమీ. 537

ఏ నిటు లడ్డగించినను నేమి గణింపక రాముతో ననిన్
మానవ యేని ఘోరపు టనర్థమునే కొనితెచ్చు కొందు హృ
ష్టాననులై సుఖించి విహరించి సమాజ పుటుత్సవాలలో
మేనులు మర్చు రాక్షసుల మేలునశించు ననర్థమే యగున్. 538

పలుసౌధంబుల సౌఖ్య సీమలగు పల్ప్రాసాద సంఘాలతో
లలితంబై బహురత్న భూషితమయౌ లంకాపుర మ్మొక్క మై
థిలికై నష్టమ యౌటఁ జూతు శుచి లింతేన్ జేయుకే పాపమున్
ఖల సంపర్కముచే నశించెదరు మీ*ల్ నాగ గ్రహదానన్ బలెన్. 539

నగలు దాల్చుకొని గంధాలు పూసికొను రా
క్షసులు నీతప్పుచేఁ జావఁగనెదు
సతులు గల్గియు సుతుల్ హృతలుకాఁగా దిక్కు
చనఁ జావ మిగులు రాక్షసులఁ గనెదు.
ప్రాసాద హర్మ్యాలు లంకలోఁ గాలిపోఁ
బురి నేల మట్టమై పోవఁ జూతు
పతులు నాప్తులు పోవ బారువ నేడ్చు దై
త్యసతుల యార్తనాదాల వినెదు 540

---

* సర్పములున్నవని రాజులచే నియోగింపబడిన పల్లెవారు పాములఁబట్టు కొనుదురు. పాముల సంపర్కముచే చేపలును జచ్చినట్లు రాక్షసులు చచ్చెదరని భావము.

అన్య భార్యల సంస్పర్శకంటె గొప్ప
పాప మింకేది లేదు విశ్వంబునందు
వేలకొలఁది భార్యలు భవనాలఁ గలరు
స్వీయ దార సుఖివయి రక్షింపు గులము. 541

మానము సమృద్ధి రాజ్య మాత్మ ప్రియంబు
జీవితము సౌమ్య భార్యల స్నేహితాళి
చిర మనుభవింపు నీవు వాంఛింతు వేని
రామునికి నప్రియము నొనర్పంగఁ బోకు. 542

ధృఢ సుహృదుఁడ నగు నేనిటు
కడు వారించినను సీతఁ గాంక్షింతువ యేన్
చెడి బలము, రాము శరముల
నడఁగి సబంధువుగఁ గనెదు యముని పురంబున్. 543

ఎటొ రణమున రామునిచే
నిటులు విడిచి పెట్టఁ బడుట నిటు నచ్చితిఁ జూ
ఇట నింకను నెది జరగెనొ
యిటు లోకోత్తరపు వృత్త మిదిగో వినుమీ. 544

అటులన్ నన్నొనరించిన
నెటులును వైరాగ్య మొంద కేనోయపుడున్
పటుమృగరూపము గొను ను
త్కట రాక్షసు లిరువురఁ గొని దండకఁ జనితిన్. 545

నాలుక మెఱయఁగ కోరలు
వాలుగఁ దగ గొప్పమేను వఱలఁగ బలిసై
వీలగు మాంసము తినుచును
నోలిఁ జరించితిని దండకోగ్రాటవిలో. 546

## —: మారీచుడు తన పూర్వకథ దెలుపుట :—

భువి నగ్నిహోత్రములలోఁ
పవిత్ర తీర్థంబులందు వరచైతన్యములం
గవిసిన తరువులఁ గ్రూరత
మివులన్ ఋషివరుల నాక్రమించి చరింతున్. 547

వర ధార్మికు లగుతపసుల
త్వరగఁ దునిమి తద్రుధిరము దండకవనిలో
నిరతము త్రావుచు వారల
వరమాంసమ్ములఁ దినుచును వర్తిలినాడన్. 548

ముని మాంసములను దినుచును
వనమందలి వారి నెల్ల భయపెట్టుచునేఁ
అనయము రుధిరమున మదము
గని ధర్మము దూషణంబు కడు గావింతున్. 549

నియతాహారుఁడు ధార్మికుఁ
డయి వ్రతియయి యఖిల హితాచరణుండై
ప్రియుడగు రాము నతి పవి
త్రయయిన సీతను నతిరథు లక్ష్మణుఁ గనుచున్. 550

ఈతఁడు తపసి యని యెఱిఁగి
ప్రాతపగ ప్రహారముల తలఁచి చంపుటకై
ఆతని నిరసించుచు మృగ
రీతి నెదురుకొంటి జడత శృంగంబులతో. 551

ధర యోగ్యులు ధర్మాత్ములు
పరదోషమున నణఁగుదురు బాంధవ యుతులై
ఎఱుగుము నీదోషముచే
విఱుగుమఁ ద్వమచితము చేయు విసను త్వదుక్తిన్. 558

రాముండు మహాతేజుఁడు
రాముఁడు ఘనసత్త్వ యుతుఁడు ప్రథిత బలుండున్
రాముఁడు రాక్షస జగముల
కేమియు నంతకుఁడుగాక యొసఁగెడిఁ గాతన్. 559

ఖరుడును శూర్పణఖకునై
యరిగి జనస్థానమునకు హాని యొనర్పన్
నిరతమ్ము కష్టపెట్టని
నరుఁ డగురాముఁ డెది దాటె నయముగఁ జెపుమీ. 560

ఇటు బంధు హితార్థమ్ముగ
నిటఁ జెప్పెడి నాదు వాక్కు లిఁక వినవేనిన్
పటురాము బాణములచే
కటః కూలుదువు బంధు గణములతోడన్. 561

ఇటు మారీచునిచేతన్
స్ఫుటముగఁ దగఁ జెప్పబడిన సూక్తుల నతడున్
ఎటులును ప్రతిగ్రహింపఁడు
కటు వగు నౌషధము మర్త్తు కానుఁడు వోలెన్. 562

హితమును పథ్యముఁ జెప్పిన
హితుఁ డగు మారీచుతోడ మృతి చోదితుఁడై
దితిజేంద్రుఁడు పరుషపుఁ బ
ధృతితోడ నయుక్తవాక్య తటుకునఁ జెప్పెన్. 563

## బంగారులేడివై సాయముచేయుమని రావణుడు
## మారీచుని కోరుట

అవు మారీచ ! యయుక్తమౌ నుడుల నాకాచెప్ప చున్నావుగా
చవుడౌ నేలను పాతుగింజవలె నీసందేశ మెల్లన్ వృథా
అవివేకుండగు రాముతో రణము నేనందున్ విశేషించి మా
నవ దుశ్శీలుని తోడి సంగరము నేమానన్ మాన ముమ్మాటికిన్. 564

ఎతఁడు రాజ్యమున్ సుహృదులఁ బితను తల్లి
పదలి పామర స్త్రీవాక్కుఁ బట్టి వనికి
వెడలి ఖరుఁ జంపె నాతని ప్రియను సీత
నీయెదుట నెత్తుకొని పోయి నెగడువాఁడ. 565

ఇదియు నానిశ్చితపు బుద్ధి హృదిని గలదు
దాని మారీచ ! యింద్రుతోఁ దరలి సురలు
రాక్షసులు గూడ నేమి మరల్పలేరు
నీయెదుట సీత హరియించి నెగడువాఁడ.

ఏది చేసిన దోషమొ ఏది గుణమొ
ఎది యుపాయమగు నుపాయమేది యగునొ
ఈవిషయమున తుది నిశ్చయింప వలసి
అడిగి నప్పుడు దీనిని నుడువ వలయు. 567

అడుగఁబడి బుధుఁ డగు నమా
త్యుఁడు నంజలి పట్టి- తనకు నుర్వీపతికిన్
వడి శుభము కోరి- మృదువును
కడు హితము తగునటు ప్రియముగాఁ జెప్పవలెన్. 568

ఇతరుల యొత్తిడి గల నుడి
హితమని చెప్పంగఁ బడును నిట మారీచా!
మతిలో గౌరవహీను
న్మతి గౌరవవంతుఁడు నభినందించుఁడుగా. 569

అమితౌజసు గల రాజులు
విమలాగ్నిని వేడి, యింద్రు వీర్యము, శశి సౌ
మ్యము, వరుణు దండము, ప్రసా
దము యమునిది దాల్చి గాన ధరణిపు లర్చ్యుల్. 570

నీవో ధర్మం బెఱుఁగక
కేవల మిటు మోహమొంది కెలకెద వేలా
ఈవిధి వచ్చిన నన్నున్
నీవో దుష్టతఁ బరుషము నిందింతువురా. 571

ఏది చేసిన దోషమో యేది గుణమొ
ఏది నాకర్హమైనదో యిపుడు నిన్ను
అడుగుటయె లేదు సుమ్మియో యమితవీర్య!
నిన్ను నేనడుగున దిది విన్నఁ జెపుదు. 572

వ. సీతను అపహరించెడి యీకార్యములో నాకు నీవు సాయము చేయుము. 73

బంగరు లేడిపై రజతవర్ణపుఁ జుక్కలు మేనఁ దాల్చి వే
గం గని రాము నాశ్రమము, గ్రచ్చఱ సీతదరిన్ జరించి యా
మెం గడు లోభపెట్టు మిక మీఁదట మాయలలేడిఁ గాంచియున్
బంగరులేడి యంచు మది నమ్మియు తెమ్మని పంపు రామునిన్. 574

వ. అపుడు రాముని దూరముగాఁ దీసికొనిపోయి హాసీతా! హాలక్ష్మణా! అని పలుకుము. అపుడు రాముని స్థితిని విని సీత ప్రేరేపఁగా స్నేహముచేఁ గంగారుపడి లక్ష్మణుఁడు కూడ రాముని అనుసరించును. అపుడు నేను స్వేచ్ఛగా నింద్రుడు శచినిబోలె సీతను హరింతును. పిదప నీవు స్వేచ్ఛగా వెడలి పొమ్ము. ఓ సువ్రతా! మారీచ! ఇందుకునేను నారాజ్యములో సగ మిచ్చెదను. ఈకార్యసిద్ధికై నీవు ఈశుభ కార్యము చేయుము. నేను రథముతో దండకావనమునకు నిన్ను అనుసరింతును. నేను యుద్ధము చేయకుండనే సీతను పొంది రాముని వంచించి లంక చేరుదును. ఇట్లు నేను నీచే కృతకృత్యుఁడ నవుదును. అట్లుగాక నీవిది చేయనందువా ఇపుడే నిన్ను జంపి వేయుదును. ఇట్లు నీవు నీకిష్టము లేకపోయినను బలత్కారముగనైనను చేయుదువు. రాజును వ్యతిరేకించు వాఁడు సుకముగా వర్ధిల్ల లేఁడు. ఇట్టి జీవిత సంశయము వచ్చినపుడు నాకు విరోధించితివా నీకు మృత్యువు తప్పదు కనుక దీనిని సరిగా బుద్ధిచే గ్రహించి నీకేది మంచిదో అదే చేయుము. 575

ఇట్లు రావణుచేత శాసింపఁబడుచు
నపుడు రాజట్లు మారీచు డసురపతిని
గాంచి నిశ్శంకత వ్యతిరేకముగఁ బలికె
పరుషవాక్యము, భయ మేమి పడయ కుండ. 576

సుత రాష్ట్ర మంత్రి సహితముగ నశియింప
నేపాపి యిటుల బోధించె నీకు
హాయిగ నీవుండ నలర కెవ్వఁడు మృత్యు
నాస్యము చొఱ నుపాయంబు చెప్పె
బలవంతు నెదిరించి భ్రష్టమౌ నినుఁ జూడ
నేహీన రిపు దైత్యు లిష్టపడిరి

స్వాపరాధముచేత క్షయ మొందగా నీకు నే
హీను డిటు లుపదేశించె నిపుడు

కాపథమునఁ బోయెడి నిన్ను నాపకున్న
సచివులను జంపఁదగుఁ గాని చంపవైతి
కామమునఁ గాపథము పట్టు క్ష్మాపు యోగ్య
మంత్రు లాపనౌ ఆవని మంత్రులేల. 577

స్వామి యనుగ్రహ మొందిన
యామంత్రులు సంతతంబు యశ మర్థంబున్
కామము ధర్మము రావణ!
యీమహిలోఁ బొందు చుందు రెఱుఁగుమి నీవున్. 578

స్వామి విరుద్ధులై యగుచో
నామంత్రుల సర్వ మింక వ్యర్థమ్మ యగున్
భూమిని గలిగిన జనములు
వేమరు కష్టాలఁ గాంత్రు వివిధత మఱియున్. 579

రాజ మూలంబు ధర్మము రాక్షసేంద్ర!
జయమునకుఁ గూడ రాజులె సాధనంబు
కనుక నన్ని యవస్థలందును కరంబు
రాజులే ప్రోవఁదగు వారు రాక్షసేశ. 580

న. ఓనిశాచర! క్రూరుఁడును స్వప్రకృతులకుఁ ప్రతికూలుఁడును వినయము లేని,వాఁడు నగు రాజు రాజ్యంబు చేయు శక్తుడుకాడు. శీఘ్రముగాఁ బరువెత్తు గుఱ్ఱములు మందుఁడైన సారథిచేఁ దోలఁబడి విషమ స్థలమున భంగము పొందినట్లు తీవ్రమైన మంత్రోపాయములు గల సచివులు ప్రతికూలుఁడైన రాజుచే భగ్ను లవుదురు ధర్మ మనుష్టించు సాధువులు చాలామంది

అని మారీచుం డన రా
వణుఁ డీవాక్యంబుచేత పరమానందం
బును గని కౌఁగిటఁ జేరుచు
కొని మారీచుని, నిటు లనె కొనియాడి తగన్. 585

సరె మంచిది నేఁజెప్పిన
కరణి సలుపు నీదుబలము కడుయుక్తం, బి
త్తఱి మారీచుఁడవై తిది
వఱలోఁ గేవలము దైత్య పద మాత్రుఁడవే. 586

మణి భూషల్ మెరయన్ బిశాచ ముఖ రమ్యంబౌ ఖరాల్పూన్చియుం
డిన యాస్యందన మెక్కుమావయి వడిన్ నీవింక నందేగి సీ
తను వ్యామోహము పెట్టి స్వేచ్ఛఁ జనుమీ తర్వాత శూన్యాన నా
మెను బల్మిన్ గొనిపోదు నంచు బలికెన్ బెంపార దైత్యేశుడున్. 587

నతి మారీచుఁడు, రావణుండును విమానం బట్టు తేరెక్కి యా
తతమౌ నాశ్రమ వాటినుండి చని యాదారిన్ పురంబుల్ వనీ
క్షితులన్ శైలములన్ నదుల్ నగరముల్ గ్రేవన్ గనుంగొంచు వృ
క్షతతిన్ నిండిన దండకావనము వేగన్ జేరి రాయిర్వురున్. 588

అవలన్ బంగరుభూష లొప్పిన రథంబందుండి తాడగ్గి యా
భువి మారీచుని గేలఁ బట్టుకొని యప్పున్ బల్కె నారావణుం,
డవిగో నాశ్రమభూము లందె కదళీప్రాంతంబు రామాశ్రమం
బు వలెన్ దోఁచెడి; వచ్చి యెంచిన పనిన్ బూర్ణంబుగావింపుమీ. 589

ఆమారీచుఁడు రావణుం డనిన వాక్కాలించి బంగారు లే
డై మాయన్ గొని రాము నాశ్రమపు బాహ్యద్వారమున్ జేరియున్
వేమా టిట్టటు సంచరింపఁ దొడగెన్ వింతైన రూపంబుతో
గామాయా మృగరూప సంపద కడున్ వ్యామోహ పర్చెన్ వనిన్. 590

ఇంద్ర నీలాల్ వంటి శృంగాలఁ దనరాటి
సిత మసితము ముఖాకృతి యొసంగ
ఎఱుపుఁ దామర కల్వకరణి నింపగు మోము
శ్యామమణ్యుత్పల * శ్రవములలర
సుంత యెత్తగు మెడ సొంపులఁ జెలువొంది
హరి నీల దళ సమాధరము మీఱ
కుందేందు వజ్రాభ సుందరోదర మొప్పి
** మధు కాబ్జ కింజల్క మహిత పార్శ్వ

మొప్ప, వైడూర్య తుల్య ఖురోజ్జ్వల మయి
సన్ననౌ పిక్కలఁ గలసి సౌరులీన
శక్రధను వటు లూర్ధ్వపుచ్ఛంబు దనర
కడు మణుల లేడియయ్యె రాక్షసుఁడు త్రుటిని. 591

రమ్యమౌ రాము నాశ్రమపథము వేగఁ
జెలువారు రూపుచే వెలుఁగఁ జేసి
జేగురు రంగులఁ జిత్రమౌ రూపాల
సీత లోభ పడఁ బచ్చికలఁ దిరిగి
వెండి చుక్కల నూర్లఁ బ్రియదర్శనం బౌచు
చిరుచివుళ్ళను దించుఁ దిరుగుచుండి
సీతకుఁ గనిపింపఁ జెంగి యరఁటి యిండ్ల
తేల చెట్లను జేరి లీలఁబోయి

---

* ఉత్పలములవంటి చెవులు.
** మధుకము = ఇప్పపువ్వువంటి.

పద్మ చిత్రమౌ వీపుతోఁ బరగి మిగుల
రాము నాశ్రమ పథి విహారములు చేసి
వెడలు మరలును తిరుగును వెడలి త్రుటిని
కొసరి మరలును విహరించుఁ గూరుచుండు. 592

కాంచు నాశ్రమ ద్వారమున్ గదుపుఁ జేరు
లేళ్ళ కదుపులు వెంటరా లీల మరలు
లేఁడి యయ్యె దైత్యుఁడె సీతఁ జూడఁ గోరి
చిత్రముగ గుండ్రముగ భ్రమించియె చరించు. 593

వనిఁ దిరుగు వన్యమౌ లేళ్ళు పైకిఁ జూచి
దానిదరిఁ జేరి మూచూచి త్వరగఁ బాఱు
రాక్షసుడు గూడ నడవి లేళ్ళను వధింపఁ
జూచి స్వీయభావము గప్పి సోకి తినఁడు. 594

—: సీత బంగరులేడిని తెమ్మనుట :—

పరిగ నప్పుడె శుభనేత్ర సరస వదన
సీత మదిరాక్షి పూవులన్ జిదుమఁ గోరి
కొండగోగు లశోకముల్ కొమరు మావి
పూవులను గోయ చరియించె మోద మలర. 595

అడవిలో వసింపఁగఁ దగ నట్టియామె
రమ్యబింబోష్ఠి మెఱసెడి రత్నమయపు
ముత్యములఁ బోలు చుక్కలఁ బొలుచు మేను
రజత ధాతు రోమపు లేఁడి రాఁగ నపుడు. 596

పరమ మాశ్చర్యమున నుల్కి పడుచుఁ
గనులు బాగుగా విప్పి పయికిఁ జూచె
వెసను మాయలేఁడియు రాము ప్రియును గాంచి
వని వెలుఁగ జిత్రముగఁ జరించెను గరంబు. 597

ఇదివఱ కెన్నఁడుఁ గనని వి
విధరత్నమయంబ యైన వింతగు లేఁడిన్
ముదమున గని పూల్ గోయుచు
మదిలో నాశ్చర్య మొందె మైథిలి మిగులన్. 598

విమలాంగి శుభ్రశోణి మి
సిమి బంగరు రంగు గలుగు సీత పసిఁడి వెం
డి మిసిమి పార్శ్వము లమరు మృ
గము గని పిలిచెఁ బ్రియుని ధృతకార్ముకు మఱఁదిన్. 599

అటులు సీత పిలువ నరవ్యాఘ్రము లైన
రామలక్ష్మణుల్ వచ్చి యరసిరి మృగము
అపుడు సౌమిత్రి శంకతో ననియె నిట్లు
దీని రాక్షసు మారీచుఁ గానె తలఁతు. 600

వేటకును వచ్చి వేటాడు పృథివి పతులు
కామ రూపుఁడౌ వీనిచే క్షయము గనిరి
స్ఫూర్తి గలిగి గంధర్వుల పురముఁ బోలు
నిట్టి మాయామృగము మాయనే యొసంగె. 601

ఇట్టి మాయా మృగాకృతి యట్టి మాయ
కానిదే యిట్టి రత్న మృగంబుఁ జూడ
మిదియు మాయయె యనెడి మఱఁదిని నాపి
సీత యనె ఛద్మచే హృత చేతన యయి. 602

ఆర్యపుత్ర! యియ్యది చెలువారు చుండె
ఈమృగము నామనసును హరించు చుండె
ఓమహాబాహు ! దీనిని నొడిసి తెమ్ము
మన వినోదంబుకై యిది పనికి వచ్చు. 603

మన యీ యాశ్రమ మందుఁ జాలశుభమౌ మాన్యంపు జంతుల్ దన
ర్చెను దుప్పుల్ సితనీలమౌ చమరముల్ ఋక్షంబులున్ కిన్నరుల్
ఘనమౌ క్రోతులు నుండె, దీప్తిని క్షమన్ గాంతిన్ సుతేజస్సునన్
కన మీలాటి మృగంబు నెందయిన నీక్ష్మామండలంబం దహో. 604

వివిధంబైన విచిత్ర గాత్రములతో వెల్గొంది రత్నంపు బిం
దువులన్ గాన వెలుంగఁ జేసి మృగ మిందుం బోలి రమ్యం బగున్
అవురా! యేమి మనోజ్ఞ మేమి స్వరమాహా లక్ష్మి యేలాటిదో
సువిచిత్రాంగము గల్గు నీమృగమహా శోభిల్లు; లాగున్ మదిన్. 605

బ్రదికియే దొరకెనా బాగుగా నీవేఁడి
ఆశ్చర్యమై విస్మయంబు గూర్చు
వనవాసము ముగించి మనము రాజ్యము పొంద
నంతఃపుర క్రీడ కది తనర్చు
ఆర్యపుత్రునికిని నాభరతుని కత్త
లకు నాకు నిది కేళులకు నెసంగు
జీవింపకయు నది చేఁజిక్కనాదాని
చర్మంబె రుచిరమై సౌరులీను

చంపఁ బడిన దీనిది చర్మ స్వర్ణకాంతి
వఱలఁ బచ్చిక బయళులఁ బఱచియుందు
నీదరిని నుపాసించెడి నెయ్య మొప్పఁ
గూరుచుండఁ గోరుదును సుమి వీరవర్య! 606

స్వప్రయోజనమును గోరి స్వపతిఁ బనుచు
టదియ రౌద్రము స్త్రీలకు నిదియు తగదు
కాని యీవింత జంతువు కాయకాంతి
కరము విస్మయమును నాకుఁ గలుగ జేసె. 607

వ. అని సీత పలుకటయు వంత.

పసిఁడి రోమంబులు తరుణభాను కాంతి
మణులశృంగాలు చుక్కల మార్గ దీప్తి
కలుగు నామాయమృగముచేఁ గరము రాము
మనసుగూడ విస్మయ మొందె మానకపుడు. 608

ఇట్టి సీతోక్తి విని వింత మృగముఁ జూచి
అట్టి రూపముచే లోభ పెట్టఁబడియు
సీత ప్రేరేప ముద మొంది చెలఁగి రాము
డనియె తనతమ్ముఁ డైన లక్ష్మణునితోడ. 609

ఎటుల సీతకు మృగముపై నిచ్ఛకలిగె
చూడు లక్ష్మణ! యిది రూప శోభయందు
ఎంతొ శ్రేష్ఠమై యుండిన హేతువునను
ఇప్పు డీలేడి యుండద యింకముందు. 610

వనమునం దైన నందనవనిని నైన
చైత్రర మందుఁగాని యీసాటి లేడి
యుండ దనిన నింక ధరలో నుండు టెట్లు
చూడు! లక్ష్మణ! యీమృగ శోభ నిపుడు. 611

ప్రతిలోమం బనులోమ మౌచు నెటులన్ రమ్యంబ రోమాళి తె
న్నుతగెన్, లేడిని జెంది స్వర్ణమయ బిందుల్ చిత్రమై యొప్పె దీ
పితమౌ నగ్నిశిఖం బలెన్, జలదమున్ వెల్వడ్డ విద్యుత్తటుల్
ద్యుతి నొప్పెన్ మృగ మావులింప ముఖమందున్ ధోచుజిహ్వాగ్రమున్. 612

ఇంద్ర నీల చషక మట్టు లెసఁగు ముఖము
శంఖ ముక్తాసరముఁబోలు సన్నపొట్ట
గరము నందమౌ నిట్టిమృగంబు నెవని
చిత్తమును లోభపెట్టక క్షితిని నుండు. 613

మేల్మి బంగరువంటి యామేలి రూపు
వివిధ రత్నమయం బగు విశద దివ్య
మైన దీని యాకారము నవనిపైని
వేని మనసుఁ బ్రలోభము పెట్ట కుండు. 614

సీత మైథిలి బాలను నాతి నెట్టు
లచ్చెరువు వఱచక యుండు నామృగంబు
మాంసమునకు విహారవుం బ్రకట కృతికి
వేటలో లేళ్ళ నృపులు చంపెదరు గాదె 615

వేగ ఘన వనిన్ వేటయుద్యోగమునను
ధనము లెన్నొ సంపాదించి తనరుచుంద్రు
వివిధ మైనట్టి ధాతువుల్ విలువ లేని
స్వర్ణరత్నాదులను గూడ సంగ్రహింత్రు. 616

నరుల కోశంబు వర్ధిల్ల వరలు ధనము
సర్వమును వన్యధన మెంతొ సార మగును
మనసుచేతఁ జింతిత మైన మహితధనము
లన్ని శుక్రుని సమ్మతి నైన యట్లు. 617

అర్థమును నపేక్షించెడి ప్రాణి యెపుడు
నర్థము నిమిత్తము విమర్శ లాచరింప
కొనరుచును, నర్థమునఁ బ్రయోజనము పొందు
నర్థశాస్త్రజ్ఞు లద్దాని నర్థమంద్రు. 618

ఈ మృగ రత్నపు ఘనమగు
హేమపుఁ జర్మమ్మునందు ఈనాతోడన్
ఈమైథిలి శుభమధ్యమ
ప్రేమ తొణఁక గూరుచుండి వేడుక పొందున్ 619

ఈచర్మపు మెత్తఁదనపున
కేచర్మము సాటిరాద, యీక్షితిలో నా
లోచింపఁ*గాదళి ప్రియకి
చూచెడు నావికి ప్రవేణి శుభములు గావున్. 620

ఈమృగవు దివ్యము నభో
గామియు శ్రీమంతము నయి ఘనమై యొప్పెన్
ఆమృగ శిర మృగమును నీ
భూమిఁ జరించెడి మృగమును వో దివ్యంబుల్. 621

ఒకవేళ నీవె యన్నటు
లిఁక రాక్షసు మాయ యేని నిపుడే దీనిన్
ఒకక్షణములోననే మా
వక వధియింపఁదగు లక్ష్మణా! గనుకొనుమీ. 622

మును క్రూరుం డకృతాత్ముఁడున్ ఖలుఁడు నీమూఢుండు- మారీచుఁడే
వని సంచారము చేయుచుండియు ముని వ్రాతంబులన్ జంపెఁగా
కని వేగంబ హతాత్ము పైఁబడి ధరానాథుల్ ధనుర్ధారు, లే
మనుదున్, వేటలఁజంపఁగా బడిరి, దుష్టైణం బెటుల్ వధ్యమే. 623

---

* కాదళి=మురువైన పొడుగు కర్బుర మగు నీల రోమములు గల మృగ ముకదళి దాని చర్మ. ప్రియకి=మెత్తని రోమములు గలది. ఆవికి = మేక చర్మ ఉన్నది ప్రవేణి=మృగ విశేషచర్మము.

మునుపు వాతాపి తపసుల మోసగించి
ఉదర మందుండి ద్విజులను నోలిఁ జంపి
* అశ్వతరిని స్వగర్భంబ యటుల; నపుడొ
అతఁడు కని యగస్త్యునికి నాహార మయ్యె. 624

శ్రాద్ధము తుద స్వరూపంబు ప్రకట పఱచు
దైత్యుఁగని నవ్వి మౌని వాతాపి కనియె
నీవు వాతాపి! గణియింప కెల్ల ద్విజుల
స్వబలమునఁ జంపి తందుచేఁ జచ్చినావు. 625

అటులె వాతాపివలె నీయసురుఁ డైన
నింక నావంటి ధర్మాత్ము నిట్టివశిని
ధిక్కరించునెడ నగస్త్యుని ధిక్కరించి
యపుడు వాతాపి యైనట్లు హతుఁడె యగును. 626

## —: రాముడు మాయలేడిననుసరించి చంపుట :—

ఇచట నీవు సన్నద్ధత నెసఁగి యిపుడు
జానకిని రక్ష చేయు మశ్రద్ధలేక
మనము చేయవలసినది మానకుండ
చేయుము గాక లక్ష్మణ ! స్థిరతతోడ. 627

అటులన్ దమ్మునిఁ బన్చిఁ పైఁడి పిడి నింపౌ ఖడ్గముందాల్చి యు
త్కటతేజుం డగు రాముఁ డంతఁ దన కంఠాలీయ ముచ్చోటులన్
పటువై వంగిన విల్లు గైకొని, *కలాపాల్ రెండిటిన్ గట్టి యు
ద్భటుఁడై విక్రమ మొప్ప లేఁడికొఱకై బైల్దేరె శీఘ్రంబుగన్. 629

* అశ్వతరి=గాడిదకు ఆడు గుఱ్ఱమునందు పుట్టినది. దానిని దాని గర్భము చంపునందురు. * కలాపాలు = అంబులపొదులు

వనిలో జంతుల రాజెయౌమృగ మటుల్ బద్ధాసిద్ధై వచ్చు నా
మనుజేంద్రున్ గని, భీతితోడ మరుగై మర్లన్ త్రుటిన్ గన్పడన్
ధనువుం గైకొని ఖడ్గధారి యవుచున్ రాముండు పర్వెత్త రా
ముని దాఁజూచియుఁ జూచి కానబడియున్ ముం, దేగియున్ దవ్వెయా. 630

* శర పాతంబుననుండి తప్పుకొను, నాశల్ పెట్టు నొక్కప్పుడున్,
తిరుగున్ మింటవలెన్ భ్రమించు, దరిఁగన్పించున్, వనిన్ మాయమౌ
శర దభ్రంబులఁ జంద్రుఁ డట్లు మసలున్ జక్షుస్సులన్ దోఁచు, నా
దరినే కన్పడ కంతలోఁ గనఁబడున్ తన్మాయలేఁ డయ్యెడన్. 631

అటు మారీచుఁడు లేడియై క్షణములో నట్టుల్ క్షణం బిట్టులన్
చటులంబై యటు లాశ్రమంబున కటుల్ చాలావడిన్ రాము ని
ట్టటు దవ్వున్ కొని పోవఁ జేయునది లేకారాముఁడున్ మోహితుం
డటులై యల్గి శ్రమించి పచ్చికను చాయన్ జేరి నిల్వంబడెన్. 632

మృగరూపంబును గొన్న రాక్షసుఁడు పేర్మిన్ నేర్మి వన్యంబులౌ
మృగముల్ పెన్కొని రా సమీపమునఁ గన్పించున్ గ్రహింపం దలం
చఁగఁ బర్వెత్తెడి రాముచేఁ బడక త్రాసం బొంది మాయం బగున్
తగ వృక్షంబుల చాటునుండి వెడలున్ దవ్వేగుఁ జేరున్ దరిన్. 633

తుదకున్ రాముఁడు పల్మరున్ విసిగి యందున్ జేరి వేసారియున్
హృదిలో దానిని జంప నిశ్చయము నెంతేఁ బూని సూర్యార్చి య
ట్లదనన్ మండెడి బ్రహ్మ నిర్మిత శరం బావింట సంధించి యా
పిదపన్ బుస్సను పాముపై నివలెనే వేసెన్ వడిన్ లేడిపై. 634

---

* శకుంతల నాటకములో కాళిదాసు నిట్లే దుష్యంతుఁడు లేడిని తఱుము
నప్పుడు వర్ణించెను.

వ్యసనమే నీకుఁ బ్రియమని యాత్మఁ దలఁతు
నీకు నన్నుపై స్నేహంబు లేక యుండె
కనుకనే మహాద్యుతి రాముఁ గనకె యిపుడు
నిశ్చలంబుగ స్థిరుఁడవై నిలిచి యుంటి. 647

ఎవనిని బ్రధానముగఁ గని నీవిటకు వచ్చి
తతఁడు సంశయావస్థలో నణఁగు చుండ
ఇంక నీయాశ్రమమున నే నిట్టులుండి
యేమి చేయవలసి యున్న దిపుడు నాకు. 648

అనుచు బాష్పశోకమ్మున నవసి, హరిణీ
కరణి హడలు సీతఁ గని లక్ష్మణుఁడు పలికె
వదెన! నాగ గంధర్వ దేవాసురాదు
లెవరు నన్నుఁ గెల్వఁగఁ జాల రిది ధ్రువంబు. 649

నరులందున్ సురలందుఁ గింపురుష గంధర్వాదులం దేనిఁ గి
న్నరులందేని పిశాచులందు నయినన్ దైత్యాదులందైన నె
వ్వరు నింద్రోపము రాము యుద్ధభువిలో వారించి పోరంగ జా
లరుదేవీ! యిది నిశ్చయంబు మది నేలా భీతి నీవొందెదే. 650

ఆనిలో రాముఁ డవధ్యుఁ డెవ్వరికి నేలా! యిట్లు వాక్రుత్తు వీ
వనిలో రాముఁడు లేనియప్పుడు నినున్ వర్జించి నేనేఁగఁజా
లను, ముల్లోకము లీశుదేవులను గూడం గట్టుకొంచున్ వడిన్
చనుదెంచన్ సరె వీరు రాముఁ గెలవన్ శక్యంబె యెం దేరికిన్. 651

హృది సంతృప్తిని బొందు మీవ్యథ విసర్జింపందగున్ జుమ్మీ యిం
యదనన్ లేడిని జంపి వచ్చును ప్రియుం డాలస్యమే చేయఁ డీ
యదియో రాముస్వరంబె గా,దసలు దివ్యంబైనఁ గాదింక నా
యది *గంధర్వ పురంబువంటి దయి దైత్యాదిష్టమౌ మాయయే 652

నిను వైదేహి! మహాత్ముఁ డన్న మృగమున్ దేఁబోయి న్యాసంబుగా
విను, నాయం దిడి యేగె, నిన్ విడిచి దేవీ! వెళ్ళఁగాఁ జాల నీ
మనకో, శూర్పణఖన్ విరూప నొనరించంగా జనస్థాన మో
ర్చిన క్రూరున్ ఖరుఁ జంపుటే మొదలు వచ్చెన్ రాక్షస ద్వేషముల్.653

అసురుల్ హింసలఁ దేలి యాడుదురు, వాక్యాలెన్నొ పల్కీర్లనిం
దు సృజిం, త్రానుడులం గుఱించి మనమెందున్ గూడఁ బట్టించుకో
నసలే కూడ. దటంచు లక్ష్మణుఁడు నొయ్యన్ బల్కఁ గండ్లెఱ్ఱఁజే
సి సుతీవ్రోక్తులు సీత యుల్గి వచియించెన్ సత్యవా గ్లక్ష్మణున్. 654

కరుణాహీన! యనార్య! ఘాతుక! కులాంగారుండ! యీరాము దు
ర్భర కష్టంబులె నీకు నిష్టమని నే భావించెదన్ రాము దు
ర్భర కష్టంబులఁ జూచి యిట్లనెదు దుర్భావాన, నీవంటి దు
ష్కరులౌ ఛన్నులు జ్ఞాతులం; దివియు నాశ్చర్యంబులే లక్ష్మణా. 655

కడు దుష్టుండవు: నన్గొనన్ భరతుచేఁ గానీ యిటుల్ పంపగం
బడినావో యిది నీదొ యాభరతుదో! ప్రాప్తి సిద్ధింప ది
ప్పుడు నేమాత్రము; నెట్టు లుత్పలతనున్, బొందమ్మిబోల్ కన్నులౌ
ప్పెడుభర్తన్ బ్రియు నాశ్రయించియు నికన్ బ్రేమింతునే క్షుద్రునిన్.
656

---

* వేదాంతులు సంసారమును గంధర్వపురముతో పోల్చెదరు. గంధర్వ పురము లేనట్లే సంసారము లేదని దాని తాత్పర్యము. అట్లేయీస్వరము గంధర్వపురమువలె లేనిదే రామునిది గా దని భావము.

వినుమో లక్ష్మణ! నీకు ముందె యసువుల్ వీడంగలన్, సుంత యిం
దనుమానం బిఁక లేదు రాము విడి నా ప్రాణాలు నిల్వన్ భువిన్
క్షణమే, నంచును సీత దారుణముగన్ మైఁబుల్కరింపంగ ఝు
ల్లనఁ బల్కన్ వశి యైన లక్ష్మణుఁ డనెన్ హస్తాబ్జముల్ మోడ్చుచున్. 657

జానకి! నీవు పల్కిన వచస్సుల కుత్తర మీయఁ గోర నె
ట్లేనియు నాకు దైవతము, వీవిటు పల్క నయుక్త మిట్టులన్
చానలు పల్కఁ జిత్రమెటు, చానల కిద్ది స్వభావ, మిట్లు లో
కానను నొప్పె, స్త్రీల్ చలలు కష్ట లధర్మలు భేదకారిణుల్. 658

ఇటు నాదీనుల నెఱిఁ గాల్చిన శరంబే గ్రుచ్చినట్లిట్టి నీ
కటు వాక్యంబు సహింప నేను జనకక్ష్మాపుత్రి! యీకానలో
నిట నున్నట్టి వనేచరుల్ మిగుల వింద్రేగాక, పల్ సాక్షులై
యిటు న్యాయంబుగఁ బల్క నన్నిటు కరం బీవన్న యన్యాయముల్ 659

అన్న వాక్యంబు తలఁబూని యాగియున్న
నన్ను నిటు స్త్రీస్వభావంబునని కరంబు
సంశయించుచున్నావు ఛీ! క్షణములోన
నాశ మొందుచు నుంటివి నయుతఁ జూడు. 660

ఎటను రఘురాముఁ డున్నాఁడొ యటకె పోదు
ఓశుభాస్య! నీకును శుభం బొదవుఁగాక
అఖిల వనదేవతలు విశాలాక్షి! నిన్ను
నిపుడు సర్వవిధముల రక్షింత్రు గాక. 661

దారుణంబులె యగు నిమిత్తములు నాకు
నిచట మిక్కిలి నావిర్భవించుచుండె
మరల రాముతోఁ గూడ నేనరుగుదెంచి
సుఖముగాఁ నున్న నిన్నిటఁ జూడఁగలనె. 662

అనుచు లక్ష్మణుఁ డనఁ, గండ్ల నశ్రు లురల
ఏడ్చుచుఁ గఠోరముగ సీత యిట్లు లనియె
రాముఁ గనక గోదావరిన్ రయము చొత్తు
ఉరిని పోసికొందును నద్రినుండి పడుదు. 663

ప్రబల విషమును త్రావుదు వహ్నిఁ బడుదుఁ
గాని రాముకంటెను నన్యు నేను సోక
ననుచు లక్ష్మణుఁ గని యార్చి వ్యధల సీత
బాధచేఁ గేలఁ బొట్టను బాదుకొనియె. 664

అటు లార్తిన్ గని యేడ్చుచుండిన విశాలాక్షిన్ సతిన్ జానకిన్
అట వీక్షించియు లక్ష్మండు విమనుండై యూరడింపండు, పి
మ్మట నాసీతయు నంతయున్ మఱఁదితో మాటాడ, దాలక్ష్మణుం
డటు కేల్మోడిచి మ్రొక్కి సీతఁ గనుచు న్నా రాము చెంతన్ జనెన్. 665

సీత పరుషంబుగా నట్లు చెప్ప నలిగి
లక్ష్మణుఁడు వెళ్ళఁగోరకె రయము వెళ్లె
ఇంక అది గాంచి రావణుం డింతలోనె
సీత కడకుఁ బరివ్రాట్టు రీతిఁ జనియె. 666

నునుపుఁ గాషాయమును కంఠమున వేర్ల
శిఖయు ఛత్రము పాదుకల్ చెలువు లీన
దండము కమండలు లెడమ దండ ప్రాల్చి
రావణుఁడు సీతఁ గనెఁ బరివ్రాట్టె యగుచు. 667

అతిబలుఁ డగు రావణుఁడును
పతియు మఱఁది దరిని లేని పడఁతిని సీతన్
అతి త్వరగఁ గనె శశి రవి ర
హిత సంధ్యను ఘనతమంబు సెనసిన యట్టుల్. 668

అతి దారుణుఁ డగు నాతఁడు
పతిని యశ్వస్వినిని రాము జాయను దరిసెన్
ద్యుతి గల చంద్రుఁడు దరిలే
ని తఱిని రోహిణిని నాశని గ్రహ మటులన్. 669

దారుణ కర్ముని రావణుఁ
గ్రూరు జనస్థానమున మొలచు వృక్షంబుల్
ఆరసి కదలవ యచ్చటి
మారుతమును మెదలక యుండి మౌనం బూనన్. 670

ఎడతెగక పాఱు చుండియు
వడి గల గోదావరియును భయుదుని సెట్టం
బడు కనులఁ జూచు రావణు
హడలుచుఁ గని మెల్ల మెల్ల నరుగం దొడఁగెన్. 671

అప్పుడు భయ్యముగఁ బతిం
దప్పక భావించుచున్న తరుణిని సీతన్
చప్పుడు చేయక దైత్యుఁడు
చప్పునఁ గనెఁ, జిత్రఁ గనెడు శనియో యనఁగన్. 672

పాతకి దైత్యుఁడు భవ్యపు
రీతిఁ దృణచ్ఛన్న కూప లీలను దగు నా
ఘాతకుఁ డారాము సతిని
సీతను వీక్షించి యచటఁ జెంతనె నిలిచెన్. 673

వ. అట్లు దరిని నిలిచి.

పొలుపౌ దంతము లోష్ఠముల్ దనరగా, పూర్ణేందుఁబోల్ ముద్దుమో
ములరన్, దామరపూలఁ బోల్ గనులఁ జెన్నై సీత కౌశేయమున్
గలదై జానకి బాష్పకోశములు నిండన్ బర్ణశాలాంగణ
స్థలి భర్తన్ దలపోయుచుండ ఖలుఁడౌ తద్రావణుం డారసెన్. 674

కని కామాంధుఁడై యాచు రావణుఁడు చక్కన్ వేద మంత్రంబులన్
విన ఘోషించుచు, రాముఁ డుండని తఱిన్ జెందమ్మి తేనట్టి ల
క్ష్మిని తోపించుచు, మేనితో వెలుఁగు నాసీతన్ ప్రశంసించి యి
ట్లనె బంగారపు మేనిపై బసుపుఁ బుట్టం బూను నీవెవ్వరే. 675

అమలం బౌచు విశాల మీకనులు, నీవౌ నల్లగ్రుడ్లివ్వి యుం
తమునం దెఱ్ఱని జీరలన్ దనరు, పీనంబై వెడల్పై నితం
బము మీఱున్, కరి హస్త శోభులు తొడల్, ప్రౌఢంబులై బల్సి యూ
ర్ధ్వముఖంబై కలిసుండెఁ దాళఫల వృత్తాల్ రత్నరమ్యాల్ చనుల్.
676

ఓసి! విలాసిని! సుందర
హాసిని! చారురదన! హృదయంగమ నయనా!
ఓసుందరి! నామదిని న
దీసలిలము తటమును బలెఁ దెగ హరియింతే. 677

గుప్పిట నిముడు నడుము గల
యొప్పులకుప్ప! నినుబోలు నువిదను గనలే,
దిప్పుగిది దైవి కిన్నరి
యొప్పుల గంధర్వి యక్షి యెప్పుదు సమమై. 678

ఇటు లోకోత్తర సౌకుమార్యమును, నీయాప్రాయమున్ గాన నుం
డుటయున్ నాకివి పిచ్చిడున్, శుభము నిన్నుం బొందు, నీవిందు నుం
డుట యర్హంబును గాదు రాక్షసులు నెందున్ గామరూపంబుతో
నిట సంచారము చేయుచుండియు భయంబే కూర్తు నీకెంతయున్.
678

సరసంబై చెలువై సుగంధు లగు ప్రాసాదాగ్రముల్ రమ్యమౌ
పుర బాహ్యోపవనుల్ చరింప నుచితంబుల్ నీకు, నీలాక్షిరో!
వరమౌ మాల వరంపు భోజ్యము వరంబౌ వల్వలున్ మేల్ నగల్
వరుఁడౌ భర్తయు నీకు నుండవలయున్ పద్మాక్షి! యం చెంచెదన్. 680

ఎవతె వీవు రుద్రులదాని వేమొ, వసుల
దానివా లేక మరుతుల దానివౌదె
ఓవరారోహ! దేవతగా వెలిఁగెద
వనుకొనుచు నుంటి నిప్పుడు నిను దలంచి. 68

ఇటు గంధర్వులుగాని కిన్నరులుగానీ దేవులుంగాని రా;
రిట నారాక్షసు లుందు, రేవిధముగా నీవిందు నేతెంచినా,
విట సింహంబులు వ్యాఘ్రముల్ మృగములున్ ఋక్షంబులున్ వానరుల్
పటువౌ రాపులుఁగుల్ సివంగు లడరన్ త్రాసంబు నీవొందవే. 682

మద మొప్పారెడి ఘోర కుంజరములుం బల్ వ్యాఘ్రముల్ మీరెడిం
గద, యేతాదృశ భీకరాటవిని నొక్కర్తెట్లు భీతిల్ల వే
మిది; నీవెవ్వతె, వేరిదాన విటు, లీవెందుండి యేతెంచినా,
వెది యేహేతువుచేత దండక వనం బిట్టుల్ చరింతొంటివై. 683

అని సద్బ్రాహ్మణుఁ డట్లు రావణుఁడు దుష్టాత్ముం డనన్ సీత యా
తని బూజించి, శుభాసనం బతిథిసత్కారంబు పాద్యమ్ము భ
క్తిని నర్పించుచు, నెల్ల సిద్ధమని- విద్వేషింప రాకుండి సౌ
మ్యుని యట్లుండి కుసుంభవస్త్రిఁ డగు దైత్యుం గొల్చె విప్రుంబలెన్. 684

ఇదె దర్భాసన మిపు స్వేచ్ఛగను నిందే యుంకఁ గూర్చుండుమీ
ఇదె పాద్యంబు ప్రతిగ్రహింపు, వనియందే యుండు మూలాదికం
బిదె, నీవున్ స్తిమితంబ వీనిగొనుమీ యిందంచు నాసీత చె
ప్పఁ దలన్ ద్రిప్పుచు బల్కె నామెను హరింపం గోర్కెగా చావుకై. 685

పిదప సువేషుడు వేటకు
పదపడి వెళ్ళిన పతి కయి బావ మఱఁదికై
అదె వనిగఁ జూచె జానకి
మది శ్యామల వనమె తోఁచె మఱి కన దెవరిన్. 686

అమరి పరివ్రాజక వే
షముతో నేతెంచి జనకజను హరియింపన్
ప్వమతిఁ గను రావణుతో
నమలిన జానకి తనంత ననియెను నిటులన్. 687

ఈతఁడు బ్రాహ్మణుఁ డతిథియు
ఈతనికిఁ దెలుపనిచో శపించునొ యనుచున్
సీత క్షణము తలపోసియు
నీతిరుగ నతనితో వచించెను నపుడే. 688

మిథిలాధిపతి మహాత్ముఁడు
ప్రథిత గుణుం డైన జనకరాజు కుమార్తెన్
ప్రథితను సీతయున, ద్విజా
గ్ర! ధరణి నీకు శుభ మవుత రాముని భార్యన్. 689

ధర నిక్ష్వాకుల సర్వకామ సుసమృద్ధంబౌ గృహంబందు పే
నరులున్ పొందని భోగముల్ గనుచు నుండన్ రాజు శ్రీరాము నీ
యురుధాత్రిన్ యువరాజుచేయఁ బడుమూడో యేట సామాన్యుడై
యురుసామగ్రిని కూర్ప యత్నముల నెన్నో చేసె సంప్రీతితో. 690

అప్పు డార్య కైక వాని నధసి మామఁ
బతిని నిగ్రహించియు రెండు వరము లడిగె
అందు నాసుకృతంబుచే నడవికిఁ బతి
చను టొకటి, భరతాభిషేచనము రెండు. 691

అటుల సత్యసంధుని భర్త నధిపు నడిగి
రాముని నభిషేకించుచో బ్రదుకఁ జత్తు
ఇఁక భుజింప నీళ్ళాన నిద్రింప నెపుడు
అని పలుకు కైకఁ గని రాజు ననియె నిట్లు. 692

ఎన్నొ విలువైన వస్తువు లిడెద ననియెఁ
గాని స్వపతి ప్రార్థన నామె కాలఁదన్నె
అపుడు తేజస్వి పతి కిర్వదైదె * యేండ్లు
నాకు పదునెన్మి దేండ్లు జన్మంబు మొదలు. 693

ధరరాముండని ఖ్యాతి పొంది గుణి సత్యాత్ముండు ప్రాణిప్రియుఁ
డరు బాహుండు విశాల నేత్రుఁడగు పూజ్యుంబుత్రుఁ దేజస్విభా
సురతేజుండును కామియౌ దశరథ క్షోణీశుఁ డాకైకదున్
కరమున్ వాంఛయుఁ బ్రీతి గూర్పనభిషేకం బాచరింపండబన్, 694

---

* జనకునికి దొరకక పూర్వము ఆరేండ్లు సీతకు ఉన్నవి. ఆ దొరకిన సమయమునే జన్మగా మనము గ్రహింపవలెను. పెండ్లియైన పిదప అయోధ్యలో 12 ఏండ్లు ఉన్నది. కాన 18 ఏండ్లు అని చెప్పుట 8 పోవుచున్నది. వనవాసము 13 ఏండ్లు. ఈ 18 తో 13 కలుపగా 31 ఏండ్లు అగును. అదివరకు ఆరేండ్లు కలపగా 37 ఏండ్లు అని ఎంచుకొన వలయును. (చూ. వివరము బాలకాండ పీఠికలో).

పిదప నభిషేకమునకును పితృ సమీప
మరుగు దెంచిన పతి రామునరసి కైక
యనియె నీతండ్రి ధృతితోడ నాజ్ఞయిడిన
యీ పలుకు నాలకింపుమి యిపుడె రామ, 695

భరతు నికఁ గంటకములేని ప్రథితరాజ్య
మివ్వవలె, వనిఁ బదునాలుగేండ్లు నీవు
నుండవలె, వనికేగి నీవుండి తండ్రి
నిపు డనృతమునుండియు విడిపింపురామ! 696

అనుచు కైకేయి యన భయుంబె లేని
మత్పతి దృఢ వ్రతుండయి మాటయిచ్చె
నెపుడు మాట తప్పఁడు సత్యమే వచించు
అనృతమాడఁ డిదె ద్విజ! యాయనఘదీక్ష 697

రాము పినతల్లి కొడుకైన లక్ష్మణుండు
వీరుఁడన్నకు సాయమై వెడలివచ్చె
ఆతఁ డాశత్రుహంత ధర్మాత్ముఁ డన్న
ననుసరించె నాతోడ జడను ధరించి. 698

కైకకై మేము నీదండ కాటవికిని
సకల రాజ్యము నుండియు జాఱిపడియు
తేజసున గభీరమగు మహోగ్రవనిని
తిరుగుదుము, విశ్రమింపుము ద్విజ వరేణ్య! 699

ఇంతలో వన్య మాహార మిటకుఁ బతియు
పుష్కలంబుగ తెచ్చియు నిపుడు వచ్చు
నీవెవరు గోత్ర మెది కులంబేది సరిగ
తెలుపు, మీవని నొంటిపై తిరిగెదేల. 700

వ. అని రాముని పత్ని సీత ప్రశ్నింప మహాబలుండును రాక్షసాధి పుఁడు నైన రావణుఁడు తీవ్రముగ పద్ధతిని ఇట్లు పలికెను. 701

ఎవఁడన్నన్ సురపన్న గాసురులు ఈయెల్లన్ జగంబుల్ భయం
బు వహించున్‌గదా యట్టి రావణుఁడఁ బువ్వుంబోడి సీతా? నిశా
* ట విభుండన్ కనకాంగి: పట్టుదగు పుట్టంబున్ మెయిన్ దాల్చ ని
న్నవలోకింప మదీయ కామినులయుం దానంద మొందన్ జుమీ. 702

సకల దిక్కులనుండి తీసికొని వచ్చి
యున్న యుత్తమస్త్రీలలో మిన్న వగుచు
నాకుఁ బట్టమహిషి వయి లోకమందు
భాగ్య భోగాలు గను; నీకు భద్ర మవుత. 703

ప్రమదా! లంక యనంగ నాకొక మహాపట్నంబు సంద్రంబు మ
ధ్యమునన్ సంద్రముచేతఁ జుట్టబడి శైలాగ్రంబునం దొప్పు,నం
దు మనోజ్ఞం బగుఁ బూవుఁదోటలను నాతోడన్ విహారాలు చే
సి మహానందము పొంది కాననములన్ సీతా స్పృహన్ దేవిఁకన్. 704

ఈవు నాకు భార్యగ నవుదేని సీత!
అయిదువేల దాసీలు సర్వాభరణలు
నిను గొలుతు రంచు రావణుం డనఁగ నలిగి
యిట్లు విమలాంగి సీత నిందించి యనియె. 705

శైల మటు స్థిరుని శక్రువంటి విభుని
పతి, రాముఁ గొలుచుట వ్రతము నాకు

---

* నిశాటుఁడు=నిశలందుఁదిరుగు రాక్షసుఁడు

అంభోధి యట్టుల నక్షోభ్యు *వటబంధుఁ
బతి రాముఁ గొలుచుట వ్రతము నాకు
సర్వలక్షణ యుక్తు సత్యసంధు నృసింహుఁ
బతి రాముఁ గొలుచుట వ్రతము నాకు
పృథు బాహుఁ బృథువక్షు విపుల సింహగమనుఁ
బతి రాముఁ గొలుచుట వ్రతము నాకు

పూర్ణచంద్రాస్యు దశరథ పుత్రు వశిని
పతిని రాముని గొలుచుట వ్రతము నాకు
నీవొ నక్కవు సింహిని నేను మూర్ఖ!
సూర్యు ప్రభఁ బోలె నను నీవు పొంద లేవు. 706

రాముని ప్రియసతిన్ రావణ! గోరెదు
*కడు బంగరు తరులఁ గంటి వటర!
ఆఁకొన్న సింహము నాశీవిషము నోటి
వాడి కోరను లాగ వేడు దటర!
మందరాద్రిని గేల మడఁచియుఁ దిరిగెదె
కాలకూట విషంబు గ్రోలి మనుదె
సూదితోఁ గను తుడ్చి క్షురము నాల్కను నాకి
మెడబండ నిడి వార్ధిఁ గడవఁ దలఁతె

ఇందు సూర్యులఁ గేల హరింపఁ దలఁతె
మండు నగ్నిని బట్టతో మూప నెంతె
ఇనుప శూలాల చివరఁ జరింపఁ దలఁతె
రాముసతి శుద్ధఁ గోరెదు రావణుండ! 707

* వటమువలె వ్యాపించిన బంధువులుగలవానిని
* బంగారు చెట్టును కలలో చూచిన వాఁడు చచ్చునని నిమిత్తజ్ఞులు,

ఎక్కడ ఆసింహ మెక్కడ ఈ నక్క
ఎక్కడ రఘురాముఁ డేడ నీవు
ఎక్కడ సంద్రంబు నెక్కడఁ గాలువ
ఎక్కడ రఘురాముఁ డేడ నీవు
ఎక్కడ బంగార మీసీస మిను మేడ
ఎక్కడ రఘురాముఁ డేడ నీవు
ఎక్కడఁ జందన మెక్కడ బురదయు
ఎక్కడ రఘురాముఁ డేడ నీవు.

ఏనుఁ గెక్కడ నెక్కడ ద్రిమాను పిల్లి
గరుడుఁ డెక్కడ నెక్కడఁ గాకిపిట్ట
నెమలి యెక్కడ నెక్కడ నీరుకాకి
హంస యెక్కడ నెక్కడఁ జవిటిగ్రద్ద
రాముఁ డెక్కడ నేడ దురాత్మ! నీవు. 708

ఆ మహి తేంద్రుని బోలిన
రాముఁడు చేత ధను వూని రాజిలి యుండన్
ఏమియుఁ గాను హరించిన
నీమహిఁ బురుగు దినిన మణి యెటులన్ గాదో. 709

అని యిటుల సాధు భావము
దనరిన సీత దృఢముగను దైత్యుని తోడన్
అని గాలి కదలు కదళి వ
లెను తనుగాత్రంబునఁ గదలెను నచ్చోటన్. 710

అటు వణఁకెడి సీతను గని
పటుమృత్యు సమ ప్రభావ భావముతోడన్
ఇటు స్వకులము, కర్మబలము
నట రావణుఁ డనె జనకజ యార్తి గనంగన్. 711

ఇటు పరుషముగ సీత వచింపఁ గాంచి
నుదుటఁ గను బొమ్మముడి పెట్టి పిదపనలిగి
రావణుఁడు సత్వరముగ సంరంభ మొప్ప
ప్రబలి సీతకు ప్రత్యుత్తరంబు నొసఁగె, 712

వైశ్రవణునికి సాక్షా త్సవత్ని సుతుఁడ
ఓసి! వరవర్ణినీ! విను మూర్వి యందు
దశముఖుండను మిగులఁ బ్రతాపయుతుఁడ
రావణుం డంద్రు, నీకు భద్రంబ యవుత. 713

ఎవని వీక్షించి-మృతిఁ జూచి జను లట్టు
లమర గంధర్వాదు లడలుచుంద్రో
ఎవఁడేదొకతన వైశ్రవణుని నెక్కటి
కయ్యాన నోడించి ఘనత కెక్కె
ఎవని భీతిని దనయిలు వీడి ధనదుండు
కైలాసగిరి యందుఁ గాలు పెట్టె
ఎవఁడు స్వేచ్ఛగను బోయెడి పుష్పకముఁ గెల్చి
యాకాశమున హాయి నరుగు చుండు

ఎవని క్రుద్ధ ముఖమొ చూచి యింద్రముఖ్య
సురలు భీతిల్లి మిక్కిలి పరువు విడుదు
రట్టి సర్వరాక్షస భువ నాధిపతిని
ప్రబల రిపు విరావణుఁడను రావణుఁడను, 714

ఎట నేనుందునో యందు గాలి వెఱచే స్వేచ్ఛాగతిన్ వీచలే,
డెట నేఁ బోవుదు నందు నుష్ణకిరణుండే భీతి శీతాంశువౌ
నెటనే నిల్చెద నందు చె ట్లసలు కంపింపన్ భయం బొందుఁగా
ఎటనేఁ జూచెద నందు నేర్లసయితం బేమాత్రమున్ పాఱవే. 715

ఇంద్రుని కమరావతి వలె నిట్టె నాకు
లంక యనుపురి వార్ధిపారమునఁ గలదు
ఘోర రాక్షసావళి చేతఁ బూరితంబు
పాండరమగు ప్రాకారాన భ్రాజితంబు. 716

పలు బంగారపుఁ గక్ష్యలన్ వెలుగుచున్ వైడూర్యపుం దోరణం
బుల పొల్పారుచు నశ్వహస్తి రథ సంపూర్ణంబ యై తూర్య సం
కులమైయ్యాపురి సర్వకాల ఫల వృక్షోద్యాన శోభా మహో
జ్జ్వలమై యున్నది యందు నీ వలరి సీతా! యెంచ వీస్త్రీలనే 717

నర భోగంబుల, దివ్యభోగముల నానందంబు నీ వొందుచున్
మఱచే పోదువు చావె మూడిన నరున్ రామున్: బువుంబోడి! యా
సరసున్ బుత్త్రుని నిష్టునా దశరథక్ష్మాధీశుఁ డారాజ్య మం
దరయున్ స్థాపనచేసి మందబలుఁ డౌ నగ్రాత్మజున్ వీడె సూ. 718

మతియే పోయియు భ్రష్టరాజ్యుఁడగు నీ మందాత్ముతో మౌనితో
గతియే యుండని రాముతో నడవి నే కార్యంబు గావింతు, వీ
వతి లోకున్ సకలాసురాధిపతిఁ దానై వచ్చి యున్నట్టి యీ
యతనూత్కృష్ట శరార్తుఁ ద్రోయకు విశాలాక్షీ! యి దన్యాయమౌ. 719

తొలుతన్ దన్ని పురూరవున్ దొలఁగఁగాఁ ద్రోయించి యాపైని చిం
తిలు నాయూర్వశివోలె భీరు యిటు సన్నే గెంటి యామీఁద చిం
తిలుదే సుమ్మిరణాన రాముఁడు రవంతేన్ నాదు కాల్గోటి కె
ట్టులు చాలం డిటు నీయదృష్టమున నిట్టుల్ వచ్చునన్ బొందుమీ. 720

ఇటుల రావణుం డనఁ గడు నెట్టిపడిన
కండ్లతోఁ గటువుగ సీత కనలి పలికె
ఎల్ల భూతంబులు నమస్కరించు దేవు
పై శ్రవణు భ్రాతఁగాఁ జెప్పి పాపి వవుదు. 721

చంచ లేంద్రియుండవును దుష్టాత్ముండవును
కర్కశుండ విట్టి నిన్నిశుఁ గాంగఁగొన్న
సర్వ రాక్షసులు నిఁక నాశంబె గాంత్రు
నీదుపాపాన నీయుర్వీమీఁద దుష్ట! 722

సురపతి భార్య శచిని నప
హరించి బ్రదుకుట యశక్యమగుఁ గద యటులే
వరరాము పత్ని నను నప
హరించి బ్రదుకుట యశక్య మగుఁ జుమి యసురా! 723

నిరుపమ శచి వజ్రాయుధు
కరమున లాగియును బ్రదుకఁ గలుగుదు వేమో
కర[illegible]యమృతమానినను న
న్నారసి బ్రదుకుతోడ మోక్ష మొందం గలవే. 724

అట్టులన సీత, రావణుం డాలకించి
మిగులఁ జేయి చేయి చఱచి మేను పెంచి
మరలఁ బలికె నున్మత్తపై మత్పరాక్ర
మమును వీర్యమున్ నీవు కర్ణముల నిడవు. 725

దివి నిల్చుండి భుజంబులన్ ధరణి నెంతే నెత్తు నెత్తంగలన్
భువి సంద్రంబును ద్రాగఁ జాలుదు యమున్ బోరన్ వధింపం గలన్.
రవిబింబంబు శరాల నడ్డఁగల వ్రీల్చంగల్గుదున్ ధారుణిన్
ఉవిదా! కాముదుఁ గామరూపిఁ బతి నన్నున్మత్త! వీక్షింపుమీ. 726

అని పల్కుచుండగ నరుక్క నగ్నిని బోలి
యెఱ్ఱనై తుదనీలి దృష్టి లెసగె
సౌమ్య భిక్షుని రూపు క్షణములో త్యజియించి
కాలుని రూపానఁ గరము వెలిఁగె.

కను లెఱ్ఱపడఁ దప్త కనక కుండలములు
దాల్చి నీలాభ్రాభ తనువు పూని
విల్లు బాణముఁ దాల్చి విద్యుత్తువలె మీరి
గొప్ప దేహము దాల్చి క్రూరుఁ డయ్యె.

అట్లు తనరూపు రావణుం డపుడు దాల్చి
రక్త వసనంబుగట్టి- స్త్రీ రత్నమైన
సీతఁ గని- నీలి పాపిడి చెలఁగి యుండి
అందమగు నగల్ గల యామె కనియె నపుడు. 727

మీరి లోకప్రథితుఁబతిన్ గోరు దేని
త్వరగ నన్జేరు నేనీకుఁ దగిన పతిని
ఇప్పటికినైన నను బొందు మీవు సీత!
నేను నీకెంతొ శ్లాఘ్యుఁడ నైన ప్రియుఁడ. 728

ఎన్నఁడును నీకు విప్రియ మేను జేయ
భద్ర మానుష భావన వదలుమిపుడె
నాయెడల భావమును నిల్పు నయము మీఱ
నేను నీకెంతొ శ్లాఘ్యుఁడ నైన ప్రియుడ. 729

తన రాజ్యంబును బోవఁ గూలఁ బడి సిద్ధార్థుండునుంగాకయే
తనకున్ జావును మూడు రాము నెడ ముగ్ధా పండితమ్మన్య యే
గుణముల్ చూచి సురక్తవై తహహ మూర్ఖుండైన యాతండె గా
ఘన రాజ్యంబు సుహృజ్జనంబు విడి నాగాఢ్యాటవిం గూలెఁ బో 7:0

అని వాక్రుచ్చి ప్రియంవదన్ సతిఁ బ్రియార్హన్ జానకిన్ వే యెదు
ర్కొని కామంధుఁడ యౌచు నాకసమునంగూడన్ బుధుం డల్ల రో
హిణినింబోలె గ్రహించి యప్డెడమచేయే యెత్తి యాచేత జు
ట్టును నూరుల్ కుడిచేతఁ బట్టె నట దుష్టుండౌ నిశాటుం డికన్. 7"1

యముని వలెఁ దీవ్ర దంష్ట్రలు
సమర మహాభుజుఁ డయి గిరి యటు లుండెడి యా
యమురారిని గనుగొని సం
భ్రమమున వనదేవతలును వణఁచిరి భీతిన్. 732

అటు నిఁక మాయామయ మయి
కటు నాదంబులు మొరయఁగ ఖరవాహనమై
పటు హైమ చక్రము లదరఁ
దటుకున రావణు రథంబు దరిఁ గన్పించెన్. 733

విడిపించుకొనఁగ నిటు నటు
పడిగింజుకొని పడు సీతఁ బరుషోక్తులచే
నడలగ నడచుచు రావణుఁ
డొడిలోఁ బొదివి రథమునఁ బరుండఁగఁ ద్రోసెన్. 734

బలిమిని రావణుఁ డప్పుడు
గలియఁగఁ బడి యదిమి పట్టఁ గడువడి వ్యథచే
నలిగి యశస్విని సీత ద
వుల కేగిన రాము! రామ! ప్రోవని యఱచెన్. 735

కామాంధుఁడయి యకామను
పేముఱు లిట్టులు దొర్లు వివశను సీతన్
రాముని పత్నిని త్రాచుం
బామును బలె రావణుండు పట్టుక యెగిరెన్. 736

అటు సీత రావణుని చే
పటుగతిఁ దీసికొని పోవఁ బడుచున్ మింటన్
కటకటఁ బడుచును పిచ్చిది
యటు, మతిచెడి నటు సరోగ యట్టులు నార్చెన్. 737

అకటా! మహాభుజ! లక్ష్మణ!
ప్రకృతిగ నన్నను ప్రసన్న పఱచెడి సౌమ్యా!
ఒక రాక్షసుం డలిగి తీ
సుక పోయెడి నన్నెఱుఁగవు చూడుమి యిపుడే 738

రామా! జీవితము సుఖము
లీ మహి నర్థములు ధర్మకృత్యము కొఱకై
వేమఱు విడు నీవును నను
నీ మెయిని నధర్మముగ హరించుటఁ గనవా? 739

అవినీతుల వంచెడి వాఁ
డవుగద యోశత్రు దమనుఁడా! యిపుడీవున్
భువి నిట్టి పాపకర్ముఁడై
యువు రావణు శిక్ష చేయ్యనెరుదే వేలా! 740

అవినీతుల కర్మకు ఫలము
లవి వెంటనె రాక యున్ని యదనున వచ్చున్
భువిఁ బంటలు పండుటకై
యువు కాలము రావలెఁ గద యదె సాయంబౌ. 741

ఇటు వీఁడు కాల మియ్యది
తటుకున జ్ఞానమును మాపఁ దన్నుక రాఁగా
నిటుఁ బాపము చేసెను ముం
దట రాముని వలనఁ జచ్చు దారుణమునకై. 742

అవుర! యిపుడు కైక సబాం
ధవంబుగాఁ గోర్కె దీరఁ దా ముద మొందున్
భువి ధర్మకామియయి కీ
ర్తి వఱలు రాముసతి యుపహరింపం బడుటన్. 743

నను హరియించె రావణుం డని రామునితో
చెప్పుఁడు పిచ్చిన తేలచెట్టులార!

నను హరియించె రావణుఁ డని రామునితో
నను(ఁడు మాల్యవదాదు లద్రులార!

నను హరియించె రావణుఁ డని రామునితో
ననుఁడు గోదావరీ హంసరార!

నను హరియించె రావణుఁ డని రామునితో
పలుకుఁ డోవన్య దైవతములార

త్వరగఁ జెప్పుఁడు మీకిదే దండ మిడుదు
నో జనస్థానమా! శరణొందు చుంటి
ప్రియుని ప్రాణాలకంటె గరీయ మైన
నను వివశను హరించె రావణుఁడు వినుము 744

ఆ మహాబాహువౌ రాముఁ డధికబలుఁడు
స్వర్గలోకాన నున్నను త్వరగఁ దెచ్చు
యముఁడె తాఁ దీసికొనిపోయి నప్పటికిని
విక్రమించి శీఘ్రముగ రప్పింపఁ గలఁడు, 745

వ. అని యిట్లు సుశ్రోణియు ఆయతలోచనయు నగు సీత కరుణ ఉట్టిపడునట్లు విలపించుచు సుదుఃఖితురాలై చెట్టుపై నున్న గృధ్రమును జూచి రావణువశమునందుండి భయపడు చున్నదై ఇట్లు ఆక్రందించెను. ఓజటాయూ! రావణుండు నన్ను పాపియగు ఈ రాక్షసేంద్రుఁడు అనాథనువలె నెట్లు తీసికొని పోవుచున్నాఁడో ఈ క్రూరుఁడైన నిశాచరుని నీవు ఆపలేవు. ఇతఁడు సత్త్వవంతుఁడు నిర్భయుఁడు దుష్టుఁడు పైఁగా ఆయుధములు ధరించియున్నాఁడు

ఓ జటాయూ! సరిగా రాముని లక్ష్మణునికిని నేను అపహరింపఁబడినట్లు చెప్పుము. 746

సుంత నిద్రించిన జటాయు వంత సీత
యఱపు విని రావణుని సీత నరసి వేగ
వాడి ముక్కుతో కొండంత వాఁడై యైన
యాతడంతట చెట్టుపై నమరి యనియె. 747

ఓరి దశముఖ! తొలి ధర్మ మొంది యుండి
సత్య మగు ప్రతిజ్ఞ కలిగి సరిగ నడచు
నేజటాయువన్, నే గృధ్రరాజుఁ జుమ్మి
గొప్ప వీర్యము గలవాఁడ నిప్పటికిని. 748

దశరథసుతుండు రాముఁ డింద్రవరుణ సముఁ
డఖిల లోకంబునకు రాజు నఖిల హితుఁడు
అట్టివాని ధర్మసతి యీయువతివ సీత
యీమెనే నీవు హరియింప నెంచి నావె. 749

ఎటులన్ రాజయి యున్న ధార్మికుఁడు తా నిట్లన్య భార్యన్ గ్రహిం
చుటకై పూనును, రాజు భార్యఁ గొను టిచ్చోటన్ విశేషించి యెం
తటి యన్యాయము,నన్య భార్యఁ గొనుటల్ ధర్మంబె, నింద్యంబ యా
నటు నేధీరుఁడ చేయు, నన్యసతి భార్యన్ బోలె ప్రోవం దగున్. 750

కలుషాత్ముండవు పాపివిన్ చలుఁడవున్ కష్టుండవా నీవ యె
ట్టులు నైశ్వర్యము నావిమానమును నట్టుల్ పొందినా వొక్కొ యె
ట్టుల నైనన్ భువిఁ గాముకుండు తనయాటోపంబు మానంగ లే
డెటులున్ దుష్టుల యిండ్ల పుణ్య మదియింతే నిల్వఁబో దెప్పుడున్. 751

ధరలో శాస్త్రములందుం జెప్పనివియౌ ధర్మార్థకామంబులన్
వరులౌ శిష్టులు రాజు తెన్నుం దొనరింపంగోర, రాజుచే
వరధర్మంబును నర్థకామములు; పాపంబేన్ శుభంబేని యున్
వరధర్మంబులు రాజుమూలముగనే వర్ధిల్లు లోకంబునన్. 752

పురిలోంగాని స్వదేశమందయిన రాముం డామహావీరుండౌ
వర ధర్మాత్ముంతు వేరికేని యెటులున్ స్వల్పాపరాధంబు నె
త్తతినిన్ జేయండ యట్టివాని కపరాధం బెట్లు గావింతు వా
ఖరుండో శూర్పణఖన్ గుఱించి యతిగాం గ్రాలెన్ జనస్థానిలో. 753

మును కష్టంబులు వేరికే నిడని రాముం డెంచి దుర్వృత్తుండౌ
టను జంపెన్ ఖరు, నిందుం గల్గు నిజ మింతన్ నీవ గుర్తింపు మా
తని భార్యన్ హరియింతు వేమి యిటు లా తండేమి గావించె నా
తని సీతన్ విడు వృత్రు నింద్రుడటు రౌద్రంబౌ దృశన్ గాల్చురా. 754

తనకోరన్ విషమున్న సర్పమును వస్త్రంబందు బంధించియున్
గనకున్నావు మెడనదగెల్చిన యమోగ్రంబైన పాశంబుం గ
న్గాన వేభారము మర్త్యుం జంపదౌ యికను మోయన్ దగుదానినే
తిన రోగంబులు తేకజీర్ణమగు భుక్తిన్ మాత్రమే పొందనా. 755

ఏది గావించిన ధర్మమే యశమే పేరే పొందంగా లేమొ, యు
య్యది యీ మేనికి ఖేదమే, యది యెవం డత్యంతమును జేయు, న
ర్వది వేలేండులు నేను పుట్టి గడచెన్ బైతామహంబైన యె
ల్లధరన్ బాలన చేసితిన్ ద్విజము లెల్లన్ సంతసం బొందంగన్. 756

ముదుకండన్ యువకుండ వీవు రథి, వమ్ముల్ విల్లు చేంబూనిపెన్
గద మీఱన్ గవచంబు దాల్చితివి యైనన్ జానకిన్ క్షేమ మొం
దందగన్ దీసుక వెళ్ళలేవు కనుచుండన్ నేహరింపంగ లే
వదె వీక్షింపుము న్యాయ హేతుల ధ్రువంబౌ వేదముల్ పోలికన్. 757

పెనుశూరుండవన యేని పోరుము క్షణంబే నిల్వు మోరావణా!
మును పే యాఖరుఁ డట్లు చంపఁబడి యీభూమిన్ వడిన్ గూలునె
వ్వనిచే దైత్యులు దానవుల్ రణములోఁ బ్రాప్తించి రోమృత్యు, నా
ఘనుఁడౌ రాముఁడె చేలచీర ధరుఁ డింకన్ వేగ నిన్ జంపులే. 758

ఇపుడే నేమి నినున్ బొనర్పఁగల దక్షో యేగి రారాట్సుతుల్
ఇప్పుడే చత్తువు, వారివల్లను భయంబే వొందినా వెంత మా
త్రపు సందేహము లేద యిందు నిటనేఁ బ్రాణాలతో నుండ బ
ద్మ పలాశాక్షిని రామురాణిని హరింపన్ లేవురా నీచుఁడా! 759

ప్రాణములను సమర్పించి యైన గాని
దశరథునికిని తనయుడౌ దాశరథికి
నేను ప్రియము చేయ వలయు, నిలుము నిలుము
ఓ దశముఖ! రావణ! క్షణ ముండు కనెదు. 760

శక్తియున్నంత వఱకు రాక్షస విభుండ!
సంగరంపు టాతిథ్యము సరిగ నిడెద!
తొడిమ నుండి పండును బోలె తొరగ నిన్ను
ఈ రథోత్తమమునుండి ఈడ్చివైతు. 761

అని జటాయువు పచియింప నాలకించి
యలుకచే నెఱ్ఱవడిన కన్నుల వెలింగి
మేలిమేల్మి బంగరు కుండలాలు కదల
రాక్షసుల రా జుఱికె పక్షిరాజుపైని. 762

వ. అపు డామహావనమున తుఫానుచే నెగురఁ గొట్టఁబడిన మేఘములకు వలె వారిద్దఱకు ఘోరయుద్ధము జరిగెను. ఱెక్కలతోఁ గూడిన మాల్యవత్పర్వతములువలె గృధ్రరాక్షసులు అద్భుతముగా పరస్పరము పోరాడిరి. పిదప వాడి మొనలు గలిగి మహాఘోరము లైన వికర్ణు లగు నాళీకములను బాణములను

మహాబలుఁడైన రాక్షసేంద్రుఁడు గృధ్రరాజుపైని కురిపించెను. ఆ బాణము లన్నిటిని జటాయు వెదుర్కొని వాడిగోళ్ళతోడను కాళ్ళతోడను బాధించుచు రావణుని శరీరమును గాయపఱచుటయు నాతఁడు కాలదండమువలె నున్న ఘోరమైన బాణములను శత్రువు మర్దింపఁ దలఁచి తీసి వంకరలేని యా బాణములచే గృధ్రరాజును భేదించెను. ఆ గృధ్రరాజు కన్నీళ్ళు పెట్టుకొని చూచు జానకి వైపు చూచుచు ఆబాణములను లెక్కపెట్టక రావణునిమీఁదఁ బడి బాణము లెక్కిడి ముత్యాలసరముతో నలంకరింపఁబడియున్న వాని ధనుస్సును విఱుగఁగొట్టెను. అంత రావణుఁడింకొక ధనుస్సు తీసికొని వందలు వేలకొలఁది బాణములను గృధ్రరాజుపై క్రోధమూర్ఛితుఁడై కురిపించెను. 763

బాణములచేతఁ జుట్టుకోఁబడి జటాయు
వపుడు గూటిలోఁ గల పక్షియట్లు దనరె
అంత నాబాణములను వక్షాంతరముల
దులిపి కాళ్ళ విఱిచెఁ దదుజ్జ్వల ధనుస్సు. 764

అగ్ని సమంబైన యారావణధనుసున్
ఘన జటాయువును స్వపక్షముల విఱిచి
బంగారుజీనుల వఱలు పిశాచాస్య
రథఖరములఁ జంపి రయమె యెగిరి
మూఁడు వేణుల కాడిఁ బొలిచి రత్నాలొప్పు
చక్రాలు రథమును సరగ విఱచి
కొమరు చంద్రుని బోలు గొడుగుఁ జామరములు
వహియించు దైత్యులఁ బడఁగఁ ద్రోసి

ముక్కుతో సూతు తలఁగొట్టి భువిని గూల్చ
ధనువు గుఱ్ఱాలు సారథి ధరణిఁ బడఁగ
జానకిని నొడి లోపల సరిగఁ బట్టి
రావణుఁడు భూమిమీఁదను వ్రాలిపడెను. 765

కాలము మూడిన పురుషుఁడు
కూలఁగ నే కర్మ చేయఁ గోరునొ యదియే
చాలఁగఁ జేయును, నీకును
కాలము మూడెను, నధర్మ కర్మ యొనర్తే. 770

ఏ కర్మను పాపం బగు
నా కర్మ నెవండు చేయు, నమరేశుండున్
ఆ కర్మ ఫలం బొందును
ఆ కర్మ ఫలము స్వయంభు పైనను పొందున్. 771

అనుచు జటాయువు శుభముగ
నని యారావణుని వీపు నంతటఁ బడుచున్
కని, దుష్ట కరిని మావటి
యనువున రావణుని - గోళ్ళ నంతయుఁ జీల్చెన్. 772

నఖ పక్ష ముఖాయుధుఁ
డఖిలాంగము రావణు నిది యటు చీల్చుచు నా
నఖముల వాని శిరస్సును
నిఖిలము కేశములఁ గూడ నిలువునఁ బీకెన్. 773

అటు మాటి మాటికిఁ గడున్
జటాయు వపుడు వ్యథ పెట్టఁ జకితుం డగుచున్
కటకటఁ బడి పెదవి యదర
నట రావణుఁడు ప్రకంపమ్ముందుచు వడకెన్. 774

ఆతఁ డెడమ యొడిని సీత నదిమి పట్టి
క్రోధమున నొడలెఱుఁగక మీఁద కెగిరి
దరి జటాయువు నఱచేతఁ జఱచి కొట్ట
నపు డెదుర్కొనె జటాయు వధికశక్తి. 775

వడి నెదుర్కొని రావణు నెడమ భుజము
నాజటాయువు ముక్కుతో నపుడు కొఱుక
తెగిన చేతులు దైత్యు దేహమందు
పుట్టనుండి జ్వాలల పాము లట్టు మొలిచె. 776

పిదవన్ రోషముతోడ రావణుఁడు పృథ్విన్ జానకిన్ దింపి యా
యదనన్ ముష్టులతోడ పాదములతో నాగృధ్రరాజున్ వడి
వదె కొట్టంగ నటన్ మహాబలులెయౌ పక్షీంద్ర దైత్యేంద్రు లే
పు దలిర్పన్ పొనరించి రాజి నటులా మూర్తంబు ఘోరంబుగన్. 777

అటులన్ రామునికై మహారణము చేయున్ జూచి యారావణుం
డట గృధ్రేంద్రుని వక్షముల్ చరణముల్ ప్రాంతాల్ విజృంభించి యు
ద్భటుఁడై ఖడ్గము నెత్తి నిర్దయత రౌద్రం బొప్ప భేదింప న
క్కట! పాపంబు జటాయు వుర్విఁ బడె శృంగం బట్లు స్వల్పాయువై –
778

క్షితిపై నెత్తుటఁ దడ్సి కూలిన విహంగేంద్రున్ స్వబంధున్ బలెన్
వెత పొంగన్ పరువెత్తి సీత దరియన్, నీలాభ్రముం బోలునా
సితవక్షస్కు నుదార వీర్యుని పరిక్షీణున్ జటాయున్ ధరా
స్థితుఁ జల్లంబడు నా దవానలపు ఛాతిన్ రావణుఁడుం గనెన్. 779

అటు రావణుండు కొట్టఁగ
తటుకున నేలంబడిన యుదారచరిత ను
ద్భట వీర్యు జటాయువుఁ గౌ
గిటఁ గ్రుచ్చి శశిముఖి సీత కెవ్వన నేడ్చెన్. 780

గురుతులు, స్వప్నము శకుని
స్వర దర్శనములు నరులకు సౌఖ్యము దుఃఖం
బెఱుఁగం జేయు నిమిత్తము
లిరవుగ నివి యుండుట కనిపించును మనకున్. 781

నను నపహరించు నెవ్వఁడో
యని మృగములు పక్షులు వని నటు పరువెత్తెన్
కన వీసూచన రామా!
నను హరియించెడి వ్యసనము నమరె నటంచున్. 782

ఘనపాపి రావణుని బా
రినుండి నను గాచుట కయి ధృతితో మిగులన్
రణ మొనరిచి మ దభాగ్యం
బుననె జటాయువు క్షతుఁ డయి భువిఁ బడి యుండెన్. 783

నను రామ! లక్ష్మణ! త్వరగ
చనుదెంచియు బ్రోవుఁ డనుచు జానకి సరసాం
గన మిగుల భీతి నొందుచు
వినువారికి దరి వినఁబడ విలపించెఁ గడున్. 784

నలిగిన పూవులు చెదరిన
పలు భూషలును జనకజ యవస్థను దెలుపన్
పలుగతి విలపించెడి యా
వెలఁది వయిపు రావణుండు వెసఁ బరువెత్తెన్. 785

నునుఁదీవెవోలెఁ జెట్టుల
బెనవేసికొనుచును బట్టి విడువని సీతన్
కని రాక్షసాధిపుఁడు రా
వణుండు విడు విడు మని కడువడిగా నఱచెన్. 786

జనశూన్యం బైన వనం
బున రామా! రామ! యనుచుఁ బొగిలెడి సీతన్
తనమృత్యువున కయి గ్రహిం
చెను జుట్టును, యముని బోలి చెడు రావణుఁడున్. 787

అటు సీత పట్టుకొనఁబడ
నటనిట సచరాచర మగు నఖిల జగంబున్
ఎటులును తన హద్దు విడిచి
పటుతర మగు నంధతమస వార్ధిని మునిఁగెన్. 788

పవనమువీచదు, వెలుఁగఁడు
రవి, యతిదీనయయి సీత గ్రహియింపఁబడెన్
భువి దివ్యదృష్టిని స్వయం
భువు చూచి మన పనితీఱెఁ బూర్తిగననియెన్. 789

అటు సీత పట్టుకొనఁబడ
నట దండకవనిని నున్న యఖిల మహర్షుల్
అటు రావణుని వినాశము
తటుకునరాఁ గనిరి ముదముఁ దదుపరి వ్యథయున్. 790

రామా! రామా! లక్ష్మణ!
యోముఁడు నన్ననుచు నేడ్చు నువిదను సీతన్
ఆమోసపు రావణుఁడును
వేమింటికిఁ దీసికొనుచు వెడలెను త్వరగా. 791

పుటములు వేసిన బంగా
రటు మెయి రంగు గలిగి, పసుపగు కౌశేయం
బిటఁ దాల్చిన రాజాత్మజ
చటులంబగు మెఱుపువోలెఁ జక్కగఁ దనరెన్. 792

ఎగురు పసుపు సతివలువం
దగి రావణుఁ డగ్నిఁ దనరు నగ మటు లెసఁగెన్
మిగులన్ శుచి జానకి సిగ
తొగఱేకులు రావణు మెయిఁ దూర్ణము రాలెన్. 793

చదలం దెగిరిన బంగరు
ముది రంగు గలిగిన సీత పుట్టము వఱలెన్
చదలున సంజను సూర్యుని
ముది రంగులచే నెఱుపగు స్ఫుట మేఘ మటుల్. 794

సురుచిర నాసిక గల సుం
దరి మోము భ్రమమున రావణాసురు నొడిలో
వఱలదు రాముండు లేమిని
నెఱి తామర తూడు లేని నీరజ మటులన్. 795

నీలంబౌ జలదంబును
జీలుచుకొని వచ్చెడి సరసేందుని బోలెన్
నీలి కురుల మధ్యమమున
లీలఁ గనుల గర్భ మటు వెలిగి నుదు రలరున్. 796

తెలుపై విమలంబయి ప్రభఁ
జిలికెడి నెఱి పళ్ళ పరుసచేతను మిగులన్
జెలుపై జానకి వదన
మ్మల మింటను రావణాంకమందుఁ దనర్చెన్. 797

నునుమంచు నోనఁ బ్రియుద
ర్శన మగు చంద్రుడువలె నశ్రులఁ దగు సతి యా
ననము సునాసికమై యె
ఱ్ఱని మోవి గలిగి పసిఁడి రంగుల వఱలున్. 798

రావణు భయమున వణఁకెడి
యాపెలఁది ముఖంబు రాముఁ డట నుండమిచే
నేవిధి రాజిలదు, పగలు
నావిమలేందువు ప్రకాశ ముండని యట్టుల్. 799

పసిడి మిసిమి గల జానకి
అసితుఁడు రావణుని యాశ్రయంబున నుండన్
అసిత మణి నాశ్రయించిన
పసిఁడి మిసిమి కాంతివోలె వఱలెను నచటన్. 800

నళినమువలె గౌరం బయి
చెలువు పసిఁడి మిసిమి గలిగి చెలు వగు నగలన్
పొలిచెను జానకి, మెఱుపది
జలదముఁ బొందిన సరణిని క్ష్మాతలిలోనన్. 801

తరువుల చివురుల నెఱుపగు
వరవర్ణిని సీత నీల వర్ణుని నసురున్
నెఱ బంగరు గొలుసది
వర గజమునువలె ప్రకాశపఱచెను నచటన్. 802

యోషామణి సీత నగల
ఘోషముతో రావణుండు కూడితనర్చెన్
ఘోషిలు నుఱుముల నీలపు
వేషంబున దనరు మబ్బువిధి నావేశన్. 803

హరియింపంబడు వేళ జానకి శిరంబందుండి నల్వైపులన్
విరివానల్ ధరణిన్ బడెన్, విరుల యావృష్టుల్ వడిన్ రావణా
సురు డేగన్ నలువైపులం దెగురుచున్ శోభల్ వెదంజల్లుచున్
మరలన్ రావణుడగ్గరన్ వడిఁ బడెన్ బ్రాప్తించు వాయూర్ధ్వతిన్. 804

విమలంబై తగు నక్ష
త్రమాల యెత్తైన మేరుధరణి ధర పా
ర్శ్వములన్ దిరిగెడి రీతిని
సుమధారయు రావణునికిఁ జుట్టు భ్రమించెన్. 805

జనకజ చరణము సుండియొ
మఱి భూషిత నూపురంబు మఱి జాఱినదై
నునుమెఱపుల మండలమో
యన మెఱసి మధుర నినాద మలరఁగఁ బడియెన్. 806

చదళను మహోల్క పోలికఁ
దదీయ తేజస్సుచేతఁ దగ దీప్తంబౌ
సుదతిని వడి రావణుడో
చదలం దీసికొని పోయె సత్వరముగనే. 807

అనలంపు రంగు గలిగిన
జనకజ భూషణము లుర్విఁ జరచర పడుచున్
నినదముచేసెను పుణ్యం
బణంగ నాకసమునుండి పడు పుణ్యులటుల్. 808

జనకజ స్తనాంతరము నుం
డి నిండుచందురుని బోలి లీలం బడి జా
రిన హార మాకసము నుం
డి నేలకును జాఱు గంగ లీలఁ దనర్చెన్. 809

క్షితి నుత్పాత పవన విని
హతమై నానాద్విజాలి నలరుచు వాతా
హతి ధూతాగ్రములై తగె
క్షితిరుహములు వెఱవకుఁ డని చెప్పెడి రీ 810

కమలంబు లెండి పోవ, భ
యము పడిమత్స్యములు జలచరాదులు పోవన్
తమప్రాణము వీడిన వయి
విమల సరసులు సఖిఁ బోలెవెత సీత గనెన్, 811

నలు గడలనుండి వచ్చియుఁ
బులులును సింహములును మృగములు పక్షులు న
ట్టుల ఛాయం బట్టి వగచే
నల సీతను ననుసరించి యటె పరువె త్తెన్. 812

జలపాతము లశ్రు లురల
చెలువగు శిఖరము లనియెడి చేతులు పైకిన్
నిలిపి గిరులు నేడ్చెడి యవి
వలెఁ దనరె రావణుఁడు సీతఁ బట్టిన వేళన్. 813

జనకజ నీడ్చి కొనుచును
చనువేళను జూచి రవియు జాలిని పడుచున్
తనప్రభయు తగ్గిపోవగ
చని పాండుర మండలుఁ డయి జలధిం బడియెన్. 814

ఇట్లు రాము భార్య సీతను
నటు రావణు డీడ్చుకొనుచు నరిగెను గాదా
ఇట నింక ధర్మము లే, దెది
యిట సత్యము, ఋజుత లేద యనృశంసతయున్. 815

అని సర్వ భూత గణములు
కని యేడ్వఁగ దీనమౌ ముఖంబులఁ జిఱులే
ళ్ళను జూచి చూచి కన్నీ
ళ్ళను దృష్టియును జెడిపో విలాపము చేసెన్. 816

అటువంటి యవస్థను గని
యటు బారు మనుచును నేడ్చు నా పై దేహిన్
అటుల వడఁకు నొడలితో
నట వనదేవతలు స్థాణులై రి వనానన్. 817

ఇక హా! లక్ష్మణ రామ! రామ! యని జాలేపారు కంఠంబుతో
వికలంబౌ మదితో ధరిత్రి తలమున్ వేమార్లు వీక్షించుచున్
మొకమున్ బాపిడ, బొట్టుజుట్టు నొకటై పోఁ బిచ్చిదై పోవు జా
నకి నా మానిని నాత్మనాశనమున కంతన్ రావణుండీడిచెన్. 818

సుదతి శుచిస్మిత జానకి
స్వదయితుఁడు మఱంది మొదలు బంధులులేమిన్
స్వదయితు రాముని లక్ష్మణుఁ
బిదపఁ గనక భయము పొంది వెలవెలపోయెన్. 819

వ. అట్లు పాఱుచు నాకసముపైకి నెగురుచున్న యారావణుని జూచి జానకి దుఃఖితురాలై మహాభయము నొంది రోషరోదనములచే నెఱ్ఱపడిన కండ్లతో భయంకర రాక్షులు గల రావణునిచే నటు తీసికొని వెళ్ళఁబడుచు కరుణముతో నేడ్చుచు నిట్లనెను. 820

మఱఁదియుఁ బతిలేని సమయ
మెఱిఁగి నను హరించి పరువులిడి నీచా! యీ
దురితంపుఁ గర్మమును నా
చరించుచును సిగ్గుపొంది చావ విదేరా! 821

నను దొంగిలింపఁ దలచియె
మఱఁగి పిఱికి పందవగుచు మాయామృగమున్
పనిపియు నాపతి దవ్వగఁ
జనునట్టుల నిజముగఖల! సలిపితివీవే. 822

ననుఁగావఁగ వచ్చిన యి
య్యనఘుని మామామ సఖుని నతిగా వృద్ధున్
ఘను గృధ్రపతి జటాయువు
వినుతుని బడఁగొట్టి సిగ్గు విడిచితివిపైఁగా. 823

కనిపించుచు నున్నది నీ
ఘనవీర్యము నేనె యింతఘనుఁడ నటంచున్.
వినిపించితి విట నీపే
రును, నన్ను జయించితివిర క్రూరరణోర్విన్. 824

ఇంతటి యసహ్య కర్మను
చెంతనె గావించి సిగు చెంద వదేరా!
చెంత నెవరు లేమిని పరు
నింతిని నేకాకినిని హరింతువు నీచా! 825

శూరుఁడ నని తలఁచెడి నీ
వీరత క్రౌర్యము నధర్మవికృతపుఁ గర్మన్
ఆరసి లోకంబున నీ
పౌరుషమును జెప్పుకొంద్రు పూర్తిగఁ బురుషుల్. 826

మొదటనె వచించు కొంటివి
గదరా నీశౌర్యము బల ఘనతయు ఛీ! ఛీ!
విదిత కుల నింద్య మిట్టిది
త్వదీయ చారిత్ర్య ఘనత ప్రకటం బయ్యెన్. 827

ఇట వేగంబుగఁ బరువిడి
యిటు పాఱుటె గాక శక్య మెయ్యది నీకౌ
ఇట శూరుఁడ వైతే నొక
త్రుటి నిలునిలు మిట నుసురులతోఁ జనవింకన్ 828

ఇదె యానృప సుతుల కనుల
యెదుటం బడి సైన్యముండి యేనియు త్రుటియేన్
బ్రదుకం జాలవురా! యో
మెధవా! రావణ! నిలవర! పిఱికీ! నీచా! 829

దుర్నివారోగ్ర పాశ బద్ధుండవైతి
శుద్ధు నాపతిన్ బాధించి సఖుఁడ వౌదె
భ్రాత సాయంబు లేకయే పదియు నాల్గు
వేవు రసురుల త్రుటిఁ జంపె నావిభుండు. 834

అట్టి సర్వాస్త్ర నిపుణుండు నామహాత్ముఁ
డెంతొ బలశాలి రాముఁడు నిష్టభార్య
నెత్తుకొని పోవు నిన్నింక నెంతొ వాడి
బాణముల నిట్టె వధియించి వైవ కున్నె. 835

వ. ఈవిధముగను ఇంక నితర విధములుగను పరుషముగఁ బలుకుచు రావణు నొడియందు నిటు నటు గింజుకొనుచు నుండి దీనముగా విలపింపఁ బాపాత్ముఁ డైన యారాక్షసాధిపతి రావణుడు వణకిపోవుచు గింజుకొని తప్పించుకొనఁజూచు నాజానకిని అపహరించుకొని పోవుచుండెను. 836

ఇట్లు సీతను రావణుం డీడ్చుకొనుచు
పోవుచుండ నేనాథుని పొంద కపుడు
అవని గిరి శృంగమందున్న యయిదుగురను
వానర శ్రేష్ఠులను జూచె వనిత సీత. 837

అవిశాలాక్షి జానకి యపుడు పసిఁడి
పట్టు టుత్తరీయము శుభాభరణములను
వారి మధ్యను బడవైచె వారు తనదు
నెలవు రామునికి వచింపఁ గల రటంచు. 838

ఉత్తరీయము దీసి యాయుత్తరీయ
మందు భూషణములఁ గట్టి యవని వైవ
జానకిని దీసికొని పోవు సంభ్రమమున
రావణుఁ డెఱుంగఁ డానగల్ వైచు టేమి. 839

వసువుఁ గన్నులు గల్గిన వానరులును
శ్రవణముల దాఁకఁ గనులున్న ప్రమద సీత
అటులు రామ! లక్ష్మణ! యని యార్వఁ గనిరి
తెప్పపాటు వేయని కన్ను లప్పగించి. 840

అటఁ బంపాసర స్సెల్ల దాటి తొరగా నాలంకపై పేగి యం
దటు రోదించెడి సీత మృత్యువయి రా నానందమున్ బొందుచున్
పటుదంష్ట్రిన్ విష మున్న పామునుబలెన్ పై శంబ యుత్సంగమం
దటులన్ దాలిచి రావణుం డరిగె నత్యంతంబు కంగారుగా. 841

ధనుసందుండియె వేయఁగాఁ బడిన రౌద్రం బైన బాణం బటుల్
వనముల్ శైలములున్ నదుల్ సరసు లభ్రంపుం బథిన్ దాటుచున్
ఘన నక్రాలు తిముల్ తనర్ప వరుణాకారంబుగా నున్న వా
ర్ధిని నారావణుఁడున్ దరించుతఱి నూర్మి స్ఫూర్తి మీల్ మ్రాన్పడెన్. 842

చదల సంచరించెడి సిద్ధ చారణులును
నేటితో రావణు బ్రదుకు నిండె ననిరి
అట్లు దొర్లు సీతను రావణాసురుండు
ఒడిని నుంచుకొనియు లంక వడిగఁ జొచ్చె. 843

బాగుగ విభజించిన రాచబాట లొప్పు
లంకఁ జొచ్చి పలు కక్ష్యలను జెలంగు
అంతిపురిలోన శోక మోహముల మున్గు
నీలి క్రీఁగంటి సీతతో వ్రాలి యపుడు. 844

అచట మయుఁడు మాయా లతాంగి నట్లు
రావణుం డుంచి ఘోరదర్శనము గలుగు
నా పిశాచాంగనలతోడ ననియె "నీ మెఁ
బురుషుఁ డింతయే నాజ్ఞలే కరయురాదు. 845

ముత్యములు, మణులు, పసిండి, పుట్టములును
నగలు నెవి యెప్పు డీమెయు మిగులఁ గోరు
నవ్వి యపుడె యీమెకు నాదు నాజ్ఞఁ బట్టి
ఇవ్వవలయును జూఁడి యని యెఱుఁగఁ జెప్పె. 846

ఎవతె యైనను నీమె కనిష్టమైన
దేది యైన నెఱింగియొ యెఱుఁగలేకొ
యన్నచో నామెజీవిత మంతతోనె
ప్రియము గాకుండ మేనిని వీడిపోవు". 847

అనుచుఁ గట్టడి చేసి వీర్యంబు గలుగు
రావణుఁడు నంతిపురినుండి రయమ యేగి
ఇంక నేమి చేయవలయు నిప్పు డనుచు
మాంసభుజుల వీరుల నెనమండ్రఁ జూచి. 848

రావణుండు వరదాన గర్వమున మీరి
వారిని ప్రశంస గావించి పలికె నిట్లు
వివిధ శాస్త్రాలఁ గైకొని వేగ మున్న
ఖరుఁడె యున్న జనస్థాన మరుగుఁ డిపుడె. 849

సరె హితస్థానమౌ జనస్థానమందు
పౌరుష బలంబు పొంది యేభయములేక
యుండుఁ, డట మున్ను ఖర దూషణోగ్రబలము
లుండె నవి రాముఁ డమ్ముల నుక్కడించె. 850

అందుచేత రోషమున ధైర్యంబు పూన
నిపుడ కోపంబు హెచ్చె, నాకింక నెంతొ
ప్రబల వైరాగ్ని రామునిపైని రగిలె
దీనిఁ దీర్చినఁ గాని నిద్రింపఁజుండి. 851

ఖరుని దూషణుఁ జంపిన ఖలుని రాముఁ
జంపి నప్పుడె సౌఖ్యము శాంతిఁ గాంతు
నిర్ధనుండు ధనంబుల నిండుగాను
పొంది సౌఖ్యము, శాంతిని పొందునట్లు. 852

ఆ జనస్థానమున నిల్చి యంద ఱిపుడు
రాముఁ డెపుడేమి చేయునో ప్రకటరీతి
సరిగఁ దెల్సికొనుచు వాని సకలవృత్తి
యెప్పటి కపుడె నాకు పంపింప వలయు. 853

మీనిశాచరు లందఱు నే నిమేష
మింతయుఁ బ్రమాద మొందక యెసఁగవలయు
అన్ని విధముల రామ వధార్థ మింక
పూర్ణ యత్నంబు గావింపఁ బూనవలయు. 854

రణములోఁ బల్మఱులు మీబలంబుఁ గంటిఁ
గనుక నిపుడ జనస్థానమునకు మిమ్ము
చన నియోగింతు ననఁ గామచరులు వారు
మ్రొక్కి యాజనస్థానంబు పొందఁ జనిరి. 855

అతఁడిని రావణుఁ డిఁక సీత తనకు
దక్కె నని యెంచి హర్షమోదములఁ బొంది
హెచ్చి రాముతో వైరముఁ దెచ్చికొనియు
మోహమున హర్ష మొందుచు మోద మొందె. 856

అట్లు ఘోరు లైన యెనమండ్రు రాక్షసులకుఁ జెప్పి రావణుఁడు బుద్ధి
ానతచేత తన్నుఁ గృతకృత్యునిగా ననుకొని సీతనే తలఁచుకొని కామబాణ
ాతుఁ డయి సీతను జూడఁ దొందర పడి తనరమ్య గృహమును ప్రవేశించెను.
857

ఆచట రాక్షస భామినులావరింపఁ
గూరుచుండి శోకముచేతఁ గుములుచుండి
దీనయై యశ్రువులు మోముపైని గాఱ
నేడ్చు సీతను రావణుం డేగి చూచె. 858

వనధి గాలి తుఫానులోఁ బడి మునుంగు
పడవవలెను, లేళ్ళకదుపుల నడిమి నుండి
విడియుఁ గుక్కల మధ్యను బడిన లేడి
వలె నధోముఖి యగు సీత నసుర దరిసె. 859

అటు దరిసి శోక దీనయై యవశ యగుచు
నేడ్చు సీతకు దేవతా గృహమువంటి
తనదు భవనంబును బలవంతంబుతోడ
రావణాసురుఁ డటఁ జూపె రయముఁ గానె.  860

వేలకొలఁది స్త్రీల బెంపారు హర్మ్యాలఁ
ప్రాసాద సీమలఁ బ్రబలి యుండి
వివిధ పక్షులతోడ వెల గల మణులతో
నింపారి సౌందర్య మీను చుండి.
పసిఁడివై వెండివై వజ్ర వైడూర్యమై
స్ఫటికమౌ స్తంభాల వఱలియుండి
దివ్య దుందుభి రవ శ్రావ్యమై కనక తో
రణములఁ బైఁడి మెట్లను వెలింగి

దంత రజత గవాక్షాల దళుకు లొప్పు
పసిడి జాలాల చేతను భద్రమగుచు
మణి సుధా చిత్ర భూభాగ మహితమైన
స్వగృహ మెక్కించి సీతకున్ బలిమిఁ జూపె 861

దిగుడు బావుల గొలకుల దెసలఁ దరుల
నెల్ల రావణుం డటు సుశ్రిక్కి ఏడ్చు సీత
కపుడు చూపి పాపాత్ముఁడై యామె నెంతొ
క్షోభ పెట్టఁ దలఁచి యనెఁ గ్రూరు డపుడు 362

ఈ సమస్త రాజ్యపు తంత్ర మెల్ల నింక
నాదు జీవిత మిదియు నీ మీఁద నెపుడు
నెంతొ యాధారపడి యుండె నీవ నాకు
బ్రదుకు కంటె శ్రేష్ఠవు విశాలాక్షి! వినుము. 363

నేఁ బరిగ్రహించిన పలు నిపుణ సతులు
వేవురకు నీవు రాణివై వెలయు దిపుడె
నాకు భార్యవై కమ్ము యింతకు మించి
వేఱు తలఁపు మానుము ప్రియ! వినుము మేలు. 364

నేను చెప్పిన వాక్యంబు నీవ యిపుడె
ఆలకించి యిష్టము చూపు మతివ మిన్న
పన్ను పొందుము కామ సంతాప మొందు
నాయెడ ననుగ్రహము చూప నర్హ మింక. 365

వారినిధి చేత జుట్టఁగాబడియు నూరు
యోజనంబులు గల లంక నుర్విలోన
నింద్రుతో దేవ రాక్షసు లెత్తి వచ్చి
గూడ నెదురింపఁ జాలరు చూడు నీవ. 366

సుర గంధర్వుల లోఁ గి
న్నర యక్షులలో విహగ గణంబుల లోనన్
అరయను జుమ్మీ నాతో
పరాక్రమమున సరియైన వాఁడు జగాలన్. 367

క్షితి రాజ్య భ్రష్టుండై
యతి దీనుండై గతాయువై తాపసుఁడై
మతి హీనుఁ డల్పతేజుఁ డ
యి తనరు రామ నరుతోడ నే మొనరింతే. 868

నన్నొందు పిఠిక దానా !
యెన్నందగు పతిని, నీకు నెంతయు సముఁడన్
ఎన్నాళ్ళో వయు సుండదు,
నన్నుం గని యిట విహరింపు నాతో సీతా. 869

వరముఖి ! నీకఁక రాముని
నరయుదు నను బుద్ధె వదలు నాత్మను సీతా !
అరుదేరం గల నిట కని
పరికించియుఁ గోరు శక్తి వానిఁకిఁ గలదే. 870

మిగుల జవము గల గాలిని
గగనమునం ద్రాళ్ళచేతఁ గట్టం గలరే
భగభగ మండెడి యనలపు
సిగను గ్రహించుటకుఁ గాని చేవయుఁ గలదే.

వరతను! ముల్లోకములం
దరయను నటువంటి వీరు నాలోచింపన్
మణి యెవడైతే మద్భుజ
పరిరక్షిత నిను హరించు బలమున నుండున్. 87

లంక గల మహారాజ్యము
కొంకక పాలింపు మీవు కువలయనేత్రా!
కింకరులె యగుచు మముఁబోల్
లెంకలు సురలు స్థిరచరులు లీలన్ గొలుతుర్. 873

ధర్మలోపంబు వల్ల నుత్పన్న మైన
సిగ్గు పొందుట వీడుము సీత! యింక
దేవి! యీస్నేహ సంబంధమౌ వివాహ
మార్షమే సుమ్ము యిఁక సంశయంబు పడకు. 879

ఈ పరస్పర ప్రేమచే నింపు మీఱు
నీపదంబులు నాశిరో నిచయ పాళిఁ
బీడితం బౌత,నన్దయఁ జూడు మిపుడె
పత్యుఁడను నీకు దాసుఁడఁ బ్రమద! సీత! 880

కాముచేఁ దపింపఁ బడి యాకరణి నేను
చిత్త శూన్యుఁడ నౌచును జెప్పుచుంటి
రావణుం డెప్పుడైన శిరస్సు వంచి
యేవనితకును నమస్కరింప లేదు. 881

రావణుఁడు సీతతోడుత
నీవిధముగఁ బల్కి యముని కిటులన్ వశమై
"ఈవైదేహి యిపుడు నా
కే వశమగు నీమె నాదె యిఁక నని తలఁచెన్." 882

అని రావణుఁ డన జానకి
మనమున నిసుమంత భీతి మసలఁగ నీకన్
తృణ మడ్డుంచి తృణముతో
ననినటు రావణునితోడ ననియెను నార్తిన్. 883

---

* పూర్వము ఋషులు ఎనిమిది విధములగు వివాహములు చెప్పిరి.అందు రాక్షస వివాహ మొకటి. ఋషులు చెప్పిరిగాన ఆర్షము. కాని ఈ రాక్షస వివాహము ధర్మవిరుద్ధమైనదని ఆ ఋషులె చెప్పిరి.

మింటినుండి చంద్రు భువికి గెంటువాఁడె
గెంటియును మంటఁ గలిపెడి యొంటి ఘనుఁడె
చేరి సంద్రము నెండింపఁ జేయువాఁడె
జానకిని విడిపించురా సరిగ నెఱుఁగు. 890

నీకు నాయువు మూడెను శ్రీ కడంటె
బలము పోయెను నింద్రియంబులు నడంగె
నిన్నుఁబట్టియె యీలంక నేలఁ గూలి
విధవరా లయి పోవురా వేగ తెలియు. 891

ఈవు పతినుండి విడఁ దీసి యిటకు నన్ను
నీడ్చుకొని వచ్చితివి గాన నింక నీవు
చేసినట్టి యీపాపమ్ము చెడుగ! భావి
కాలమున సుఖంబును గూర్చఁ గలుగ దెపుడు. 892

మరఁదితోఁ గూడి నాభర్త మహితతేజుఁ
డభయుఁడై వీర్యమున శూన్య మైన యుగ్ర
దండకాటవి నుండె; నాత్మండె నీదు
బలము గర్వము పొగరును బాపు వనిని. 893

ప్రాణికి వినాశ కాలంబు వచ్చి నప్పుడు
కలుగు విపరీతబుద్ధి రాక్షసుఁడ!-యధముఁడ!
నన్ను నీడ్చితి, వచ్చె వినాశ వేళ
పురికి రాక్షసులకు నంతిపురికి నీకు. 894

ద్విజుల మంత్రాల పూతమై వెలసి స్రుక్కు
స్రువము మొదలుగా భాండాల సొంపు నింపు
యజ్ఞ మధ్యస్థ వేదిక నంటి పాడు
చేయు ఛండాలునికి శక్యమై యదెట్లు. 895

ఇటుల ధర్మనిత్యుం డయి యనఘుం డైన
రాముః ధర్మపత్నిని ప్రతివ్రతను నన్ను
రాక్షసాధమః పాపి దురాత్ముం డైన
నీకు శోక శక్యమె దుష్ట నీచః భువిని. 8:6

రాజ హంసతోం దమ్మి కొలంకు లందు
ప్రమద మొప్పార విహరించు రాజహంసి
గడ్డి దుబ్బులం దగు నీరుకాకి నెప్పు
డైన గండ్లతోం గాంచునే యరసికొనర 897

చేతనయె లేని యీ మేనిం జెనంటి నీవు
ఇంక బంధింపు లేక భక్షింపు మైతె
ఈ తనువు జీవితమ్ము రక్షింపం గోర
జానకి యసతియను నింద సైపం జాల. 898

అని యలుకను సీత పరుష మైన మాట
రావణునితో వచించి మారాడకుండ
అపుడు పరుషమై గగుర్పాటు లందం జేయు
సీత నుడి రావణుండు విని చెప్పె నుతిమి. 899

సీత! నామాట విను సుహాసిని! లతాంగి!
కడకు పండ్రెండు నెలలలోం గనుక నన్ను
పడయకున్నచో నిన్ను వంటవాండ్రు
చలిదికై ముక్కలుగం గోయంగలరు వింటె. 900

వ. అని రావణుండు పరుషముగాం బల్కి క్రుద్ధుండై రాక్షస స్త్రీలతో నిట్లనెను. "రాక్షస స్త్రీ లారా! మీరు శీఘ్రముగా వికృతాకారలై ఘోర రూపంబు దాల్చి మాంస శోణితములను దినుచున్నవారై ఈమెపొగరుపోగొట్టు దురుగాక" అని యనంగా, ఆ రావణుని మాటవలన వారు అంజలిపట్టి

ఘోరాకారలై సీతను చుట్టుముట్టిరి. మఱియు ఆ ఘోరాకారుడయిన రావణుఁడు కాళ్ళు నేలపై చఱచి భూమిని బ్రద్దలు కొట్టువాఁడువలెనయి నట్లు పలికెను. మీర లీమె నిక్కడ నుండి గూఢముగా అశోకవనమునకుఁ దీసి కొని పోయి తర్జనలతోను మరల సాంత్వవాక్యములతోను అడవి యేనుగును వలె వశ పఱచుఁడు" అని రావణుఁడు ఆజ్ఞాపింప వారు జానకిని పట్టుకొని సర్వ కామములు ఇచ్చు పండ్లుకలిగి నానావిధపుష్పములలో నొప్పి సర్వకాలము లందు మదించిన పక్షులతో నిండియున్న యశోకవనమునకుఁ బోయిరి. 901

అట నాజానకి పాప మార్తయయి దైత్యస్త్రీ వశంబౌచు న
క్కట! వ్యాఘ్రీ వశమైన లేడివలె శోకగ్రస్తయై పాశసం
కట బద్ధాత్మయె యైన లేడివలె సౌఖ్యం బొంద కేమాత్ర మం
తట భర్తన్ స్మరియించు చుండె వ్యథఁ దన్యంబె పోవన్ మదిన్. 902

—: రాముఁడు పర్ణశాలకు బయలుదేఱుట :—

మృగరూపం గొని కామరూపి యగు మారీచున్ వధిం జంప సీ
తఁ గనం గోరిక జాల తొందరగ నంతన్ రాముఁ డేతెంచు చూ
డఁగ పృష్ఠంబున వక్క దారుణముగన్ బల్మాఱు గూయంగ మై
గగురుంపాటును పొంది దుశ్శకునమేగా యంచు శంకన్ గనెన్. 903

అసురుల్ సీతను జంపియున్ దినరుగా యాసీత క్షేమంబుగా
నసువుల్ దాలిచి యుండునే గద, మదీయుంబౌ స్వరం బూనియున్
వెస మారీచుఁడె యార్వ లక్ష్మణుఁ డికన్ వేగంబ యాలించి యే
యున లాసీతను వీడి, సీత వడిఁ ద్రోయన్ రాఁడుగా యిట్టులన్ 904

ఎక్కువ యశుభంబులె కనిపించుచుండె
జనకపుత్త్రిని సీత జీవనము లుండ
బూర్తిగఁ గనఁగలమె, మృగములును నక్క
కూయు, రాత్రిపుత్త్రి కగునె శుభము. 911

ఇదిగొ మృగ మట్లు కనిపించి యెంతొ లోభ
పెట్టి దవ్వుగ ననుదెచ్చె, బిట్టు శ్రమను
ఎటులొ హతుఁ డయ్యె రాక్షసుం డితఁడు చూడు
వాడు నింకఁ జంపఁ బడినవాఁడె యయ్యె. 912

నామనసు దీనమై హర్ష మేమి గనదు
ఎడమ కన్నె యదురుచును నిడును వికృతి
జానకియొ ! యుండ దనుజ ! నిస్సంశయముగ
దొంగిలిరొ చంపిరొ లేక త్రోవఁ గలదొ. 813

—: రాముఁడు లక్ష్మణుని జూచి సీత నడుగుట :—

వ. సీత లేకుండ దీనుఁడై వచ్చి చిత్తశూన్యుఁడై యున్న లక్ష్మణుని
జూచి ధర్మాత్ముఁడైన రాము డిట్లు అడిగెను. 914

దండకాటవి కేనుతరల నెవ్వతె వచ్చె
నేమెను విడివచ్చి తామె యేది
భ్రష్టరాజ్యుఁడ నౌచు వడిదండకకు రాఁగ
నాపద సాయమౌ నామె యేది

ఎన్నటై లేకుండ నేను క్షణంబేని
బ్రదుకఁగోరనా యట్టి ప్రమదయేది
అమరకాంతను బోలి యందాలనీనుచుఁ
బ్రాణసహాయయౌ నబలయేది.

అట్టికనకాంగి జానకి నరయుకుండ
నింద్ర రాజ్యమేన్ భూరాజ్యమేని కోర
అట్టి జానకి, ప్రాణాలకంటె ప్రియయు
నైన యా సీత, బ్రదికియుఁగానఁబడునె. 915

జానకి లేకున్న నేను పోవుదుఁ గాన
కాననుండుట మిథ్యకాదుగదవె
సీతకై నేఁ జావఁజెడి నీవు బ్రోవఁగ్గై
కయుపూర్ణ కామయై గ్రాలుఁగావె
సుత రాజ్యయుతకైక మృతసుతన్ దీనను
గౌసల్య దాసిఁగాఁ గనునెకాదె
సీత బ్రతికి యుండ జీవాలతో నేను
బ్రతికి యాశ్రమమున వఱలుదు నౌకా

జానకి హరింపఁ బడినఁ జంపఁబడిన
లక్ష్మణ! వదలి పైతు నా ప్రాణములను
హాస ముఖియగు జానకి యాశ్రమమున
నుండి నాతోడ మాటాడకున్నఁ జత్తు! 916

సీత బ్రతికి యున్నదొ లేదొ చెప్పుమి యనుజ!
యే ప్రమాదాన యసురులే దినిఁ దినిర
బాల సుకుమారి దుఃఖమున పడని సీత
ప్రకటముగ నా వియోగాన వ్యథల నగచు 917

కపటి దుష్టుండు రాక్షసుండు హాలక్ష్మణ !
యని యార్వ నీవును హతలినావె.

ననుబోలు స్వరమును వినినట్టి సీతయు
వడిఁబంప నను జూడ ! వచ్చినావె

వనమున సీతను వదలి యిప్పుడు నీవు
వెస వచ్చి యిటు కష్టబెట్టినావె

చల్లగ రాక్షసుల్ సమయంబు కనిపెట్టి
కడగ వారికి నవకాశ మిడితె

ఖరుని వధచే వగచి మాంస భక్షు లసురు
లింక సీతను దిని యుందు రిది ధ్రువంబు
ఇట్టి వ్యసనాలఁ బడి యుంటి నెల్ల గతుల
ఇప్పు డేమి చేతు ననుభవింపఁ బోలు: 918

అని సీతన్ దలపోయుచుండియె, కరం బట్లా జనస్థానమున్
గని యార్తుం డగుచమ్ము ఋచు శ్రమన్ గష్టంబునన్ దప్పికన్
ఘనమౌ నాఁకలిచేత శుష్కముఖుఁడై కాంతుల్ చనన్బర్ణశా
లను శూన్యన్ గని యాయుద్వేగుని గగుర్పాటొంది చింతన్ గనెన్ 919

-: రాముఁడు లక్ష్మణుని దూఱుట :-

ఆశ్రమమునుండి వచ్చుచు నార్తి నింక
నవియు లక్ష్మణున్ రాఘవుం డనియె మధ్య
ఏఁ సీతను విడి వచ్చి తిటకు నిట్లు
నేను నిను నమ్మిగద వీడినాను ప్రియను. 920

డి యిటకును సరగ వచ్చు
యు లక్ష్మణా! నాదు మనసు గొప్ప
శంశచేయుచు వాస్తవముగ
ోక్కలి చెందుచు నవి యు చుండె. 921

చ్చెడి నిన్ను భ్రాత! చూచి
న్న బాహు వదరె హృదియు, ననుచు
న సులక్షణుఁడైన లక్ష్మణుండు
ుఁ బొందియు రాము నార్తుఁ బలికె. 922

ా నేనె జానకిన్ వదల లేదు
గ్రవాక్కులె గెంట వచ్చినాఁడ
ోవు! మని నీస్వరంబువోలె
ష్టముగా సీత చెవిని బడియె. 923

ర్తస్వరము సీత యాలకించి
ాన నేడ్చుచు నిరత ములికి
మనుచుఁ ద్రోయు వెళ్ళ కపుడు
కమునకయి యంటి నిట్లు. 924

గూర్చు దనుజేశ్వరు నెవ్వనిఁ జూడఁబోము నీ
మొందుమీ వినిన మాటలొ యన్నవి కావెవండొ యి
పల్కె నసురల సైనను బ్రోచెడి యన్న యిట్టి గ
ోవుమన్ పలుకు లెన్నఁడుఁ బల్కఁడు నమ్ము జానకీ. 925

ుదుకొ యన్నకంఠ మవలంబించె యనం బోలు, ని
బుగఁ బ్రోవుప్రోవు మని వేరొ రాక్షసుల్ పల్కి యుం
లక్ష్మణ! ప్రోవుప్రోవు మని నన్నున్ గూర్చి యిట్లన్న యి
లు నమ్మఁబోకు చెడుబోటిఁ బోలె నేలా వ్యథల్. 926

చాలు పిఱికిదానవు గాకు స్వస్థ వగుము
బెంగపడకు ముల్లోకాల వీరుఁ డెవఁడు
రాము నోడింపఁ గలవాఁడు ప్రభవ మొంద
లేదు ప్రభవ మొందఁడు గెల్వలేరు సురలు. 927

వ. అని నేను చెప్పఁగా విని చైతన్యము వ్యామోహము పొందఁ
గన్నీళ్ళు విడుచుచు సీత దారుణముగా నాతో నిట్లనెను. 928

పుట్టె నామీద పాపపు బుద్ధి నీకు
అన్న చనిపోవఁ బసికట్టి నన్ను పొంద
నెంచుచుంటివి గాని నీ వెంత మాత్ర
మేని నన్నుఁ బొందగ లేవ యింక పైని. 929

ఆభరతు కుట్రచే రాము ననుసరింతు
వందుకే యన్న యేడ్చిన నరుగ వైతి
చాటుమాటుగఁ దిరిగెడి శత్రు వీవు
నాకొఱకె నీవనుసరించినావ యిటులు. 930

ఏదొ రామునికిని సంభవించుదాఁక
నక్క వినయాన వేచి యున్నావు గాదె
అందుకే యన్న యేడ్చిన నరుగ వైతి
నాకొఱకె నన్ను నుసరించినావ యిటులు. 931

ఇటులు జానకి యన వేగ నెఱ్ఱఁబడిన
కండ్లతో మోవి యదరఁ గంగారుతోడ
ఆశ్రమమునుండి శీఘ్రమె యరిగి యిటులు
బయలుదేఱితి" నని భ్రాత పలుక వినియు. 934

రాముఁ డపుడు మిగుల వ్యామోహ మొంది యు
అనియె లక్ష్మణునికి నార్తితోడ
ఇటులు సీత వదలి యేతెంచి యోసౌమ్య!
ఇపు డకృత్యము నొనరించినావు. 933

అసురుల్ పైఁబడి మించినన్ గెలుచుఁగా యన్నయ్యయం చీవు నా
దు సమర్థత్వ మెఱింగియున్, వదెన క్రోధోద్రిక్తయై యన్న యా
యసమోక్తుల్ విని, బైలుదేరితివిగా, యాక్రుద్ధ యాయాడుదా
ని సిసల్ కాని కటూక్తిచే జనకజన్ వీడి రా మెచ్చఁజూ! 934

జనకజ ప్రేరేపింపఁగ
ననువే కాని పనిచేసి యన్ని విధాలన్
విను క్రోధమునకు వశమై
యొనరింపవు నాదునాజ్ఞ యోసౌమిత్రీ! 935

కనక మృగం బయి యాశ్రమ
మునుండి నను దీసికొనుచుఁ బోయిన దగు నా
కనకమృగం బక్కడ శర
మునఁ గొట్టంగఁ బడి చచ్చి భువిపైఁ బడియెన్. 936

విలు సారించి శరంబు నెక్కిడియు నే వేగంబ గొట్టంగ జి
త్తుల మాయామృగ రూపమున్ విడిచి యెంతో భీతితో నార్చుచున్
అల కేయూరము లూను రాక్షసుని భీమాకారముం దాల్చి మై
థిలి భీతిల్లగ నా స్వరాన నఱచెన్ దీనంగదా వచ్చితే. 937

అటు రాముఁడు వడిరాఁగఁ గ్రి
దటిది యెడమకన్ను మిగులఁ దఱచుగ నదరెన్
తటుకున రాముఁడు తొట్రిలె
చటుకున నొడలిని వణంకు జనియించెఁ గడున్. 938

మఱి మఱియు దుర్నిమిత్తము లరసి రాముఁ
డపుడు సీతకు క్షేమమే యనుచుఁ బలికి
జానకిని జూచుటకు శూన్యమైన పర్ణ
శాల గనుగొని దుఃఖిత స్వాంతుఁ డగుచు. 939

అటు నిటులన్ భ్రమించు నటులై కరముల్ కడు వేగఁ జాపుచున్
అట నటఁ బర్ణశాలఁ గలయఁ గని ప్రేయసి సీత లేని యా
కుటి శిశిరానఁ బాడుపడి కొంచెము శ్రీ యది లేక యున్న య
చ్చటి సరసిం బలెన్ గని విచారమునం బడె రాముఁ డార్తుఁడై. 940

పువులున్ వక్షులు జంతువుల్ కమిలి మోముల్ వాడఁ జెట్లేడ్చుచు
న్నవి యట్లే, వనదేవతల్ చనఁగ క్షీణంబౌచు శ్రీ పోవ నె
ల్లవి నష్టంబయి, చర్మమున్, గుశలు చల్లంబడ్డటుల్ కాఁగ, ద
ర్భవి చాపల్ చెదరంగ, శూన్యపుఁ గుటిన్ రాముండు కన్చేడిచెన్. 941

హరియింపంబడెనో భుజింపఁబడెనో హా! మాయమై పోయెనో
తరులన్ దాగెనొ భీరువౌచు వనమున్ దానాశ్రయించెంగదో
విరులన్ బండ్లను గోయ నేగెనొ జలంబే తే[illegible]నదీ సీమకో
సరసీ ప్రాంతమొ పోయెనో యని సమస్తం బేగి కాంచం డెటన్. 942

తరువున నుండి తరువునకు
గిరినుండి గిరి నదినుండి గిరికిన్ నదికిన్
పరువిడు, విలపించుచుఁ గడుఁ
తిరుగు. వెతల బురద జలధి దిగఁబడి పోయెన్. 943

వ. అట్లు శోకసముద్రమునఁ బడి పోయి రాముఁ డిట్లు విలపింప సాగెను. 944

## —: సీతకై రాముని విలాపము :—

కడిమిపూఁ బ్రియుఁ బ్రియున్గడిమిరో కంటివే
సుముఖి సీత నెఱుంగుచో వచింపు

మిసిమిచివురుఁ బోలి పసుపుఁ బుట్టముఁ దాల్చు
*బిల్వస్తనిని గన్న బిల్వ! చెపుమి

అర్జున ప్రియుఁ బ్రియు నర్జున! భీరువౌ
సీత బ్రదికియున్నఁ జెపుమి త్వరగ

చివురు పూవుల నిండిన వనస్పతి కకుభ
మా! కకుభోరు నర్థాంగిఁ దెలుపు.

భ్రమరములు ముసురుచుఁ బాడ వఱలు తరువ
తిలకమా! తిలక ప్రియ తీరు తెలుపు
శోక హతచిత్తుఁడను నైతి శోకహారి!
ఓయశోక! యశోకుఁగాఁ జేయు నన్ను. 945

నీకు నాపయి దయ నెగడినచోఁ జెప్పు
పక్వతాళస్తనిన్ బత్నిఁ దాళ!
నీవెఱింగినఁ జెప్పు నిశ్శంక
నేరేడు ఫలకాంతి నెగడు ప్రియను

---

* బిల్వ=మారేడు, అర్జున=మద్దిచెట్టు, గన్నేరు కకుభ=మద్ది.
తిలకము=బొట్టుగుచెట్టు

నీవు చూచినఁ జెప్పు నిండియుంటివి పూల
కర్ణికారా! కర్ణికార హారను
నీయాడులేళ్ళతో నెటఁ బోయెనా చెప్పు
మృగమటు కను మృగదృశను మృగమ!

అనుచు చూత నీప కురవ పనస దాడి
మానస ధవాది వృక్షాల మల్లికలను
మాధవీ కేతకీ చంపకాది లతల
వని నడుగుచు నున్మత్తువలెను దిరుగు. 946

గజకరోరును గజ! కనుఁగొన్న చోఁ జెప్పు
మెఱిఁగి యుందువు పతిన్ కరివరేణ్య!
ఇందు ముఖిని ప్రియ వీక్షించి యున్న చో
వ్యాఘ్రము! స్వేచ్ఛగఁ జెప్పు భయము లేదు
ప్రియురాల! దవ్వుల వీక్షింపఁ బడితివి
చెట్లచాట్లగుచు భాషింప వేమి
ఆగు మాగుమి యోవరారోహ! దయలేదె
మేల మాడవ యుపేక్షింతు వేల

పసుపు పట్టుపుట్టమె తెల్పె వడిగ నిన్ను
పరువిడఁగఁ గంటి నాగుమి ప్రణయ మున్న
చారుహాసిని! నిన్ను హింస సలుప రెవరు
ఇట్లు వ్యథఁ గుంద నన్నుపేక్షింపఁ దగదు. 947

అనస—వేగిసచెట్టు

ఒకచోఁ బిచ్చెక్కిన యటు
సకియ నట వెదకుటలోన సంలగ్నుండై
ఒకటే తిరుగును వనులు కొ
లఁకులు నదులు గిరులు నిలబడ డెచటన్. 954

అటుల మహావన మరయుచు
నటు నిటు జానకిని గూర్చి యరుగును తిరుగున్
నట నిఁక నిరాశుఁ డయ్యును
నటునిటు మరల మరలఁ జని యాయాస పడున్. 955

ఇఁక శూన్య మాశ్రంబును
వికలంబయి ధ్వంసమై వివిధాసనముల్
వికలాత్మతఁ గని రాముఁడు
స్వకరములు గ్రహించి యేడ్చి పలికెను నిటులన్. 956

ఎటరా, జానకి, లక్ష్మణ !
ఎట కేదేశ మిటనుండి యేగెర చెపుమీ
ఎట కెవరు హరించిరి మఱి
ఎటు లెవ్వరిచేతఁ బ్రియ భుజింపంబడియెన్. 957

తరువుల చాటునఁ బడి, నను
పరిహాసముచేయ నీవు వలఁతువ యేనిన్
పరిహాసం బిఁకఁ జాలును
పరమార్తుని నన్ను నిపుడె పడయుము సీతా ! 958

ఏలేళ్ళ శిశులు నీతో
తేలుచు నాడుచును నమ్మి తిరుగుచు నుండెన్
ఆలేళ్ళ శిశువులును నీ
వే లేమిని కంట నీళ్ళ నిడి తలపోయున్. 959

పురుషవ్యాఘ్రము ! క్షణాన సీత వెదకన్ బూర్ణంబ యత్నింతమే
త్వరగాఁ బోయి వనాన నీవు తలఁపన్ బాగొప్ప గాలింతమే
పరితాపంబును బొందరా దనుచు సౌభ్రాత్రంబ యేపార వా
విరి సౌమిత్రి వచింప, నట్ల యని యన్వేషింపఁగా సాగిరే. 966

విపినంబుల్ గిరులున్ నదుల్ గుహలనన్వేషించుచుం బోయి వా
రపు డెచ్చోటను సీతఁ గానరు మనం బాందోళనం జెంది భ్రా
తపయిన్ రాముఁడు చేయి యాన్చి యిటు చింతన్ బల్కె సౌమిత్రి భ్రా
త ! పడంతిన్ గన మేమి చేత మన బాధన్ లక్ష్మణుం డిట్లనెన్. 967

ఇదె వీక్షింపుము దండకాటవిని నన్వేషించుచున్నాము గా
సుదతిన్ మైథిలి నింకఁ జూచెదు; బలిన్ సూక్ష్మంబ బంధించి యా
పిదపన్ విష్ణువు భూమిఁ బొంది నటులన్- వేగఁబుగా నంచు నీ
విధి సౌహార్దముతోడ లక్ష్మణుఁడనం బెన్జాలి రాముఁ డనెన్. 968

వనముల్ విచ్చిన తమ్మిపూల కొలఁకుల్ పల్శైలముల్ కందరా
లను కానల్ సెలయేళ్లు కొండచఱియల్ సర్వంబు గాలించి యెం
దును ప్రాణంబులకంటె గొప్పదయి విందుల్ సేయు, నాసీతఁ జూ
డనె యంచున్ విలపించుచున్ క్షణము వైక్లబ్యంబుతో గ్రుక్కుచున్. 969

కడు సంతాపము బొంది యొళ్ళు సడలన్ గాటంపు బుద్ధే చనన్
వడిఁ జైతన్యముపోవ దైన్యమున పైశంబ నిట్టూర్చి ప్రే
ముడి సీతా ! యని బాష్ప గద్గదిక రాముం డేడ్వ సౌమిత్రి యూ
రడిలన్ జేయుచుఁ జేతు లొగ్గి వివిధాలన్ ధార్మికుండై యసన్. 970

విని రాముఁడు భ్రాత పెదవు
లనుండి జాఱిన పలుకుల లక్ష్య మిడక వా
ని ననాదరణము చేయుచుఁ
దన ప్రియ సీతను మఱిమఱి తలఁచుచు నేడ్చెన్. 971

తన ప్రియ సీతను రాముఁడు
కనకయె కనుచున్న యట్లు కామార్తుండై
అనుభూతిని మాత్రమె యెఱుఁ
గ నయి, తెలుప రానియట్లు కడు విలపించెన్. 972

పువు లనినన్ బ్రియ మగుటన్
బువుఁబోఁడీ ! ప్రియ ! యశోకపుం గొమ్మలతో
మివులఁ గననియటు నీదు త
నువు గప్పుకొనుదువె శోక నోదన మిడకన్. 973

నునుపగు ననంటి బోదెల
నునుపును గొను నీదు తొడలు నునుపనఁటులతో
గననటు దరికొని యుండియు
నిను దాచుకొనంగ లేవు నిన్నిటు దేవీ ! 974

పరిహాసం బిఁక జాలును
తరుణీ ! సీత ! యిది బాధ తద్దయుఁ గూర్చున్
మఱికొండ గోగు వనమును
దరిసియె గొల్చెదవు దేవి దయగొను భద్రా! 975

అలసిన నా కుపహాసం
బులతోఁ బనియేమి ప్రియరొ! ముదమిడు మిపుడే
వలదిఁక నుపహాసము నా
కిల నుపహాసంబు గూడ నిఁక రుచి యిడదే. 976

పరిహాస ప్రియ వనుచును
నెఱుఁగుదు నీశీలంబుగూర్చి యిఁకఁ జాలునుతే
మఱియందు విశేషించియు
పరిహాసము నాశ్రమమున వల దిఁకఁ దగదే. 977

ఇటు రమ్మి విశాలాక్షీ !
యిటు నీయీ పర్ణశాల యిదె శూన్యంబౌ
స్ఫుటముగ ప్రియ తినఁబడెనో
కట! హృతయో యేడ్చు నన్ను గనుగె యుపేక్షన్. 978

కనులన్ నీరిడికొని యిదె
కను లక్ష్మణ! లేళ్ళ కదుపు కట! ప్రియ నసురుల్
తిని రని యను హాయార్యా!
చనితి వెటకు నయ్యో సాధ్వి! సరస సువర్ణా! 979

ఇపు డాకైక సకామ య
యి పొంగి పోవు నిను బట్టియిఁక దేవీ!
అపుడో నీతో వచ్చితి
నిపుడో యిదె నీవు లేకయెటు లేగెదనే. 980

ఎటు శూన్యం బంతిపురిని
కటా! ప్రవేశింపఁగలనొ; కని నను జనులం
ద్రిటు; నిర్వీర్యుఁడ నని ప్రియ
నటు పోఁగొట్టు కొను పించు నని యుదయుఁ డనిన్. 981

వనవాసము తీర్చిన నను
జనకుఁడు కుశల మడుగఁ గనఁ జాలుదు నెటులన్
జనకుఁడు నిను జూడక నను
గని సుత ప్రేమను దపించి కను మోహంబున్. 982

ఇకఁ బోని భరతుఁ డేలెడి
సకల మఁగు నయోధ్యపురికి జనఁబో నిటులై
నకి లేని స్వర్గమో నా
కిఁక శూన్యం బగుచుఁ దోఁచు నెల్లపుడై నన్. 983

వనమున నన్ను విసర్జించితియె
చనుమి యయోధ్యాపురికి సౌమిత్రి! వడిన్
వినుమీ సీతను విడి ల
క్ష్మణ! నే జీవింపలేను చనుమీ తొరగా. 984

కరము బిగియార భరతుని గౌఁగలించు
కొనియె నామాట గాఁగ వాకొనుమి యిట్లు
రాముఁడే యనుజ్ఞను నిడె రాజ్య మెల్ల
పాలనము చేయుమీ నీవు భరత! యనుమి. 985

జనని కైక సుమిత్ర కౌసల్య యిపుడు
న్యాయరీతిని నభివాదనంబు చేయు
ఏను చెప్పిన రీతి గావించు నీవు
యత్నపూర్వకమ్ముగ రక్ష యాచరింపు. 986

శత్రుసూదన సీత నాశంబు గూడి
విస్తరముగ జననికి నివేదనంబు
చేయు మని దీనమ్ముగ వచింపఁ బిదప
వికలముఖుఁ డయి సౌమిత్రి వెతలఁ బడియె. 987

—: రాముని శోకము :—

వ. అప్పు డారాముండు ప్రియాశూన్యుండయి శోకముచేతను మోహంబు చేతను పీడింపఁబడి అసలే యార్తుడై యున్న సోదరుని కింకను విషాదము గలిగించుచు తాను మరల నింకను విషాదము పొంది నిట్టూర్చి యేడ్చుచు లక్ష్మణునితో నిట్లనెను. 988

క్షితిలో నను బోలెన్ దు
ష్కృతమును గావించినట్టి రెండవ వాఁడో
మతిఁ గనిపింపఁడు! వెతపై
వెత వరుసగ నయి హృదయము వెస భేదించున్. 989

మును బుద్ధిపూర్వకంబుగ
క్షణక్షణము చేసినట్టి కలుషము లెల్లన్
కన నిపుడు పండెఁ గనుకనె
వనటపయిని వనట నేను పడుచును మంటిన్. 990

మొదటన్ రాజ్యము పోయెను
పిదపన్ బంధుల విరహము పితృ నాశనమున్
పిదపన్ మాతృ వియోగము
నొదవియు నన్నియును బెంచు నుద్వేగంబున్. 991

వనికిన్ వచ్చిన తఱి ల
క్ష్మణ! సర్వవ్యథలును క్షయమే యయ్యెన్
ఘన సీతా విరహముచే
ననలము కాష్ఠాలఁ బోలె నవి మఱి పెరిగెన్! 992

వదెన యిటు రాక్షసునిచే
వదపడి బల్మిని హరింపఁబడి మింటను పెన్
వ్యథ భీతిని బాఱు మనుచు
వదెవదె విలపించి యుండు స్వరము వణంకన్. 993

మురు వగు కుంకుమమునకును
నెఱి యగు చందనమునకును నెలవయి సొంపై!
తిరుగు ప్రియురాలొమ్ము దైత్యులు
కొఱికి తినఁగ నెత్తు రోడఁ గూలియె యుండున్. 994

నునుపై స్ఫుట మృదు సంభా
షణ గలిగి కురుల బరువున సరి వంగిన దౌ
యనుగుం బ్రియమోము ఖల దై
త్యుని నోటఁ బడి గ్రహభుక్త తుహిన కరుండా. 995

మురువగు ముత్తెపు సరులకు
నిరవై నా ప్రణయిని మెడ నిక్లే త్రుటిలో
తురిమియు రాక్షసులును సె
త్తురు నిజముగఁ గ్రోలియుంద్రు తూర్ణము యకటా. 996

వనిలో విజనములో నా
కనుమొఱగి ప్రియను నసురులు గ్రక్కున లాగన్
నను దలఁచి పొడుగు దీనపుఁ
గనులన్ గని కురరివోలెఁ గడు నేడ్చెను బో 997

మిక్కిలి యుదార శీలము
నెక్కొను మీ వదెన మున్ను నిడుదగు శిలపై
గ్రక్కునఁ గూర్చుండి నగుచు
వాక్కులు నీతోడఁ బలికె స్వచ్ఛస్మితయై. 998

వరనదియగు ఈ గోదా
వరి ప్రియురాలికి నిరతము బహుళ ప్రియ, ఈ
తటి నటు చను నని తలఁచెద
నరుగద యొంటరిగ నామె యనయం బెపుడున్. 999

నళినానన నళిన విశా
లలోచన నళినములు గొను లాలసఁ జనెనో
నళినముల కెపుడు పోవదు
నళినములను గోయఁ జనదు నను విడి యెపుడున్. 1000

విరిసిన తరువుల వనమిది
మురువగు పలు పక్షి తతులఁ బొలుపయి యుండెన్
యెకరిగెనొ వని; కిటులనఁ దగ
దరుగద యొంటరిగ నామె యతి భీరువుగా! 1001

సవితా! కృతా కృతజ్ఞుం
డవు సత్యాసత్య కర్మలకు సాక్షివి నా
కువలయదృశ జనకజ యెం
దు వెళ్ళెనో, హృతయొ, వ్యధితుఁడఁ దొరగాఁ జెపుమీ. 1002

అఖిల లోకాల నీవరయునిది లేదు
అన్ని సంగతులను నీవ యరయు దెపుడు
పవన! కుల పాలినిని నామపత్నిఁ గంటె
దొంగిలిరొ చంపిరో లేక త్రోవఁ గలదొ. 1003

అని శోక వశుం డయి చే
తన లేక విసంజ్ఞుఁ డగుచు తలచేడ్చెడి రా
ముని గని యదీనుఁ డగు ల
క్ష్మణుఁ డనె న్యాయమున నుండి కాలోచితమున్. 1004

వెత వర్జింపుము, ధృతి గొను
సతతోత్సాహమున వెదకఁ జాలుదు సీతన్
సతతోత్సాహము గల నరు
లతిదుష్కర కర్మ మైన నందరు వ్యథలన్. 1005

అని యతి పౌరుష మొప్పఁగ
వినిచెడి సౌమిత్రి నుడుల విని రాముండున్
గణియింపక ధైర్యము విడి
వనటను గడు పొంది మరల వ్యథితుం డయ్యెన్. 1006

## —: రాముఁడు రౌద్రావేశము పొందుట :—

వ. అట్లు దీనుఁడై యున్న రాముండు దీనమైన వాక్కుతో లక్ష్మణుని కిట్లనియె లక్ష్మణా! నీవు శీఘ్రముగా గోదావరినది దగ్గఱకుఁ బోయి సీత తామర పువ్వులు తీసికొనుటకు వెళ్ళిన దేమో అని రాము డనఁగా లక్ష్మణుఁడు తీర్థవతి యైన గోదావరి దగ్గఱకుఁ బోయి రామునితో ఇట్లనెను. దేవులలో ఈమెను గూర్చి యార్చినను నా మాట ఎవరును వినుట లేదు. క్లేశములను నశింపఁ జేయు సీత యెక్కడున్నదో తెలియుటలేదు" యని యిటు లక్ష్మణుఁ డనఁగా గోదావరినది దగ్గఱకు వెళ్లి సీత యెక్కడ అని యడిగెను అంత. 1007

చంపఁ దగు రావణునిచే హరింపఁబడిన
యట్లు చూచియు భూతంబులైనఁ జెప్ప
వామెఁ గూర్చి, గోదావరియైన నామె
జాడ రామునికిఁ జెప్పఁ జాలదయ్యె. 1001

అటు భూతంబులు సీత జాడ వ్యథితుండౌ రాముతోఁ జెప్పమిం
తట నంచున్ కడుఁ బ్రోత్సహించిన నటన్ దద్రావణ త్రస్తయై
యటు గోదావరి దుష్ట రావణుని యా యాకారమున్ కర్మలున్
కట! లోనందలపోసి రామునికి వక్కాణింప దా భీతితో. 1009

అటు గోదావరి సీత జాడలను నావంతేని వాక్రువ్వ కుం
డుటఁ జిత్తాన నిరాశుఁడై కుమిలి తోడ్తో లక్ష్మణుం బల్కె న
క్కట! గోదావరి సీతఁ గూర్చియును వక్కాణింప దీకష్ట మ
చ్చట నా తల్లికి మైథిలాది పతికో సౌమ్యా! యెటుల్ చెప్పుదున్. 1010

అటు రాజ్యంబును పోయి యా యడవిలో నాకో యలమ్మో యెదో
యిటు భక్షించుచు జీవముల్ గడపు నాకీ కష్టముల్ తోచ రా
నటు సంతోషముపెట్టు సీత కట! యీనాడెట్టి కష్టంబు లె
చ్చటఁ దాఁ బొందుచు నున్నదో యెటకు నిచ్చం బోయెనో యక్కటా.
1011

జ్ఞాతులున్ లేక యాజానకిన్ గనక మే
ల్కొనిన నాకును నిశల్ చనవయింక
సీత కన్పించుచోఁ జేరి మందాకినిన్
ప్రస్రవణ జలస్థలాలఁ గాంతు
ఈమహాబలమృగా లిఁక నాకు వచియింపఁ
దలచి నటు తదింగితాలు తెలుపు
ఇక వృక్షములు మాకెల్లఁ దెలియు నని
యన్నటు తల లిటు లటుల నూపు

ఏదిశ వయిపు సీత హరింపఁబడియె
ఆదిశ మృగముల్ పాఱి యధిపుఁ జూచె
అదియె పథి భువి యని మది ననుజుఁ డెఱిఁగి
తత్వచన సార మగు నింగితములఁ జూచె. 1012

అపుడు లక్ష్మణుఁ డన్నతో ననియె నిట్లు
'సీత యెక్కడ' నని నీవు చేరి యడగ
ఈమృగములు వెంటనే లేచి యిప్పు డిటుల
దక్షిణపు దిక్కు భువిఁ జూపెఁ దత్క్షణంబ. 1013

వ. అని అపుడు లక్ష్మణుండు మంచిది పోదము, ఈ దక్షిణదిక్కుగా పోదము. వదెన గుర్తులు ఏమైన గనుపట్టు నేమో ఎక్కడ నైనఁ గనిపించు నేమో చూతము" అనఁగా సరే అని రాముండు దక్షిణదిశగా బయలుదేఱె. ఇట్లు వారిరువురు భూమిపైపు చూచుచు ఒండొరులు మాటాడుకొనుచు పోవుచుండ దారిలో వారికి భూమిపైని పువ్వులు చెల్లా చెదరై పడి యుండుటను దారిలో నేలపైఁ బడియున్న పుష్పవర్షమును చూచి రాముండు దుఃఖితుఁడై దుఃఖముతో లక్ష్మణునితో ఇట్లనెను. 1014

చూడు లక్ష్మణ! రాలిన పైఁడి పొడులు
సీత నగలు పల్ మూల్యముల్ చెదరె నిచట
పైఁడిపొడులఁ బోలిన నెత్తు రోడి పడిన
చుక్కలను ధరిత్రి తడిసి చూడఁ బడియె. 1021

తలతు లక్ష్మణా! కామ రూపులుగ నున్న
రాక్షసులచేత సీత శీఘ్రముఁగఁ జీల్చి
చీల్చఁబడి భుజింపఁబడెనొ చేరి పిదప
దొంగలింపఁబడెనొ యేమొ తొరగఁ జూడు. 1022

ఆమెకై ఘోరముగను పోరాడి నట్టి
యిర్వు రసురుల యుద్ధంబు నిచట జరగె
ముత్తెముల సరుల్ బంగారు భూషణములు
గల ధను సిది యెవరిదో భగ్నంబ యయ్యె. 1023

అసురులదో లేక ఘనులైన యమరు లదియొ
లలిత రవిఁ బోలి వైడూర్యగుళిక లొప్పు
పసిఁడి కవచ మెవ్వరదియొ భగ్న మౌచు
మహిని బడియుండి యొప్పు లక్ష్మణుఁడ! కనుము. 1024

శత శలాకలు దివ్యస్రజాలు గలుగు
గొడు గెవరిదో దండము చెడి పడియె భువిని
పసిఁడి కవచములు పిశాచ వదనములను
భయద తను వొప్పు ఖరము లెవ్వరివొ కూలె. 1022

మండు నగ్నిఁ బోలి ద్యుతుల నిండిపోరి
ధ్వజ మలరు యుద్ధరథ మిదెవ్వరిదొ కూలె
రథపు టిరుసుల వంటి పరాలు పైఁడి
నగలఁ దగిపడె, నేదైత్యనాథు నిదియొ. 1046

చూడు లక్ష్మణ! శరపులు కూడియున్న
యమ్ముల పొదు లివి ధరిత్రియందు పడెను
కేలులోఁ గొరడాయుఁ గళ్ళెలు దాల్చి
భువిని బడియున్న సారథి యెవని వాఁడొ. 1027

సారథిని జంపిన మహాబల సహితు డెవఁడు
పురుషవర! చామరంబులు కరములందు
వ్రేల తలపాగ మణికుండలాలు దాల్చి
అనిని బడిన చామరధారి వనిత లెవరు. 1028

స్పష్టముగ నిది యెట్టి రాక్షసుని పదము
ఇతర జీవితము లనంత మెనయఁ జేయు
ద్వేష మిది నేను వారితోఁ బెట్టుకొంటి
అందుకే యిన్ని కష్టము లందుచుంటి. 1029

సౌమ్య! కామరూపు లగురాక్షసులు నకట;
జానకిని దీనను దినిరో చంపి రొక్కొ
ఈ మహావనిన్ సీత హరింపఁ బడెనొ
జానకిని ధర్మ మది ప్రోవఁ జాల దయ్యె. 1030

జానకిని ధర్మమే ప్రోవఁ జాల నపుడు
ఆమెను భుజించి హరియించి నప్పటికిని
అనుజ! లోకములో నాకు నప్రియంబు
ఈశ్వరులు గాని యెట్లు గావింపఁ గలరు.

అన్న! లక్ష్మణ! గుణమును నన్నుఁ బొంది
యుయ్యె దోషము; చూడు నాయఖిల కరుణ
గుణములను ద్రోసి యెల్ల ప్రాణిని నసురుల
నణతు; రవివెన్నెలను ద్రోసి యుణఁచుఁ దమము. 1031

యక్షులునుగాని గంధర్వులైనఁ గాని
రాక్షసులు పిశాచములును ప్రాణులెల్ల
కిన్నరులును మనుష్యులు గాని క్షేమ మేమి
పొందఁజాలరు నాశక్తిముందు చూడు. 1032

కనుము లక్ష్మణ! నాయస్త్ర గణముతోడ
ఆకసం బంతయును గప్పి యాక్రమించు
మూఁడులోకాలఁ జరియించు బుధుల నెల్ల
అఖిల సంచారములనుండి యాపి వైతు. 1033

చంద్రసూర్యుల గతిని ధ్వంసంబు చేతు
గ్రహగతుల నడ్డెదనునగ్నిఁ గాని యడఁతు
గిరులఁ గూల్చెదఁ గాల్చెద తరుల; నబ్ధి
సరసు లడఁతు త్రిలోకనాశంబు చేతు. 1034

క్షేమముగఁ బియన్ నాకప్పగింపరేని
ఇప్పు డీక్షణంబున నింక నీశ్వరులును
లక్ష్మణా! గాంత్రు నాదు పరాక్రమంబు
అన్ని భూతా లెగిరిపోవు నాకసమున 1035

చూడు లక్ష్మణ ! నా వింట వీడఁ బడిన
బాణతతిచేత మృగములఁ బక్షితతుల
ధ్వంస మొనరింతుఁ జూడు ప్రపంచమెల్ల
తల్లక్రిందులౌ నటు చేతు వల్లకాడు. 1036

శ్రవణముల దాఁక బాణముల్ లాగివైచి
సీతకై నేఁడు వెంటనే జీవజగతి
సర్వ మపిశాచముగ నరాక్షసముగను
జలిపి వైచెదఁ జూడు లక్ష్మణ ! క్షణాన. 1037

మున్నె యున్నట్లు సుదతిని నన్ను మిన్న
సీత నిప్పుడ నాకప్పఁ జెప్పకున్న
దైవ గంధర్వ నరవన్న గావృతంబు
జగతి నెల్ల క్షణములో నాశంబు చేతు. 1044

—: లక్ష్మణుఁడు రాముని శాంతపఱచుట :—

వ. అట్లు సీతాపహరణముచే మిక్కిలి బాధపడుచు ప్రళయాగ్నివలె లోక నాశమునకై యేర్పడిన ధనుస్సువైపు చూచి నిట్టూర్చుచు ప్రళయకాలమందు హరునివలె జగమును దగులబెట్టఁ దలఁచుచు, నిదివరలో నిట్లు చూడరాని రాముఁడు క్రుద్ధుండుకాఁగా లక్ష్మణుండు ప్రాంజలియై వెలవెలపోయి యెండిన ముఖముతో నిట్లనియె. 1045

ఇందునియెడ లక్ష్మియు, రవి
యందును కాంతియును, గాలియందు గతి, భువం
బందును క్షమయును మఱి నీ
యం దుత్తమకీర్తి కూడ ననయం బుండున్. 1046

వ. కాన నొక్కరు చేసిన యపరాధమునకై లోకములను జంపితి వను నపయశము పొందఁ దగవు. సంగరమున కుపయోగించెడి ఆయుధములతోను పరికరములతోఁ గూడిన యీరథ మెవ్వరిదో విఱిగి యున్నదే. ఈ ప్రదేశ మంతయు డెక్కలచేతను రథపుఁ బట్టాలచేతను నలిగిపోయి నెత్తురు చుక్కలచేఁ దడిసి యున్నదే. ఇక్కడ ఘోరమైన యుద్ధము జరిగి నట్లున్నది. రాజకుమారా! ఇది యొకరివల్లనే జరిగిన సమ్మర్దము. ఇద్దఱది గాదు. వాక్య చతురా! ఇటు మహాబలమునకు సమయము వచ్చినట్లు గనఁబడదు. ఒకరికై లోకములను నాశము చేయఁ దగవు. 1047

ఘనతపము చేసి ఘన మ
యున కర్మలు చేసి రాజయిన దశరథుఁడున్
నిను రామా! పొందెను ఆ
ఘనులగు నమరు లమృతంబు పొందిన యట్టుల్. 1054

నీ గురువౌ దశరథుం డో
నీ గుణముల బద్ధుఁడయియె నీ విరహమునన్
దేవత్వంబును పొందెను
నీవిది భరతుండు చెప్ప, నిది వింటివిగా 1055

ఇటు సంభవించిన వ్యథను
నిటు నీవే సైపఁజాలవేనియు నింకన్
ఎటు సామాన్య లబలలును
ఇటు సైపంగలరె యన్న యిట్టివి రాఁగా. 1056

శోకార్తుఁడ వగు నీవిటు
లోకములన్ దేజస్సుచేత లోఁ గొని కాల్చన్
శోకార్తులైన జనములు
నేకడకున్ జని ముదంబు నెనయుదు రనఘా! 1057

ఊరడిలుము నరవర! యె
వ్వారికి నాపదలు వచ్చిపడ లేదార్తిన్
మారుతమున నగ్నివలెను
చేరు, క్షణములో నవి వడి పోవున్. 1058

లోక స్వభావమే యిది
వీఁక నహుషసుత యయాతి పెన నింద్రునితో
సాలోకత గని, మఱియా
లోకమునుండి చ్యుతుఁ డయ్యె లోఁ జెడు శోకన్ 1059

వ. ఓనరశ్రేష్ఠా! తత్త్వమును బుద్ధితో నాలోచింపుము బుద్ధి గల మహాప్రాజ్ఞులు శుభాశుభములను ఎఱుఁగుదురు. గుణదోషములు ప్రత్యక్షముగా చూడనట్టియు ఇది చేసితినని నిశ్చయింప శక్యముగాని కర్మలను తత్తత్పురుష వ్యాపారము లేకుండ నివృత్తి కలుగదు రామా! నీవును నాకు పూర్వము ఇట్లు చెప్పితివి. సాక్షాత్తు బృహస్పతి కూడ నీకు శిక్షణ ఇవ్వలేదు. మహాప్రాజ్ఞ! నీ బుద్ధిని దేవతలు గూడ పొందలేరు, శోకముచే నిద్రించిన నీజ్ఞానమును మేలు కొలుపు చున్నాను. ఓ ఇక్ష్వాకులశ్రేష్ఠా! దివ్యమును మానుషమును నైన నీ పరాక్రమమును దెలిసికొని శత్రువధకు ప్రయత్నింపుము.అందఱను చంపుట వలన నీకేమి లాభము గలుగును. నీవు ఆశత్రు లెవరో తెలిసికొని దారిని పెల్లగించి వేయుము. 1065

—: రామలక్ష్మణులు జటాయువును జూచుట :—

అన్న యయ్యును లక్ష్మణుం డనిన సూక్తి
సారము గ్రహించు రాముఁడు సరి గ్రహించి
ఆగ్రహంబును లోననే నిగ్రహించి
చిత్ర మగుపల్కు దించి వచించె నిట్లు. 1066

ఏమి చేతము తమ్ముడా! యెటకుఁ బోద
మేయు పాయాన సీత నీక్షింత మంచు
మన జనస్థానమె మనము కనుద మింక
అరిగి యన్వేషణము చేత మనియె భ్రాత! 1067

పెక్కు రాక్షసు లుందురు పెక్కుతరులు
పొదలు గిరి దుర్గములు దరుల్ పొలుచు
తగు మృగము లున్న గుహలు గంధర్వ కిన్న
రాలయము లొప్పు వెదకుద మందు మరల. 1068

నిన్నుఁ బోలి బుద్ధిమంతులు నియమితాత్ము
లాపదలఁ గదలరు గాలి నద్రులట్లు
అనుచు లక్ష్మణుం డన రాముఁ డపుడు వింట
శరము సంధించి యావనిఁ దిరిగి చూచె. 1070

ఇంక గిరివోలె నున్న పక్షీంద్రు భువిని
పడిన యాజటాయువు రక్తపక్షుఁ గాంచి
వీడెకాఁడొ జానకిని మ్రింగి పృథివి గృధ్ర
రూపమునఁ బడియుండెఁ జా ధ్రువము చూడు. 1071

ఆవిశాలాక్షి సీతను నపుడె తినియు
నెలమిఁ బడియున్న వీని వధింతు ననుచు
వింట శరము సంధించి యాపృథ్వి యదుర
ననఁగ నెత్తుగ గ్రక్కి జటాయు వార్తి బలికె. 1072

ఓయి దీర్ఘాయు: యెవతను నోషధిబలె
వెదకుచుంటి వామెను నాదు బ్రదుకు, రెండు
రావణుఁడు హరియించె: రాక్షసుండు
సీతను హరించుచుండ నీక్షించినాను. 1074

సీతఁ గాపాడ నెదురయి చేరినాను
రావణుని యుద్ధరథము ఛత్రంబు భువిని
పడఁగఁ గొట్టి విల్లు విరిచి వైచి సూతుఁ
జంపితిని రామ! నిటు నేను శ్రమను నలయు.

రావణుండు కత్తి గైకొని రయుము గాను
నాదు ఱెక్కల నఱకి జానకిని నెత్తు
కొనుచు నాకాశ మార్గానఁ జనియె; మున్నె
రావణుఁడు చంపె; నను జంప రాదు మరల. 107[illegible]

వాని రాముండు నాలించి బాష్పపూర్ణ
ముఖుఁ డగుచు సీతఁ గూర్చిన ముఖ్యవార్త
దెలిఁగి గృధ్రరాజును గౌఁగిలించుకొనియు
ధనువు పడవైచి భువిని తత్క్షణమె పడియె. 1076

అవశుఁడై భూమి నటు పడి యనుజుతోడ
ధీరతరుఁ డయ్యు రెట్టింపు మీఱు వ్యధను
ఏడ్చి యెగయూర్పు దిగయూర్పు లెగయ నూర్చు
నాజటాయువుఁ గని యన్న యనుజుఁ బలికె. 1077

ఘనమగు రాజ్యమె పోయెను
వనవాసము వచ్చె సీత ప్రణయిని పోయెన్
ఘనుఁడు జటాయువు చనిపో
యె నిట్టిది యలక్ష్మి యగ్నినేని దహించున్. 1078

సకలం బగు నంబుధిని ము
నుక లాడుచు దాటు, మైనను జన వికపాపాల్
సకలం బగు నంభోనిధియు
వికలం బయి యెండు నాదు వికటాలక్ష్మిన్. 1079

లోకం బెల్లను వెదకిన
నాకంటెను నింత గొప్ప నాశితభాగ్యం
బేకడ నైనను దొరకఁడ
నాకిటుల ఘనమయిన వ్యసనపు వల వచ్చెన్.  1080

వ. ఇదిగో చూడు ముదుసలి యైన గృధ్రరాజు నాతండ్రి స్నేహితుఁడు నాదౌర్భాగ్యముచే దెబ్బ తిని భూమిని పడియున్నాఁడు" అని రాముండు వచ్చి యుంచి పలుమార్లేడ్చు జటాయును తాకి పితృ స్నేహమును జూపుచు. 1081

ఱెక్కలు తెగిపడి నెత్తురు
మిక్కిలి దడిసి భువిఁ బడిన మేటి జటాయున్
నెక్కొను జనకుని మైత్రిని
నెక్కువ గని ప్రియ యేది యని యేడ్చియుఁ గూలెన్. 1082

పుడమిని ఖల రావణుచే,
బడఁ గొట్టఁబడిన జటాయుఁ బదెపదె గని రా
ముఁ డనుజుఁ బలికె జటాయువు
నొడలు నిమిరి కౌగిలించి యొగి జాలిమెయిన్. 1083

నిజముగ నాకొఱకయి యీ
ద్విజము జటాయు విటు పూని దితిజ హతంబై
త్యజియించెను నిప్పుడ దు
స్త్యజ మగు తన ప్రాణములను తమ్ముడ! కంటే. 1084

ఇంకను దీని శరీరము
వంకఁ గనుమి ప్రాణ మింక వదలదు దీనిన్
శంకయె లేదిట స్వరము వ
ణంకియుఁ గన్పడుఁ బయికి మనలఁగనసాగెన్. 1085

నాయన! జటాయు! యిప్పుడు
పాయక చెప్పఁ గలవేని వచియింపుమి నా
ప్రేయసి సీతను గూరిచి;
నీయెడ శుభ మవుతఁ గొట్టె నిన్నెటు లతఁడున్. 1086

సీతను రావణు డెందుకు
నీతతిఁ దీసికొనిపోయె నే యపరాధం
బాతనికి నేను జేసితి
నాతఁడు ప్రియుఁ దీసికొని పోవు సంతటి దానిన్. 1087

ఏమనేఁమని బోలెడి యా
మె మనోహర వదన మెట్టి మెయి నప్పు డుండెన్
ప్రమదయు జానకి మతి యా
సమయంబున నేమి పలికె సరిగాఁ జెపుమీ. 1088

ఆరాక్షసుఁ డెట్టి మహా
వీరుఁడు, తద్రూప మెట్లు వెలయును, నాతం
డేవిధముగ నేకర్మలు
గావించును, వాని గృహంబు కల దెచ్చోటన్. 1089

అటు విలపించుచు దీనత
నటు ప్రశ్నించుచును న్నయారాముని పై
పటు గని హీనస్వరమున
జటాయు వారాముతోడఁ జటుకునఁ బలికెన్. 1090

దనుజేంద్రుఁ డగు నారా
వణుఁ డాజానకిని గగన పథిని పవన దు
ర్దిన సంకుల మగు మాయను
గొని వేగమె యుపహరించెఁ గ్రూరుం డగుచున్. 1091

కడు నాయాస పడిన నా
నిడుదగు ఱెక్కలను నఱికి నిప్రియు సీతన్
పడఁతిని దీసికొని మిగుల
వడి దక్షిణదిశ మొగ మయి వరువుం దీసెన్. 1092

కడ తేఱుచుండె ప్రాణము
లెడనెడ దృష్టియు భ్రమించు నిదిగో రామా!
* పడిఁ బసిఁడి చెట్లు గాంతును
కుడి యెడమల వట్టి వ్రేళ్ళ కురులన్ జూతున్. 1093

---

* పసిడి చెట్లు, వట్టివ్రేళ్ళ కురులును జూచువారు చనిపోవుదురనిశకునజ్ఞులు

అతఁడు విందపు ముహూర్తం
బౌతఱిఁ బియుఁ తీసికొనుచుఁ బరువున్ దీసెన్
ఆతఱిని నష్టపోయిన
ప్రీతికరధనంబు స్వామి వేగమె పొందున్. 1094

అది రావణునికిఁ దెలియదు
గద, కావున నపుడుఁ గాంతఁగని కొనిపోయెన్
పదపడి యసురుఁడు గేలము
నెద గొనుమత్స్యమువలె నశియించును త్వరగా. 1095

జనకజను గూర్చి నీవును
వనటం బొందకుము నీవు త్వరగా దైత్యున్
పనిపి యము మందిరమునకు,
జనకజ తోడ విహరింతు సత్వరమింకన్. 1096

రామునితో నిటు పల్కుచు
వ్యామోహము పొంద నట్టి పక్షీంద్రునికిన్
ఆమృత్యువుతఱి మోమున
నామిషమును గలిసి నెత్తురట స్రవియించెన్. 1097

అవిశ్రవసుని పుత్త్రుడు
ఆవైశ్రవణుని యనుజుడు సాక్షాత్తుగనో....................
ఈవిధిఁ బలికి జటాయువు
వేవే దుర్లభ మసువులు విడిచెను కట్టా! 1098

---

* "విందపు" ముహూర్తమున పోయినది. దొరకును అని శాస్త్రము, కాన సీత దొరకునని భావము.

* రావణుడు సీత గైకొని వేవేగమెపోయి లంక వేగమె చేరెన్ అని చెప్పఁ బోయి పక్షి చెప్పలేక మరణించెను.

చెప్పు చెప్పని రాముఁడు చేతు లొగ్గి
పలుకుచుండ జటాయువు ప్రాణములను
పక్షి మేనును వీడి యభ్రంబు చేర
పక్షి కాళ్ళను తల వాల్చి పడెను భువిని. 1099

రాక్షసుల భూమి నింత కాలంబు హాయి
బ్రదికి, దంటకాటవి నేడు పక్షి పోయె
చాల యేండ్లుగఁ జిరముండి కాల మింక
తీరఁ బోయెఁ, గాలము దురతిక్రమంబు. 1100

అతి వీర్యుం డగు రావణాసురునితో నాసీతకై పోరుచున్
పితృ పైతామహ మైన రాజ్య మసువుల్ వేగంబ కోల్పోయి, యీ
క్షితి నాకై యుపకారమున్ జలిపె పక్షీంద్రుండు, సర్వత్ర యీ
గతి సాధుల్ శరణిచ్చువారు పశులంగానీ కనన్ వత్తురిగా. 1101

వ. పక్షీంద్రు డైన యీజటాయువు నాకయి మరణించి నందువలన కల్గినంతగా సీతను హరించినందువల్ల నాకు దుఃఖము కలుగుటలేదు. మహాయశస్వియు శ్రీమంతు డగు దశరథుఁ డెట్లు పూజనీయుఁడొ యట్లె ఈపక్షిరాజును పూజనీయుఁడు, మాన్యుఁడును. సౌమిత్రీ! వెళ్లి కట్టెలను తెమ్ము. నేను నిప్పు మండించెదను. నాకయి చనిపోయిన జటాయువును దహనపఱచెదము. రౌద్రుడైన రావణునిచే హతుఁడైన ఈ పక్షిరాజును చితిపైని ఉంచి దహించెదము. యజ్ఞశీలురకు ఆహితాగ్నికి పరివ్రాట్టులకు భూదానము చేసినవారి కెట్టి గతి గలుగునో అట్టి గతియు వీనికి కలుగునుగాక. ఓ మహాసత్త్వా! గృధ్రరాజా! నాచే సంస్కరింపఁబడి నాచే ననుమతింపఁబడిన వాఁడవై ఉత్తమ లోకములను పొందుము. అని పలికి ధర్మాత్ముఁడైన రాముండు దుఃఖితుఁడు తన బంధువునువలె చితిపయిని బెట్టి దహించెను. పిదప రాముఁడు లక్ష్మణునితోఁ గూడ అడవిలో స్థూలములైన మహామృగములను జంపి ఆపక్షిని తృణమును దర్భలను బఱచెను. ఆమృగమాంసమును ముద్ద చేసి ఆపచ్చని పచ్చికపైని

శకునములకు పైచెను. చనిపోయిన మనుజునికి వలె ఆపక్షికిని మంత్రములు పఠించి రాముఁడు పితృకర్మను జరపెను. పిదప గోదావరిదగ్గఱకు వెళ్ళి నది యందు స్నానముచేసి ఆగృధ్రరాజునకు వారు శాస్త్రప్రకారముగా నీళ్ళు వద లిరి. ఆపిదప మహర్షి తుల్యుఁడైన రామునిచే నాగృధ్రరాజు సంస్కరింపఁబడి పుణ్యలోకమునకు వెళ్లెను. ఆరామలక్ష్మణులును పక్షిరాజుపెడ స్థిరబుద్ధి యుంచి మరల సీతను అన్వేషించుటకై సురేంద్రులైన విష్ణుదేవేంద్రులవలె వనముఁ బ్రవేశించిరి. 1102

## —: కబంధుఁడు రామలక్ష్మణులఁ బట్టుకొనుట :—

ఇఁక నాపక్షికి రామలక్ష్మణులు నీళ్ళీరీతి నర్పించి జా
నకి నన్వేషణ చేయ నైరృతిదిశన్ బైల్దేరి వృక్షాల గు
ల్మకముల్ తీవెలు చుట్టుకొన్న బహుదుర్గంబౌ వనుల్ దాటి గం
డక శార్దూల భుజంగ సింహ మృగ గూఢారణ్యమున్ దాటియున్. 1103

చని యాపై నిఁక భ్రాత లిద్దఱు జనస్థానంబు శీఘ్రంబు దా
టినవారై యట మూఁడు క్రోశములు సూటిన్‌బోయి క్రౌంచాటవి
న్గని నానా ఘన పూర్ణమై ప్రమదమున్ బాటిల్లి యుండంగ నా
వని నానా ద్విజ సర్పజంతు యుత మొప్పం గాంచి రప్పట్టునన్. 1104

ఇటు సీతన్ గనఁ గోరి కాననములన్ వీక్షించుచం కందుఁ బ్రది
ప్పటచే నాగుచు నుండి పోవుచును తూర్పైపోయి యా భ్రాత ల
చ్చట క్రోశంబులు మూఁడు పోయి మఱి క్రౌంచారణ్యమున్ దాటిముం
గట వీక్షించిరి జంతు సంతత మతంగాఖ్యాశ్రమం బచ్చటన్ 1105

వ. మఱియు నా యాశ్రమంబు దాటి భీకర వ్యాళ కీర్ణంబైన
యొక్క మహారణ్యమును జూచి దానికి 1106

ప్రియపోవన్ వ్యథ మీఁదటన్ వ్యథయు ప్రాప్తింపంగ ఘోరంబు లి
మ్మెయిఁ గల్గెన్ రఘువీర! యిట్లు కనుగొమ్మీ సర్వభూతాల నీ
పయి ఏబాధ్యత లేదు దైవమున కీపైఁ గష్టముల్ పొంది యెం
తయొ వ్యామోహము గన్నయీ మనయవస్థల్ చూడుమీ లక్ష్మణా 1119

బలవంతులు శూరులు నిపుణా
స్త్రిలయిన వారలును గూడఁ దొరగా నాజిన్
ఇల కాలమునకు వశులయి
పలు బాధలు కనెద రిసుక వంతెన లట్టుల్. 1120

అని యపుడు మహాయశుఁడును
ఘన సత్య పరాక్రముఁడును గరము ప్రతాపం
బు నదగ్ర పౌరుషము గల
మన రాముఁడు స్వమతి నాత్మ మహితుం డయ్యెన్. 1121

బాహువులచేతఁ బట్టుకోఁ బడిన భ్రాత
లిద్దఱను జూచుచుఁ గబంధు డిట్టు లనియె
ఆకలిగొను నన్ను నృపాగ్ర్యులార! యేమి
కనెదరు మిము దైవమె నేను దినఁగఁ బంపె. 1122

అన విని యార్తిఁ బొందియును ప్రాప్త పరాక్రముఁ డౌచు, వీఁక ల
క్ష్మణుఁ డపుడేమిచేయు హితమౌనా మతిం గని యిట్లు పల్కె, ని
న్నును నను రాక్షసాధముఁడు నొప్పఁగఁబట్టెను, వాని గొప్ప కే
లును, వడిఁ గత్తిచే నఱకి లోకము నిర్భయముంబొనర్తమే. 1123

ఘనతను పూసె రాక్షసుఁడు కాని యచేష్టుని యాగ బాహ్య జం
తునుబలె రాజు చంపఁదగదున్గదె యుం చన నాలకించి నో
రును గడు దైత్యుఁడున్ దెఱచి క్రూరప వారి భుజింపఁ గోర వా
రును వెస దేశకాలము లెఱుంగుచు నుండిరి ధీరచిత్తులై. 112

ఈవిగర్హిత దారుణాకృతియె నీకు
నడరెడి నని స్థూలశిరుఁ డనెడి మౌని
నాకు శాప మీయఁగ నేను నయము మీఱ
ప్రార్థన మొనర్ప నాతఁడీలాగు పలికె. 1128

ఎపుడు రాముఁడు కేలు ఛేదించి నిన్ను
విజన వని దహించునొకొ యావేళ నీవు
నీదు శుభరూపు గనెదవు నీవు నన్ను
దను కుమారుఁగ నిపుడు లక్ష్మణ! యెఱుంగు. 1129

అపుడు శ్రీలతో రాజిల్లి యలరినాను
పిదప నింద్రుశాపమున నీవికృతి గలిగె
నేను తీవ్రతపము చేయ నెమ్మనమున
మెచ్చి బ్రహ్మ దీర్ఘాయువు నిచ్చె నాకు. 1130

అంత నాకు దీర్ఘాయువు నలరియుండ
నన్ను శక్రుఁ డేమి యొనర్చు నన్న ధృతిని
శక్రు నెదిరింప నతఁడు వజ్రంబు వేయు
తొడలు తలయు మేనునఁ జొచ్చి యడరె నిట్లు. 1131

అతని యాచింప నాతఁడు యముని యింటి
కనుప కపుడు బ్రహ్మనుడి సత్యంబ యగుత
అని పలుక నాకు నాహార మగును నేది
తొడలు విఱుగ దీర్ఘాయువు నడరు టెట్లు. 1132

అనుచు నేఁబల్క నింద్రుఁడు నపుడు నాకు
యోజనము పొడవగు చేతు లొసగెఁ గుక్షి
యందుఁ దీవ్రదంష్ట్రలు మోము నమరఁ జేయు
నే దవుల నున్న పశుల భక్షింతు లాగి. 1133

ఎపుడు రామలక్ష్మణులును నేగుదెంచి
కరముల నఱకెద రపుడె కనెదు స్వర్గ
మనియె రామ! ఈమేనితో వనిని నెల్ల
క్రాంచినవి లాగి తిను యోగ్యతయుఁ గలిగె. 1134

పట్టుపడును రాముండె యవశ్య మనెడి
బుద్ధితో దేహమును వీడఁబూని యుంటి
సరియె నీవు రాముఁడవు, నన్ జంప నెవఁడు
శక్తుఁ డేగాఁడ యని చెప్పె సరిగ మౌని. 1135

నేను * బుద్ధిసాయమ్ము గావింతు రామ!
మీవలన నగ్నిసంస్కార మావహింపఁ
బడియు మిత్రమై యుపదేశ మిడుదుఁ గూడ
ననఁగ రాముండు పల్కె లక్ష్మణుఁడు వినఁగ. 1136

నేను తమ్మునితో జనస్థానినుండి
హాయిగ నేగుచుండఁగ యశము గలుగు
సీత నా భార్య రావణుచేత పట్టు
కోబడియు నెందొ తీసుక పోఁబడెజుమి. 1137

వాని పేరె తెలియుఁగాని వాని రూప
మాతఁ డెటు లుండునో వాని యాప్రభావ
మేమొ వాని నివాసంబు నేదొ తెలియు
మిట్టి యీ యనాథులము మమ్మీవు గనుము 1138

* బుద్ధిసాయము=సలహాచెప్పుట.

ఆమెకై యార్తిఁ బరువెత్తు నట్టి మమ్ము
జాలి గని యుపకారంబు సలుపవయ్య
పీనుఁగులు విడిచిన మట్టి యెండు కట్టె
లిపుడు తెచ్చి గోతిని నిను దహింతు మిచట. 1139

ఈవు సీతను గూర్చి వచింపఁ దగుదు
ఎటకు నెవ్వఁడు హరియించి యేగెఁ జెప్పు
సరిగ తెలిసినచోఁ జెప్పి చాల శుభము
చేయు మని రాముఁ డడుగ వచించె నసుర. 1140

రామ! నాకు దివ్యజ్ఞాన మేమి లేదు
సీత నెఱుఁగను నను దహియించి నప్పుడేను
నాస్వరూపము పొంది జానకిని గూర్చి
యెఱుఁగు వానిని నీకు వచింతు నిపుడు. 1141

తగులఁ బెట్టక పూర్వము తగినరీతి
ఆయనుడుఁ డెవడొ వాని యఖిలవార్తఁ
జెప్పఁజాలను శాపానఁ జెప్పుశక్తి
చనియె నిదె నేను నిటు తెచ్చికొనిన వికృతి. 1142

కాని సూర్యుఁడు గుఱ్ఱముల్ కరము బడలి
యస్తమింపకుండఁగ గోతియందు వైచి
నను దగులఁబెట్టు మెవఁడు దైత్యుని నెఱుంగు
వానిఁ జెప్పెద నిపుడె న్యాయరీతి. 1143

నేను జెప్పిన వానితో నీవు మైత్రి
న్యాయముగఁ జేయు నాతఁడు హర్షమొంది.
సులభ విక్రముఁడౌచు నిన్ జూచి సరిగ
సాయమును దప్పకయె చేయు నోయిరామ! 1144

వచ్చాడు లోకాల నాతండు చూడ నట్టి
దేమియును లేమి సుమి రఘురామ! యింక
వేఱు కారణమున కయి నెద్దలి మున్ను
శోకముల జుట్టి వచ్చెను నీకె తెలియు. 1145

## —: సీత లభించు ఉపాయమును జెప్పుట :—

ఇట్లు కబంధుండు చెప్ప నరేశు లపుడు
గిరిని పగులును జూచి నిప్పరసి పెట్టి
రంత సౌమిత్రి మంటలు నసురుఁ జుట్టు
పలుప ఆమెద డాజ్యంబువలెనె కాలె. 1146

అతఁడు చితినుండి పొగలేని యగ్ని వోలె
వెలి శుద్ధవస్త్రాలు దివ్యంపు మాల
దాల్చి వెలుగుచు హృష్టుడై తత్క్షణంబ
యాకసముపై కెగిరె భూషలన్ని దాల్చి. 1147

వ. అట్లు ఆకాశమందు భాసిల్లుచున్న హంసలు గల విమానమున ప్రభతో మహాతేజస్సు గల దిశదిశలను వెలిగించుచుఁ గబంధుఁ డిట్లనెను. రామా! వినుము వాస్తవముగ సీత నెట్లు పొందఁగలవో చెప్పెదను. రామ! లోకమున సంధి విగ్రహయానాసనద్వైధీ భావముల నాశ్రయించిన యుక్తు లాఱుఁ గలవు. వానిలో నన్నియు విమర్శింపవలయును. 1148

ఉత్తమ స్థితినుండియు నూడి పడిన
వాఁడె యుత్తమ స్థితి పొందవలసియుండె
ఈవొ యుత్తమస్థితి పోవ హీనుఁడైతి
నదియును లేక భార్యయు పోవ వ్యసన మొదవె. 1149

ఎఱ్ఱి చేపలు, చక్రాల సెనఁగు మీలు
రామ! నడమీలు పంపాసరస్సునందుఁ
గలుగు చేపలు శరములన్ గరము పట్టి
సరిగ నూచల కాల్చి లక్ష్మణుడ యిచ్చు. 1168

పంపలో మత్స్యముల వంటిపండ్లొ కూడ
తినుచుఁ బద్మగంధము గల్గి తీయు నగుచు
సుఖము చల్లన నిడి రుజల్చొరని స్ఫటిక
పటుజలము తామరాకుతో బ్రాత యొసఁగు. 1169

గిరిగుహలన్ బరుండి వనిఁ గ్రేవఁ జరించు వరాహ యూథమున్
తిరుగుచు నీకు లక్ష్మణుఁడు తిన్నగఁ జూపును సంధ్యవేళలన్;
మఱి జలమానఁ గ్గోరి యటు మానక వచ్చియు ఱంకె లేయు ను
ద్ధుర వృషభంబులన్ బలెను దోఁచును నీకు మదించు మేనులన్. 1170

పువు లింపారెడి చెట్ల, పక్షులగణంబులిల్ కూయఁ జెందమ్మి పూ
లవిలాసంబులు గల్గి పంపసరసిన్ రమ్య స్వచ్ఛ శీతంపు నీ
ళ్ళు విరాజిల్లగ నొప్పు దృశ్యములు, నాలోకించి సౌమిత్రితో
కలియుం జొచ్చిన దుఃఖమున్ మఱతు వింకన్ రామ నీనెమ్మదిన్. 1171

అచటఁ బూవులతో నిండి యలరు తిలక
తరులఁ గానుగు చెట్లను విరిసి నట్టి
తామరపువుల, నీలియుత్పల సుమాల
నరసి నీపూర్వ శోకంబు మఱతు వపుడె. 1172

భువి నెవ్వండును పూలుకోయు; డవి యెప్డున్ వాడిపో: వెన్నఁ డెం
డవ యచ్చోట మతంగ మౌనికయి వన్యంబౌ పదార్థాలు తే
ర వనిన్ జేరి భరంబుచే నలయు ఛాత్రశ్రేణి దేహంబు నుం
డి వెసన్ రాలిన స్వేదబిందులును పూతే యాఁ దపశ్శక్తిచే. 1173

అట నావరౌనులఁ గొల్చుచున్ శ్రమణియై యత్యంతమున్ ధర్మమున్
పటుతన్ జేసి చిరంబుగా శబరి జీవాలూని-సర్వంబుచే
నిటులన్ మన్నన బొందు దేవసము-నిన్నే చూచి స్వర్గంబు బొం
దుటకై వేచియు యుండె, నాశబరి నిన్నుం జూచి చేరున్ దివిన్. 1174

ఇఁక బంపాతటిఁ బశ్చిమాభిముఖమై యేపారు గుప్తాశ్రమం
బొక టద్దానిని నాక్రమింపగ గజాలోర్వంగ లేవైనఁ గా
ని దపుస్ నాగము లెన్నొ యానగముపై నిండున్ మంతగర్షిచే
నితట క్షోణి యటన్ మతంగవన మన్ పేరన్ సువిఖ్యాతమౌ. 1175

నందన వనంబుఁ బోలియు
సుందర దేవవనమువలెఁ జొప్పగు వనిలోఁ
గ్రందుగ వివిధ విహంగమ
సుందర మగుచోట్లఁ జొచ్చి సుఖియింతువులే. 1176

పంప సరసికి ముందటఁ బాదపములు
పూలతో నిండు, నట ఋశ్యమూక ముండె
అది దురారోహము శిశునాగాభిరక్షి
తంబు మును శ్రేష్ఠముగ బ్రహ్మ తగ సృజించె, 1177

అట్టిగిరి శృంగమునఁ బండినట్టి నరుఁడు
కలను గన్న విత్తమును మేల్కొనియుఁ బొందు;
కెడుపడత గలపాపి యెక్కండు గిరిని
నిద్రఁబో నుప్త నసురుల్ వధింతు రటనె. 1178

పంపసరసిఁ దేలి మతంగ వని వసించి
గ్రాలు బాల నాగముల యాక్రందనంబు
వినఁ బడును, మబ్బువలె నుండు ద్విపము లెపుడు
దొరలు పోరి నెత్తురుతోడఁ దిరుగు. 1179

అవియుం జల్లనై సుగంధాన్వితమునై,
హాయి గూర్చు నీటిని గ్రోలి యడవిం దిరుగు
ఎలుగు బంటుల, నీలికెంపు లను వెలిగి
యోటలేని దుప్పులం గాంచి యొర్తు వార్తి. 1180

వ. రామా? ఆపర్వతంబున శిలాపిధానమును నొక్క గుహ గలదు. కాకుత్థ్సా దానిని ప్రవేశించుట చాల కష్టము. ఆ గుహకు తూర్పుద్వారమునం జల్లని నీరు గల హ్రదము గలదు. అది ఫలమూలములతో గూడి నానా మృగములచే నావరింపంబడి యుండును. అందే సుగ్రీవుండు నలుగురు వానరులతోం గూడి యొక మాఱు ఆపర్వత శిఖరంబుపైని ఒకమాఱు క్రిందను తిరుగుచునుండును అని కబంధుం డారామలక్ష్మణు లిరువురకుం జెప్పి మాల ధరించి సూర్యునివంటి రంగు గలిగి వీర్యముతో నొప్పెను. అపు డామహాభాగుండైన కబంధుని జూచి మంచిది వెళ్ళి రమ్మని దగ్గరగాం జని పలికిరి. అంతం గబంధుండును మీకార్య సిద్ధికై మీరును వెళ్ళి రండని పలికి బహులుదేజ సురూపియై శ్రీయుతుడై రవిని బోలిన దేహముతో పోవుచు రాముని జూచి స్వస్థుడవై మైత్రి చేయుము సుమీ అని పలికి వెడలిపోయెను. 1181

—: ఋశ్యమూక గిరిని జేరి శబరిని చూచుట :—

ఆకబంధుండు చెప్పిన యటు పడమర
దిశగం బంపాసరోవర తీర పథిని
వారు వెడలి యద్రులన్ దేసె లూరు తరులం
గనుచు సుగ్రీవుం గన్గొనం జనిరి ముందు. 1182

వారు కొండపదుల వాసంబు చేయుచు
పంప పడమటి తటి త్వరగ జేరి
చక్కని తరు లున్న శబరి యాశ్రమమందు
తరుల గనుచు శబరి నరసి రపుడు. 1183

శ్రమణి సిద్ధశబరి రాములక్ష్మణులను
గాంచి దోసి లొగ్గి కాళ్ళ వ్రాలి
అర్హ రీతి పాద్య మర్ఘ్య మాచమనీయ
మెల్ల వినయ మొప్ప నిచ్చె నపుడు. 1184

వ. అపుడు వ్రతమూని యున్న శబరితో రాముం డిట్లనియె.

ఇట విఘ్నంబులు పోవ ద్రోలుదె తపం బిచ్చోట వర్ధిల్లునే
ఇట నాహారము కోపమున్ నియతమై పేపార వర్తింతువే
ఇట నాయానియమాల నుందువె మనం బేపారునే శాంతితో
ఇటఁ గావించెడి వృద్ధ సేవ సఫలంబే చారు సంభాషిణీ! 1185

అని యిట్లు రాముం డనఁగా
విని సిద్ధ విశుద్ధ శబరి వినయముతోడన్
అనియెను రాముని తోడను
తనదు నమాయిక హృదయము తపమును తోఁపన్. 1186

నీదర్శనంబున నేఁడు తపసు పండె
జన్మ మిప్పుడుగదా సఫల మయ్యె
నీవు దేవవరుండ విటు పూజ లందుట
వ్రతము సిద్ధించె నర్చితులు గురులు
నీసౌమ్య దృష్టిచే నేను పావన నౌచు
పడయుఁ బోదును గాదె స్వర్గ మింక
నీప్రసాదంబున నేఁడె యక్షయ మైన
భువనంబులను పొందఁ బోవు చుంటి

నీవు చిత్రకూటము చేర నేను గొల్చు
ధీర ఋషులు విమానాల దివికేఁ జనిరి
ఇట్టి పుణ్యాశ్రమమునకు నీవు వత్తు
వని మహాభాగులు మహర్షు లనిరి గాదె. 1187.

అట్టి లక్ష్మణుతో వచ్చి నట్టి యతిథి
రాముని ప్రతిగ్రహింపుమి రాముఁ జూచి
అక్షయం బైన లోకాల నందఁగలవు
అనుచు వారన్న నుడులు సత్యంబు లయ్యె. 1188

వ. ఆ మహాభాగుల వాక్యములను విని పురుషశ్రేష్ఠా! నేను నీకయి పంపాసరస్సు తీరమునఁ గల వన్యఫలాదులను సంపాదించి యుంచితిని" అని శబరి పలుక ధర్మాత్ముఁ డైన రాముఁడు విజ్ఞాన యోగ్యతతో నిత్యము బహిష్కృతురాలు కాని శబరితో నిట్లనెను. దనుపుత్త్రుఁ డగు కబంధునినుండి మహాత్ము లైన మీగురువుల ప్రభావమును విని యుంటిని. నీకిష్టమేని ఆ విన్నదానిని ప్రత్యక్షముగాఁ జూడఁగోరుచుంటిని. అని రాముఁడు పలుక విని ఆ రామలక్ష్మణులకు కాఱుమేఘములవలె నుండి మృగ పక్షుల కలకలారావములతో నిండి యున్న యామహావనమును చూపి రఘునందన! ఇదే మతంగ వనము చూడుము. 1189

ఇట భావితాత్ములై యొసఁగు మాగురువులు
మంత్రయుక్తముగ హోమమ్ము లిడిరి
ఈనిమ్న వేదిని నెంతోవణకు కేల
కడు మాగురులు పూల కొన్క లిడిరి
ఈవేది నేటికి ఈనాగురుల తప
శ్శక్తిచే దిశల శ్రీఁజాయఁ జిమ్మె
ఈసప్త సాగరా లిపె చూడు ముపవాస
ముల ఋషుల్ చవలేక తలప వచ్చె

వారె యభిషేకములు చేసి వల్కలములు
చెట్ల అరవేయఁగ అర విట్లు చూడు
దేవపూజ నర్పించిన దివ్యసుమము
లుత్పలమ్ములు వాడక యుండెఁ గనుము. 190

కనవలసిన యది కంటిని
వినవలసిన దెల్ల నిపుడె వింటివి రామా!
అనుమతి యిచ్చినచో ఈ
తనువును త్యజియించి వైతుఁ దటుకున నిపుడే. 191

గురువులగు భావితాత్మల
దరికిని బోవంగ నిపుడె తలచుఁచు నుంటిన్
మఱి యిదియు మునుల యాశ్రమ
మరసియె వారికిని సేవ లటు చేసితిఁగా 192

అటు ధర్మయుక్తముగఁ జె
ప్పుట రామలక్ష్మణులు విని ముద మతులంబొ
నటుగని ఈ యద్భుత మెం
తటి దని రాముండు శబరి కనంతర మనియెన్ 193

'స్వేచ్ఛగా నీకు నిచ్ఛయు వచ్చినట్లు
అరుగు నీవల్ల భక్తితో నర్చితుఁడనె"
అనఁగ జడలొప్పు నా వృద్ధురాలు శబరి
చీర కృష్ణాజినము దాల్చి స్వేచ్ఛతోడ 194

ఆతటిని మేను త్యజియింప నాత్మనెంచి
రాము నాహుతి నగ్ని హోత్రంబునందు
తన్ను నాహుతి గావించి తగ వెలింగె
యగ్నివోలె మెఱసి స్వర్గ మరిగె శబరి. 195

దివి దివ్యాభరణాలు దివ్య వసనాల్ [illegible] గంధంబులం
త విరాజిల్ల మెఱుంగుఁ దీవియవలెన్ తద్దేశమున్ వెల్గఁ జే
సి వెసన్ రాముని ముందు [illegible] ప్రమొక్కి ధన్యాత్ములున్
సువివేకుల్ గను స్వర్గముల్ శబరి [illegible]న్ సమాధిస్థయై. 1196

తన తేజస్సున స్వర్గమున్ శబరి [illegible]ందం జూచి, దివ్యాత్ములో
ముని సిద్ధాత్ముల యా ప్రభావము, [illegible]ంబున్ పొంగ వీక్షించి మే
లును కాంక్షించెడి భ్రాత లక్ష్మణుని నాలోకించి ప్రావ్రుచెచ్చె ల
క్ష్మణ వీక్షించితె యా మహాత్ముల మహా[illegible]ాశ్రమ స్థానమున్ 1197

మృగముల్ వ్యాఘ్రములెట్లు నమ్మి మెలఁగున్ వృక్షంబులన్ పక్షు లె
ట్లు గుముల్ గూడి చరించునో, జలధు లిట్టుల్ కూడి తీర్థంబులన్
మిగులన్ శాస్త్రవిధిన్ జలాలిడఁ బితల్ సేవించు సంతృప్తి చెం
దఁ గడున్ తర్పితలై రొ వారిఁ గనుమీ నా చిత్తమున్ మో దిలున్ 1198

అశుభంబుల్ నశియించె మంగళములే ప్రాప్తించు ర
మ్మ శుచి స్థానము నిషదర్శనమునై పొల్పారు పంపా సర
స్సు సమీపింతము ఋష్యమూక గిరియున్ శోభిల్లె నిచ్చో; నిటన్
వసియించెంగద సూర్య సూతి బహుపుణ్యాత్ముండు సుగ్రీవుడున్. 1199

మదిలో వాలి భయాన, నల్వురు కపుల్ మన్నింప సుగ్రీవుఁ డీ
యదనన్ వాసముచేయు నిచ్చటనె, నెయ్యంబార సుగ్రీవునిన్
హృదిచూడన్ త్వర పెట్టుచుండె మన మింకీవేళనే పోదమా
తదధీనంబయి యున్నదేగదవె సీతాన్వేష ణోద్యోగమున్. 1200

వ. అని ఇట్లు పలుకుచున్న ధీరుడైన రామునితో లక్ష్మణుండు అన్నా! నడుపుము నామనస్సు కూడ మిగులఁ దొందర పెట్టుచున్నది. "అనిలక్ష్మణుండు

చెప్ప పిదప ఆ రాముఁడు లక్ష్మణుఁడును వెడలి యాపంపాసరోవరమును
సమీపించిరి. 1201

అటు మతంగ సరస మను హ్రదమందు
మునిఁగి వనముల సరసులఁ గనుచుఁ బోయి
రామలక్ష్మణుల్ చేరి దూరమున నుండి
రమ్య మైనట్టి పంపాసరస్సు గనిరి. 1202

సీ. పుణ్యమౌచు నుదార పురుషసేవిత మౌచు
తరులతల్ శుచి నీరు సరుల నొప్పి
కలువ తావ తెలికల్వల చెంగలువలచే
తెలు పెర్పు నీలి కంబళముఁ బోలి
అలరి పక్షులు కూయ నలరుఁ దోటల నొప్పి
భ్రమర ఝుంకారాల శ్రావ్య మగుచు
స్ఫటికాచ్ఛ నీరాలు శ్లక్ష్ణవాలుకలును
సెమిశుల స్పృత్యాలు నమరియుండి

చిలుక కొక్కెర బెగ్గురు లలరికూయు
తిలక వకుళ కుందాశోక తిందుక ధవ
కేతకాము లన్ నగలొప్పనాతిఁబోలి
క్రమ్ము వనిదరిన్ బంపాసరమ్ము దనరె. 1203

అట్టి పంపాసరసు రాముఁ డరసి యనియె
అనుజ! యీతటిన్ ఋశ్యమూకాద్రి గలదు
ఋక్షరజుసూతి సుగ్రీవుఁడిట వసించు
లక్ష్మణా! నీవరిగి వానరాగ్ర్యుఁగనుము. 1204

దీనజనుడ రాజ్యభ్రష్టుఁ డైనవాఁడ
సీతయందు నాసక్తమైచిత్త మడరు
భార్య సీత లేకుండ నే బ్రదుకఁజాల
అనుచుఁ గామార్తిఁ బలవలో పనుక లాడె. 1205

ఇది

చర్ల జనకగురుప్రాప్తవిద్యుఁడును వెంకమాంబా పుత్రుఁడునగు
చర్ల గణపతిశాస్త్రిచే అనువదింపఁడిన గణపతి వాల్మీకి
రామాయణసుధ యందు అరణ్యకాండము.
అరణ్యకాండము సమాప్తము

-: x :-



## — / ప్రచురణములు / —

1. సాహిత్య సౌందర్య దర్శనము (సమ[illegible]లంకార దర్శనము) రు॥ 35-00
2. గణపతిరావ[illegible]ణసుధ (బా[illegible]) 15-00
3. రఘువంశలహరి (పద్యములు : కాళిదాసు) 10-00
4. కుమారస్వామి విజయము (పద్య గద్యములు) 4-00
5. బుద్ధభగవానుని చరిత్ర (పద్య గద్యములు) 4-00
6. బ్రహ్మమీమాంసాదర్శనము (వ్యాస మహర్షి) 10-00
7. న్యాయమీమాంసాదర్శనము (గౌతమ మహర్షి) 4-00
8. వైశేషికదర్శనము (కణాద మహర్షి) 4-00
9. సాంఖ్యమీమాంసాదర్శనము (కపిల మహర్షి) 6-00
10. సిద్ధాంత తత్త్వదర్శనము (వ్యాస మహర్షి) 6-00
11. మహాభారత మీమాంస (1వ భాగము) 4-00
12. మధుర శాకుంతలము (నాటకము) 6-00
13. ఉత్తరరామ ప్రణయచరిత్ర (నాటకము) 5-00
14. ఉపనిషత్సుధ 1వ భాగము (మూల తాత్పర్య పద్యానువాదము) 5-00
ఈశకేన కఠోపనిషత్తులు)

,, 2వ భాగము 5-00
(ముండ మాండూక్య తైత్తిరీయ ఐతరేయములు)

,, 3వ భాగము (ఛాందోగ్యము) 30-00

,, 4వ భాగము (బృహదారణ్యకము) 20-00

సర్వ గణపతిశాస్త్రి,
33, కిర్లంపూడి లేఔటు,
వాల్తేరు -3.